# విషయానుక్రమణిక

## జూన్ 1957

# మహోపదానము

శ్రీ హారీత శివశర్మ

## 1

క్షీన జీవితమ్ము వృథామైన దన్నట్లు
నిలువెల్ల నిస్సార నీరవముగ
విరిగి కొమ్మలు రాలి విడివడి యాకులు
తనువెల్ల ముండితార్థప్రదముగ
విరవిరలాడి ఉర్వీరుహా మ్మఖిల తే
జఃక్రాంతి విక్రాంతి జర్జరముగ
ఉబ్బి వేళ్ళ మొదళ్ళ నుదయుంచు రుజచేత
కాండమ్ము సర్వమ్ము కార్శ్యముగను
పిట్టగూడ గూడుకట్టుకో ననువును
లేనిబ్రతుకు బ్రతుకలేనిదయ్యి
సగముచచ్చిమరియుఁ జావంగఁజాలని
శీర్ణ జీర్ణమైన చెట్టొకండు.

తలనిక్కించి, ధరాపరాగపటలీ
స్తంభంబునా నూర్ధ్వ ది
గ్వలభిన్ చూడ్కినిగుడ్చి, యుస్సురనుకో
గాలిన్ విసారించు శ
క్తి లయింపన్ గనుగొన్నదై, విధుర పం
కేజాత సంక్లిష్ట శై
వలి నిన్ బోలిన డెందమై, నిలుచు, దూ
ర్వా జీర్ణభూశృంగమై.

మరి గోత్ర మేమి సామాన్యమా? యనరాదు;
సుప్రసిద్ధమ్ము చరిత్ర తనది
తనవంశ మేమి నిత్యధ్వాంతసీమమా?
కాదు; విజ్ఞానమ్ముగల్గు విడిది

తనయున్కి నిష్ప్రయోజనమ? కానేకాదు;
ప్రతియొక్క కృషికి కావలెను తాను
తనశీల మేమి వ్యర్థమయినట్టిది కాదు
ప్రాజ్ఞవాగ్నికి నాటపట్టు తనువు
తనమహాజాతియొక్క ప్రాక్తనవిభవము
వట్టి సామాన్యమైనదా? వట్టి పేరు
నూరు లేనిదా? కాదు; మహోత్థవైభ
వప్రశస్త్రప్రశాస్తి—అన్వయముకలది.

ఈ యపదాన మేమిటికి?
యీకథలేటికి? పూర్వగాథ లే
లే యని వెక్కిరింతువు స
రే మరి యా ధరణీరుహాంబులో
లో అనుకొన్న మాట లెటు
లో, విననేర్తువయేని, సర్వమున్
నీయదిగాని దాని దన
నేరవు; నట్టి వహో కథావిధుల్.

## 2

జడమునుగాదు జీవితము;
జంగమతాస్థితిలేదు; పూన్కియున్
సడలుటగాని నిల్చుటకు
జాలదు; స్థావరమన్న యర్థ మీ
యెడను రహిల్లదే; ఇదియు
నెంతయు చిత్రము; తానుగా మరిన్
జడమును గాకపోవుటయు
స్థావరమై నిలుపోపకుండుటల్.

చిరచిరలాడి వేంచేయునో యెండ; యి
దేల నురక మండించు నన్న
జలజల గర్భిణీజలదమ్ము వర్షించు
నాకేల నురకను నానపెట్టు

# మ హో ప దా న ము

మందమారుతము రమ్యమైన నాకేమి
కారుకొమ్మల ఘులంఘులలు లేవు
ఈభూమి యీగంధ మేల నిర్వాసించు
బద్ధమైన దేహావిప్లవము జెడదు
వంధ్యజీవితమ్ము వంధ్యమ్ము బ్రతుకును
అగును వీనివల్ల నైనదేమి?
ఎండి తడిసి వాడి యివమేది నిత్యమ్ము
దుఃఖితాత్ముడగుడు ద్రోవగాక.

కాపురమ్ము చెడిన కళ్యాణి బ్రతుకును
కాంత వంతగూరు కాంతు బ్రతుకు
తల్లిలేని చిన్నపిల్లల బ్రతుకును
నేను బ్రతుకు బ్రతుకులెల్ల ఒకటి.

బ్రతుకునందున దుఃములున్నదే
వరములోపల శాపము లున్నటుల్;
బ్రతుకు కృత్స్నము దుఃఖమె యైనచో
బ్రతుకులేల మరేలను జీవముల్.

పరగలోపల నాత్ముడె యున్నచో
నెరుగడేల నతండును దుఃఖమున్;
మరి శరీరము సర్వము నష్టమై
విరిగి వాడిన కాన డిదేమిటో.

అగు శరీరము నష్టమునైనచో
తెగున యాత్ముడు? నంగము లూడినన్
తెగున యంగియు? చిత్రము లూహముల్;
పగరు వంతలు పట్టునె? ఆత్మకున్.

తనకు బట్టనియట్లు తటస్థుడై
తనరుచుండెడివాని; మహోన్నతున్;
కనవిచారము చేయగనేల నీ
వని విచారము చేయని ధూర్తునిన్.

మొదలులేదే, తుదయులేదే,
ఉదరుమధ్యముగూడ లేదే,
అట్టిడెట్టులు నాదు దుఃఖపు
గుట్టులను నెరుగున్.

ఆదిమధ్యము నోలియంతము
పాదుగాగల జీవలోకము
నాదుకొనగా నట్టిడెట్టులు
నూదికొనివచ్చున్.

ఎవరోవత్తురు; నేమొ చెప్పెదరు; నే
మే జేతుమం చుందురున్;
ప్రవచింతుర్ బహువర్షయోజనలు; రం
ధ్రాన్వేషకస్వాంతు లా
ర్జవదూరుల్ గత మేమి యంతయు భవి
ష్యత్కాలభోగ్యంబు కా
వివదింతుర్; తత వర్తమాన విధుర
క్రీడాభృశత్రస్తులై.

నాకున్ నేన, మరెవ్వరాదరు ధరన్,
నాకోసమై నేను నే
వో కోర్కుల్ బలిపించుకో, నుదిత భా
వ్యుత్కర్ష సృష్టి ప్రభా
ధీకమ్మై వెలిగించు జీవితము నం
తే గాని యాపిమ్మటన్
ఆకున్ పోకయు లేని సత్య మొకడై
యబ్బున్ శ్లథభ్రాంతిమై.

## 3

తన జని యిట్టులైనదని
తాల్చిన దుఃఖముగూడలోన నే
కనలిన నిప్పుగా, నివురు
గప్పని నిప్పునుగా, శరీరమం

## మ హా ప దా వ ము

దు నరనరంబులన్ సిలుగు
దోగిన నిప్పునుగా చెలంగినన్
తన నిలువెల్ల వేదన వి
థంబయి నిల్చినచెట్టు, చెట్టరమై.

అగుపడనో యేమో దీ
ప్రగరుద్రేఖగను వచ్చి వ్రాలవు పక్షుల్
అగుపించదు ఋతు వొక్కటి
ప్రగాఢ మధురమ్మృదు బంభర ప్రణవమ్మై.

నిత్యశిశిరమ్ము బ్రతుకుగా నెగడినెగడి
జీవితమ్మున నాస్థ బజితువైన
వృక్షమును రూక్షముగ మదివెట్టి జూచి
ధిక్ అననివాడు లేదు వర్ధిష్ణువెవడు.

గ్రామమధ్యమునందు వృక్షము
కష్టమై మరి నష్టమై
క్షేమమేది నిలంబడన్ మది
కీడు నెంచిన వారునై
భీమమౌ జమదగ్ని రాముని
బిట్టు గొడ్డలివోని ప్రో
ద్దామఘాతల జెట్టుగొట్టిరి;
దాపురించిన మృత్యువుల్.

కట్టెలుంగా గొట్టి గారియవెట్టి
కాల్చి బొగ్గులుజేసి కలగుండుజేసి
మసిజేసి విడిచిరి మ్రానును నిల్వ;
ఏమి నిల్చెనుచెట్టు; నేమియై మిగిలె;
చెట్టు తా బుట్టెను; చెట్టు తా పెరిగె;
చెట్టును మృత్యువు చెట్టగాగొట్టె.
చెట్టటన్నది లేదు; చేష్టలు లేవు;
చెట్టేమియయ్యెను, చేష్ట లేమయ్యె;

## భారతి

నక్కడ మాత్రమ్ము నంత ధరిత్రి
చిలువ వర్షపుజల్లుచే నింత తడిసి
మొలిచెను నొక నాల్గుమూడు దర్భలును.

చెట్టుసంగతి మరి పట్ట దెవరికిని;
పుట్టుట నిత్యమ్ము గిట్టుటగాగ
సాగె నావూరును సాగె నాజనము
దేహంబుపోయిన దేహియుగూడ
పోవునో పోవదో పొందు కుదిర్చ
యెరుకచే చేయరు నెట్టితర్కంబు;
పుట్టుట పెరుగుట గిట్టుటగాక
యేమున్నదని చింత నోమరుబుద్ధి;
తాము నిత్యమ్మని దర్పించి యెదను
శీర్ణవృక్షము గూర్చి చేయరు చింత.

ఈ యపదానమిట్టిద; య
హీనమహీతల జీవజాల దీ
ప్రాయత దుఃఖవారినిధి
వంటిది; శీర్ణవసుంధరారుహా
ధ్యాయిత నిట్టులై వివశ
మై తనుదాన వెలార్చుకొన్నదో
నాయెద సర్వముక్ గదలి
నందున దా నివమూరుకొన్నదో.



# యోధత్రయం



చెన్ననగర సత్యాగ్రహసమరతలాన ఆంధ్రుల కీర్తిపతాకలనెత్తిన యోధత్రయం
దేశోద్ధారకుడు, ఆంధ్రకేసరి, సర్దార్ గద్దెరంగయ్యనాయుడు
[1930-31 ఉప్పుసత్యాగ్రహం]
గత మే 20 వ తేదీన ఆంధ్రకేసరి అస్తమయంతో
ఈ యోధత్రయం చారిత్రక వీరమూర్తులై నిలిచారు.
వీరయోద్ధలకు జోహారులు !!

# రష్యా యువ మేధావులు

## కేథరిన్ ఫోర్

నా రష్యా పర్యటనంలో లెనిన్‌గ్రాడ్ నగరం చేరుకునేసరికి అక్కడ అమెరికానించి వచ్చిన ఒక స్నేహితుణ్ణి కలుసుకోవడం తటస్థించింది. మేమిద్దరము ఒకే అమెరికా విశ్వవిద్యాలయంలో ఒకే కళాశాలలో చదువుకున్నాము. ఒకే తరగతిలో కూర్చుని రష్యా చరిత్ర, భాష మొదలైనవన్నీ అభ్యసించాము. రష్యాలో మా ఇద్దరి పర్యటనము ఒక మాసంరోజులపాటు సాగింది. మా యాత్రకూడా ఒకే ధోరణిలో సాగిపోయింది. అయితే మేము పరిశీలించిన విషయాలలో — ఏఒక్కదానిమీద — మా ఇద్దరికీ ఏకాభిప్రాయం కుదరలేదు!

నిన్న వర్షం కురిసిందా? లేదా? లెనిన్‌గ్రాడ్ నగరం జనాభా డాబుసరిగా దుస్తులు వేసుకున్నారా? లేక కీవ్ నగరం జనాభా డాబుసరిగా దుస్తులు వేసుకున్నారా?

ఇలాంటి సామాన్య విషయాలలో కూడా మా ఇద్దరికీ ఏకాభిప్రాయం కుదరలేదు! చివరికి మేమిద్దరము ఒకరొకరిమీద చిరాకుపడుతూ మాట, మంతి లేకుండా ఒకచోట చతికిలబడ్డాము. అదంతా తలుచుకుంటే చాలా దుర్భరంగా కనిపించింది. నా కళ్ళెదురుగా ఒక భయంకరదృశ్యం ప్రత్యక్షమయింది. మాతోపాటు రష్యాలో ఒక నెలరోజులపాటు పర్యటిస్తున్నవారు—ప్రత్యేక నిపుణులు, పరిశీలకులు, కాబోయే ప్రత్యేక నిపుణులు, వేలకొద్దీ ఉన్నారు. మేమంతా త్వరలోనే మళ్ళీ అమెరికా వెళ్ళిపోతాము. మాలో కొంతమంది ఉపన్యాసాలుపక్రమిస్తారు. మరి కొంతమంది పర్యటనానుభవాలన్నీ గుదిగుచ్చి ఒకచోట వ్రాయడం మొదలుపెడతారు. వారివారి వ్రాతల్లో వారివారి ప్రత్యక్షానుభవాలు, వ్యాఖ్యలు, విమర్శలు విఖ్యాతవ్యక్తుల అభిప్రాయాలు, ఊహాగానాలు, కోస్యాలు వేర్వేరు ధోరణుల్లో రకరకాలుగా చిత్రవిచిత్రంగా సాగిపోతాయి. నాకదంతా ఒక మహాభయంకరమైన విషాద సన్నివేశంలా కనిపించింది. అవన్నీ చదివే పాఠకులను తలుచుకుని నేను చాలా జాలిపడ్డాను. యథార్థం ఆ విధంగా భిన్నాభిన్నమై పోగలదంటే నా కెంతో నిస్పృహ కలిగింది.

నిజంగా ఇది అందరికీ ఒక గొప్ప కనువిప్పు! నే నిప్పుడు కీవ్ నగరంలో నాకు, ఇంకొక రసాయన శాస్త్రజ్ఞునికీ మధ్య నడిచిన ప్రసంగాలు కొన్ని ఉదాహరిస్తున్నాను. వీటితో సరిపోలిస్తే మాస్కోలో నాకు, శిల్ప చరిత్రవేత్తకు, మధ్య నడిచిన సంభాషణ చాలా సరళంగా కనిపిస్తుంది. నిజానికి ఉన్నది ఉన్నట్టు కుండ బద్దలుగొట్టినట్టు మాట్లాడినవారు చెప్పినవి వ్రాయడమే న్యాయం. కొందరు సంపాదకులతో జరిపిన సంప్రదింపులు వ్రాసేటప్పుడు వారి అసలు పేర్లే పేర్కొనాలి. అయితే ఆ పేర్లు బయటపెట్టడం ధర్మంకాదు. ఈ క్రింద వ్రాసినవన్నీ ఇంచుమించుగా రెండు డజన్ల మేధావులతో జరిపిన సంప్రదింపుల సారాంశాలన్నమాట పాఠకులు జ్ఞాపకం పెట్టుకోవాలి. మొట్టమొదట వీరికీ, నాకు తెలవని తలంపుగానే పరిచయం కలిగింది. తరవాత తరవాత వీరితో కొంచెం సన్నిహిత పరిచయం ఏర్పడింది. మొత్తంమీద నేను చూచిన రష్యా పౌరులందరిలోను వీరి సంఖ్య చాలా స్వల్పం. నేను చూచినవారందరికన్నా వీరెక్కువ మేధావంతులు. సామాన్యులందరికన్నా వీరిది కొంచెం పెద్దమాపు. రష్యాలో సామాన్య పౌరులకుగాని, చదువుకొన్నవారికిగాని వీరు ప్రతినిధులుకారు. బహుశః వారు వ్యక్తీకరించినవి వారి ప్రత్యేకాభిప్రాయాలే అయిఉంటాయి.

సోవియట్ యూనియన్‌లో 'బుద్ధిజీవులు' అనే మాట చాలాచోట్ల వినబడుతుంది. బుద్ధిజీవులంటే కాయకష్టం అక్కరలేకుండా బ్రతికే జనాభా

# రష్యా యువ మేధావులు

అన్నమాట. వీరి కా దేశంలో గౌరవాదరా లెక్కువ. వీరి జీవితం సుఖంగా, హాయిగా గడిచిపోతుంది. ఒక ఆడివిమనిషి ఎవరైనా కౌగిలము, కలము చేత్తో పట్టుకున్నారంటే అతిడోకవిధంగా బుద్ధిజీవులవర్గం కిందకి వస్తారు. మన 'మేధావి'కి సరిసమానమైన పదం అక్కడ ఉన్నట్టు కనబడదు. అయితే భాష ఎన్నడూ సాంఘిక వాస్తవికత ఉన్నది ఉన్నట్టుగా ప్రతిఫలించదు. మన 'మేధావి'వంటి పదం రష్యాలో వినబడక పోయినా అక్కడ నిజమైన 'మేధావు' లున్నారు. (నేనీ వాక్యం రష్యాదేశం వీపు తట్టడంకోసం వ్రాయడంలేదు! రష్యాలో ప్రతి పాతిక సంవత్సరాలలోను, ఒకవిధమైన మిథ్యా సంస్కృతి సృష్టించడంకోసం బ్రహ్మాండమైన ప్రయత్నం కొనసాగింది. అందుచేత అక్కడ మేధావివర్గం బతుకులుదేరిందంటే ఎంతైనా సంతోషించాలి. ఒక్కొక్కప్పుడు వీరు తలవనితలంపుగా చిత్రకళా ప్రదర్శనాలలోను, విశ్వవిద్యాలయాలలోను, ప్రత్యక్షు మవుతూంటారు. కొందరు ప్రభుత్వం స్థాపించిన సాహిత్య ప్రదర్శనాలలో తప్పిపడతారు. వీరంతా టాల్‌స్టాయి, మొదలయిన సుప్రసిద్ధ సాహిత్యవేత్తలమీద అధికారికంగా ఇవ్వవలసిన ఉపన్యాసాలిస్తూ మధ్యమధ్యన తమ ఆఫీసు గదుల్లో కూర్చుని ఏవేవో సాహిత్య విమర్శనలు, రచనలు సాగిస్తూంటారు. అవి అచ్చుపడే అవకాశమే లేదని వారికి ముందుగానే తెలిసిఉంటుంది. లెనిన్‌గ్రాడ్‌లో అగోరా పుం వస్తు ప్రదర్శనశాలలో ఒకచోట పాతకాలంనాటి ఫిల్ములు ప్రదర్శిస్తారు. అక్కడ నేనిటువంటివారిని చాలామందిని కలుసుకున్నాను. ఆ ప్రదర్శనశాలలో కొన్ని అత్యాధునిక సంప్రదాయాలకు సంబంధించిన త్రివర్ణ చిత్రాలుకూడా ప్రదర్శించారు. న్యూయార్క్ నగరంలోని ఆధునిక చిత్రకళా ప్రదర్శనశాలలలో పనిచేసేవారా యా చిత్రాలను గురించి ఇదమిత్థంగా నిర్ణయించి చెప్పడానికి కొంచెం తికమక పడతారు. లెనిన్‌గ్రాడ్ చిత్ర ప్రదర్శనశాలలో కూడా సరిగా నాకిలాంటి పరిస్థితే ప్రత్యక్షమయింది. అయితే ఆ చిత్రాలలో ఒక విధమైన నిజాయితీ, సత్యాన్వేషణ దృష్టీ ఉన్నాయని అక్కడివారికి తెలియకపోలేదు.

అక్కడికి వచ్చేవారంతా అక్కడి గ్రంథాలయానికి బాగా అలవాటుపడిన మేధావులే! మాస్కోలో లెనిన్ లైబ్రరీ సందర్శించగానే న్యూయార్క్ పబ్లిక్ లైబ్రరీ, బ్రిటిష్ మ్యూజియము చటుక్కున జ్ఞాపకం వస్తాయి. లెనిన్ లైబ్రరీ పరిసరాలు, పాఠకులు అచ్చంగా అలాంటి వారే.

ఒకనాటి సాయంకాలం నేను లెనిన్ లైబ్రరీకి వెళ్ళాను. అప్పటికి బాగా చీకటిపడింది. దానికి తోడు కొంత వర్షంకూడా ప్రారంభం అయింది. పాఠకాగారానికి అలవాటుపడిన కొంతమంది, నేను లైబ్రరీ గదికివతల మెట్లమీద గుమిగూడాము. కొందరు ఇంజనీరింగ్ విద్యార్థు లక్కడ గుమిగూడి తమలో తామేదో చర్చించుకుంటున్నారు. లైబ్రరీలో వారందరికీ ఒక ప్రత్యేక పఠనాలయంకూడా ఏర్పాటుచేశారు. వారి చర్చావిషయం నాకేమీ బోధపడలేదు. వారది అంతా ఇంగ్లీషులో చర్చించుకొన్నా అంతే జరిగేది. నన్ను చూడగానే వారందరు కంఠస్వరాలు కొంచెం తగించి గుసగుసలాడుకోవడం ప్రారంభించారు. నేనది గ్రహించి వారందరితోను కొంచెం కలిసికట్టుగా మాట్లాడాలని నిశ్చయించాను. వారిలో ఒక విద్యార్థి చాలా చురుకైనవాడు. మొదటినుంచీ మిగిలిన వారందరికన్నా బాగా విరగబడి నవ్వుతున్నాడు. నెమ్మదిగా నా దగ్గరకివచ్చి కొంచెం మర్యాద మేళవించి వ్యంగ్యంగా అడిగాడు:

"మీ కిక్కడ వేసవి బాగుందా ?"

అతని వ్యంగ్యానికి కారణం లేకపోలేదు. ఆకాశం అంతా బూడిదరంగు పులిమినట్టుంది. బాగా వర్షం పడుతూంది. చలిగాలి రోడ్లమీద నడిచిపోయేవారందరికీ బాకుపోటులా గుచ్చుకుంటూంది. అందుచేతే అత డలా అడిగాడు.

"లెనిన్‌గ్రాడ్ పరిసరాల కీవాతావరణం చాలా బాగా నచ్చింది."

అని నేను కొంచెం మర్యాదగానే సమాధానం చెప్పాను. అతడు మళ్ళీ అడిగాడు:

"మీరు టూరిస్టులా ఉన్నారే! ఎక్కడనించి వచ్చారు?"

"అమెరికా నించి"

దీనితో మాచుట్టూ ఉన్నవా రందరికీ కొంచెం ఆసక్తి బయలుదేరింది. నాతో మాట్లాడుతున్న వ్యక్తి పేరు ఆంద్రే. అతడు మరింత ఆశ్చర్యపడ్డాడు. తరవాత కొంచెం యాదాలాభంగా అడిగాడు:

"ఈ మధ్యన ఇసాక్ స్టెర్న్ ఫిడల్ వాద్యం విని మేమంతా చాలా సంతోషించాము. అతడు మీ అమెరికా వాయులీన విద్వాంసులందరిలోను గొప్ప వాడనుకుంటాను."

నేనామాటకు సమాధానంగా రష్యానించి వచ్చిన ఓయ్ స్ట్రాక్ వాయులీనవాద్యం విని అమెరికా వారంతా ఆనందించారని అన్నాను. అంతలోనే అతని సంభాషణ ఇంకొకదాని మీదకి పరిగెత్తింది:

"ఐన్‌స్టీన్ పోవడం నిజంగా చాలా గొప్ప దురదృష్టం! అతడొక మహాప్రతిభాశాలి. మీ రాయన నెరుగుదురా?

నా కాయన పరిచయ భాగ్యం కలగలేదని అన్నానుగాని అంతటితో విడచిపెట్టలేదు:

"రష్యాలో ఐన్‌స్టీన్ సాపేక్షసిద్ధాంతం అంతా చాలాకాలం కిందటే బూర్జువా ఆదర్శవాదం అని కొట్టి పారేశారని విన్నాను. అందుచేత మీ ప్రశస్తి విని నేను చాలా సంతోషించాను."

"ఐన్‌స్టీన్ అంటే మాకెంతో గౌరవం!"

అన్నాడు ఆంద్రే. అతని వెనకాల నిలబడిన విద్యార్థులంతా ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నట్టు కనిపించారు. అతడు వారికేసి చూశాడు:

"మీరంతా ఐన్‌స్టీన్ పేరు విన్నారు గదూ?"

వారంతా కొంచెం బిడియపడి అవునన్నట్లు తలలూచారు.

"వీళ్ళందరు నిన్నే మా ఇన్‌స్టిట్యూట్‌లో మొదటి సంవత్సరం పూర్తిచేశారు. ఈవేళ రెండో రోజు. అందుకని వీళ్ళంతా తమ ముందు చదువుల కోసం తాపత్రయ పడుతున్నారు."

ఆంద్రే తన చేతిలోఉన్న సిగరెట్ పెట్టె నా కందించాడు. ఆ అదను కనిపెట్టి విద్యార్థులంతా చల్లచల్లగా లైబ్రరీలోకి జారుకున్నారు.

నేనడిగాను:

"మీరు కూడా రెండోసంవత్సరం చదువుతున్నారా?"

ఆంద్రే సైన్స్ ఎకాడమీలో భౌతికశాస్త్రవేత్త! కాని ఆసంగతి నాకు తెలియనే తెలియదు! ఆంద్రే సమాధానం చెప్పాడు:

"ఆ విద్యార్థులలో ఒకతను నా సోదరుడు. కాని అంతగా తెలివైన వాడుకాడు."

ఆంద్రే లైబ్రరీకి రావడానికి కారణం వేరు. ఫ్రెంచికవిత్వం చదువుకోవాలనే అతడక్కడికి వచ్చాడు. నేనమెరికానించి వచ్చాననగానే అతని కెంతో ఉత్సాహం కలిగింది. అమెరికాలో ఇచ్చే జీతాలను గురించీ, ఆయా వస్తువుల ధరలను గురించీ, పన్నులనుగురించీ అతడు నామీద శరపరంపరగా ప్రశ్నల వర్షం కురిపించాడు. తరవాత అతడు, నేను కలిసి లైబ్రరీ పక్కనున్న పార్కులో పచార్లు మొదలు పెట్టాము. మాసంభాషణ మళ్లీ ఐన్‌స్టీన్‌మీదికి తిరిగింది. విద్యార్థులసంగతి, ఆంద్రే సోదరుని సంగతీ మళ్ళీ వచ్చింది. ఆంద్రే చెప్పకుపోయాడు:

"వాళ్లందరికీ ఐన్‌స్టీన్ సంగతి బాగా తెలుసును. ఐన్‌స్టీన్ విశ్వశాంతి దూతగదా!"

నాకతని మాటల్లో హేళన మేళవించిన వ్యంగ్యం గోచరించింది. మళ్ళీ అంతలో కొట్టొచ్చినట్టడిగాడు:

"అందుచేత నేగదా! ఆయన్ని అమెరికాలో అన్నివిధాల బాధించారు!"

అమెరికాలో ఐన్‌స్టీన్ పట్ల గౌరవాదరాలు, కొంత యుక్తియుక్తమైన విమర్శకదృష్టి, మేధావంతుల యెడల చూపించే నిరాదరణ, ఎవరో మహావ్యక్తి అనే భయభక్తులు—మొదలైనవి అన్నీ ఏర్పడ్డాయి. నేనవన్నీ ఆంద్రేకి వివరించి చెప్పాను. కాని అవన్నీ అతడంతగా పట్టించుకోలేదు:

"ఆయనది అత్యద్భుతమైన మేధాశక్తి!"

అని అదే ధోరణిలో ఐన్‌స్టీన్ ప్రశంస ప్రారంభించాడు. నేను రష్యాలో చాలాకాలం నించీ అమలులో ఉన్న ఐన్‌స్టీన్ సాపేక్షవాద నిరసన సంగతి మళ్ళీ ఉట్టంకించాను.

రష్యాలో భౌతికశాస్త్రజ్ఞులు చాలామంది ఐన్‌స్టీన్ ప్రతిపాదించిన సాపేక్ష సిద్ధాంతం చాలావరకు పరోక్షంగా అంగీకరించారని ఆంద్రే అన్నాడు:

# రష్యా యువ మేధావులు

"అయితే మీరు మళ్లీ మేము కూడా ఆయన ప్రతిపాదించిన 'యూనిఫైడ్ ఫీల్డ్' సిద్ధాంతం విని చాలా ఆశ్చర్యపోయాము."

అని ఆ విషయంమీద తన అభిప్రాయభేదం వ్యక్తీకరించాడు. అతడు చెప్పేదంతా స్పష్టంగా బోధపడుమకోవడానికి నా కింకా కొంతసేపు పట్టింది. నేను నాకు వచ్చీరాని రష్యాభాషలో నాకు కలిగిన అనుమానాలు, సందేహాలు అతనికి తెలియజేశాను. ఆంద్రే కొంచెం ఓపికపట్టి నా అనుమానాలు సందేహాలు, అన్నీ తొలిగించాడు. చిట్టచివరికిలా అన్నాడు :

"మాదేశంలో కొంత మంది భౌతిక శాస్త్రజ్ఞులు సాపేక్ష సిద్ధాంతం సరియైనది కాదని కొట్టి పారేశారు."

నేనది విని తల పంకించాను. ఆంద్రే మళ్ళీ అందుకున్నాడు :

"ఆ కొట్టి పారెయ్యడంలో నిజాయితీ లేక పోలేదు! అయితే—పనిలో పని, కొంచెం పరిస్థితులు గమనించడం కూడా జరిగిందని తోచింది!"

నాకతని సంభాషణలో అంతటా కొంచెం వ్యంగ్యము, కొంచెం పరిహాసము స్పష్టంగా గోచరించాయి.

తరవాత ఆంద్రే అమెరికాలో సుప్రసిద్ధులయిన భౌతిక శాస్త్రజ్ఞుల్ని గురించీ, గణిత శాస్త్రజ్ఞుల్ని గురించి కొన్ని ప్రశ్నలడిగాడు. అతని ప్రశ్నలకు వేటికీ సమాధానా లివ్వలేకపోయినందుకు నేను కొంచెం చిన్నబుచ్చుకున్నాను. అమెరికా గణిత శాస్త్రజ్ఞులలో ఒక్క టామ్‌లెహరర్ పేరే నెరుగుదును. అతరవాత నేను వినిపించిన లెబాచవిస్కీ పాట అతనికి బాగా నచ్చింది.

"అక్కడినించీ, ఇక్కడినించీ సంగ్రహించినవి పరిశోధన పేరుతో దలామణీ చేసేయ్!"

ఇది ఆ పాటలో ఒక చరణం! నేనేదో వచ్చీరాని రష్యా భాషలో ఆ చరణం అనువదించి చెప్పాను. పైనించి కొంచెం జల్లులు పడుతున్నా లక్ష్యపెట్టక ఆంద్రే నా అనువాదం జాగ్రత్తగా ఒక నోటు బుక్కులో రాసుకున్నాడు.

తరవాత నేనాంద్రే ఆతిథ్యం స్వీకరించడానికతని ఇంటికి వెళ్లాను. రష్యా పరిస్థితులతో పోలిస్తే అతని ఇల్లు పరిసరాలు, అతని జీవితము బాగా మెరుగుగానే ఉన్నాయి. అతని ఇంట్లో నాలుగు పెద్ద పెద్ద గదులున్నాయి. ఆంద్రే తల్లిదండ్రులు అక్కడే ఉన్నారు. నేను వారితో పరిచయం కలిగించుకోలేదు. అతని కొక పనిమనిషి కూడా ఉంది. నాకామెతో కలిగించిన పరిచయం చాలా ముక్తసరిగా ముభావంగా జరిగిపోయింది. తరవాత ఆంద్రే నాకు తాను వివాహమాడ బోయే నూతన వధువుతో పరిచయంకలిగించాడు. ఆమె పేరు గాల్యా. చక్కనిది. నేనామెను "మీరు రష్యనులా!" అని అడిగాను. కాకసస్ ప్రాంతంనించి వచ్చిన యుక్రేనియన్ వనితనని ఆమె సమాధానం ఇచ్చింది. నా దుస్తులకేసి ఎంతో వింతగా చూడడం మొదలు పెట్టింది. నా రష్యాభాష విని వెకిలిగా నవ్వడం మొదలు పెట్టింది. నేను రష్యాభాషలో లేనిపదం ఏదయినా వాడగానే 'మైకో విస్కీ' అని వేళాకోళం చేసేది. ఆంద్రే కొంచెం మర్యాదగా "అపద్రప్రయోగం కొంచెం విచిత్రంగా ఉందే!" అని మాత్రం సమాధానం చెప్పి నెమ్మదిగా సర్ది వేసేవాడు.

అమెరికాలో ఇచ్చే జీతాలనుగురించీ, ఆయా వస్తువుల ధరవరలను గురించీ ఆంద్రే లెక్కలు కడుతున్నాడు. మధ్యమధ్యన నేను చెప్పిన ధరవరలు, తను వేసిన ధరవరలు సరిగా ఉన్నాయో లేవో అని సరి చూసుకునేవాడు. అతడివన్నీ లెక్కలు కడితే ఒక్క విషయం స్పష్టంగా తేలింది. అమెరికాలో ఒక పనివాడు కష్టపడి పనిచేస్తే—భార్య మరి మిగిలిన బాదరబందీ ఏమీ లేకుండా తనకాలం అంతా పిల్లల కోసము, ఇంటిపనికోసము వినియోగించ వచ్చును! ఇది అతనికి బాగా నచ్చింది. కాని గాల్యాకు వీధిలోకి వెళ్ళి ఏదో పనిచేయకుండా ఇంటిపట్టున కూర్చునే ఆడవాళ్ళంటే బొత్తిగా నచ్చలేదు. ఆమె అలాంటివాళ్ళనందరినీ తీసివేసినట్లు మాట్లాడింది. ఆ రోజులలో రష్యాలో అలాంటి ఆడవాళ్లనందరినీ వేళాకోళం చేసి వెక్కిరించేవారు. దానిమీద నేను అమెరికాలో ఏదో ఉద్యోగంచేస్తూ జీవించే స్త్రీలుకూడా ఉన్నారనీ, సామాన్యంగా గృహిణులంతా చాలా కష్టపడి పనిపాటలు చేసుకుంటారనీ, చాలామందికి పనిమనుషుల్ని పెట్టుకునే తాహతుకూడా ఉండదనీ సమాధానం చెప్పాను. గాల్యా సోషలిస్టు. రష్యాలో సోషలిస్టులంటే చాలా గౌరవిస్తారు. అమెరికాలోకంటె రష్యా

లోనే చాలామందికి పనిమనుషులున్నారని నేనంటే ఆమాట ఆమెకు రుచించలేదు. ఆమె చెప్పే మాటలు వింటూంటే ఆంద్రేకి చిరాకెత్తుకొచ్చింది:

"నీవే కనక ధనస్వామ్యవాదం ప్రచారానికి పూనుకొంటే కార్మికులందరికీ సౌఖ్యాలున్నారని బుకాయించడానికి కూడా జంకవు!"

చివరికతనికి ఆ జీవనప్రమాణం లెక్కలంటే బాగా విసుగుపుట్టింది. తరవాత మా సంభాషణ రోజన్‌బర్గ్ కేసుమీదికి తిరిగింది.

రోజన్‌బర్గ్ దంపతుల కేసునుగురించి నా అభిప్రాయాలన్నీ ఆంద్రేకి తెలియజేశాను. ఆ దంపతులిద్దరు గూఢచారి చర్యలలో పాల్గొన్నారు. వారిద్దరికీ విధించిన శిక్ష చాలా క్రూరంగా ఉన్న మాట నిజమే! అయితే నిందితుల తరఫున వ్యవహరించిన న్యాయవాదులు వారిద్దరు వారి జీవిత లక్ష్యాలు కమ్యూనిస్టుపార్టీకే అంకితం చేసినట్లు వాదించారు. ఆంద్రే కమ్యూనిస్టుపార్టీ మాట వినగానే ఆ విషయంలో బాగా ఆసక్తి చూపించాడు. అయితే నా కా ఆసక్తిలో కూడా 'అన్ని పక్షాల రాజకీయాల ధోరణి ఒకలాంటిదేలే!' అనే ఈసడింపు, నిర్లిప్తత స్పష్టంగా కనిపించాయి. ఆంద్రే ఇంకా అలాగే చెప్పుకుపోయాడు:

"మా దేశం పత్రికలలో రోజన్‌బర్గ్ దంపతుల కేసు వ్యవహారాలు పడ్డాయి. అంతేకాదు. వారి శిక్షల మీద అమెరికాలో వచ్చిన అధిక్షేపణలుకూడా ప్రచురించారు. అయితే ఆ కేసు వ్యవహారాలన్నీ ఇక్కడ ఆమూలాగ్రంగా ప్రకటించకపోవడంవల్ల నేనొక నిశ్చయానికి రాలేకపోయాను. కాని మీది చాలా విచిత్రమైన దేశం! అక్కడ శాస్త్రజ్ఞులందరికీ తమ అధిక్షేపణలు తెలియజెయ్యడానికి సంపూర్ణ స్వాతంత్ర్యం ఉంది! అయితే, ఓపెన్‌హీమర్ ఇంకా అమెరికా శాస్త్రీయపరిషత్తులో సభ్యుడుగానే ఉన్నాడా?"

ఇదంతా వినగానే గాల్యా మరి ఉండబట్టలేక పోయింది:

"నిజంగా అమెరికా చాలా విచిత్రమైనదేశం! ఏ పాపం ఎరగనివాళ్ళ నిట్టే ఉరిస్తంభంమీద కెక్కిస్తారు!"

ఆంద్రే అలాగ మాట్లాడ్డం మర్యాద కాదన్నట్టుగా కొంచెం చురుగ్గా గాల్యా కేసిచూశాడు. మళ్ళీ అందుకున్నాడు:

"మీరంతా మేమీ శాస్త్రీయ విషయాలన్నీ పాశ్చాత్యదేశాల దగ్గిరినించి కొట్టేశామని అనుకుంటున్నారు! అది చాలా పెద్ద పొరబాటు! మా దేశీయులకే విషయాలన్నీ క్షుణ్ణంగా తెలుసును! మేమెలాంటి సాంకేతిక సమస్య అయినా సాధించగలం! గూఢచారి చర్యలద్వారా పైవారి రహస్యాలపహరించడంకంటే పరిశోధించి తెలుసుకోవడమే తేలిక! మా శాస్త్రీయ సమస్యలన్నీ మేము తేలిగ్గా పరిష్కరించుకోగలం".

అని ఆంద్రే ఆమాటే మళ్ళీ గట్టిగా రెట్టించాడు:

"అయితే ఎన్నడు కని విని ఎరగని కొత్త కొత్త సమస్యలూహించి అవన్నీ జాగ్రత్తగా పరిశీలించడమంటే అది మా వల్లగాదు. నేను నవనవోన్మేష దృష్టి కోసం కవిత్వం చదువుతూంటాను. మా దేశంలో గొప్ప సిద్ధాంత వేత్తగా ప్రసిద్ధిపొందిన ఒక వ్యక్తి సంగీతంలో కూడా బాగా పేరు సంపాదించుకున్నాడు... అయితే మా ఆలోచన ధోరణి అంతా ఒకే మూసలో కరిగించి పోసినట్లు నడిచిపోతూంటుంది."

వెంటనే ఆంద్రే గాల్యాకేసి చూసి అన్నాడు: "ఏదో నా ఆలోచన ధోరణిలో ఉన్న లోటుపాట్లేకంగా చెప్పుకుపోతున్నాను."

ఆంద్రే నెమ్మదిగా పేకలపడం మొదలుపెట్టాడు. అంతలో గాల్యా అందుకుంది:

"ఆంద్రే నిలుచున్నపాటిగా న్యూటన్ అంతవాణ్ణి కావాలని ఆలోచిస్తున్నాడు. 30 ఏళ్లు పైబడినా సైన్సులో ఇంకా గొప్ప విషయమేదీ కనిపెట్టలేదే అనీ, అది తనకొక పెద్ద తలవంపనీ అనుకుంటున్నాడు."

నేను కలుసుకున్న శాస్త్రజ్ఞు లందరిలోను ఆంద్రే ఒక్కడే స్వేచ్ఛగా మాట్లాడాడు. అంతేకాదు! అతడు శాస్త్ర పరిశోధనచేసి ఏదో ఒక గొప్ప విషయం కనిపెట్టాలని తహతహ లాడుతున్న మేధావి. నేను కలుసుకున్నవాళ్లలో ఇలాంటి బాపతు చాలా తక్కువ. నాకు పరిచితులయిన శాస్త్రజ్ఞులలో చాలా మంది అంతగా పెద్ద ఆదర్శాలేవీ పెట్టుకున్నట్టు కన

బడలేదు. రష్యా చలనచిత్రాలలోను, నవలలలోను, కథలలోను, బ్రహ్మాండమైన ఆశావాదం కనిపిస్తూంటుంది. నేనంతటి ఆశావాదంకోసం ఎదురు చూడలేదు గాని మొత్తంమీద రష్యాలో అందరు భవిష్యత్తు తలుచుకొని కలకలలాడుతూ ఉంటారని అనుకున్నాను. కాని అప్పుడే విశ్వవిద్యాలయాలు విడిచిపెట్టి ఇవతలికివచ్చిన పట్టభద్రుల్ని కొందరిని పలకరించగానే నాకు చాలా ఆశ్చర్యం వేసింది. నిజానికి పెద్ద పెద్ద చదువులు చదువుకున్నవారికి రష్యాలో చాలా మంచి అవకాశాలున్నాయి. ఇంకా పెద్ద పెద్ద డిగ్రీలు చేతపట్టుకున్నవారిమాట చెప్పనే అక్కరలేదు! నేను పలకరించిన పట్టభద్రులలో చాలామంది, తమ భవిష్యత్తునుగురించి నిరుత్సాహంగా మాట్లాడటం మొదలుపెట్టేసరికి నాకు చాలా ఆశ్చర్యం వేసింది. విశ్వవిద్యాలయాలనించీ ఆయా సాంకేతిక సంస్థలనించీ ఇటీవలే పట్టభద్రులై ఇవతలికివచ్చిన యువతీ యువకులెందరెందరినో కలుసుకుని మాట్లాడాను. వారిలో చాలామంది వేసంకాలం సెలవులహుషారులో పడ్డారు. మరికొందరు విదేశాలనించి వచ్చిన యాత్రికులకు సాయం చేస్తున్నారు. మళ్లీ ఆగస్టు వచ్చేసరికి తమ భవిష్యత్తేమవుతుందో వారెవరికీ తెలియదు!

ఒక పట్టభద్రుడు నాతో మాట్లాడుతూ ఇల్లాగన్నాడు:

“నా జీవితంలో సుఖమైనరోజులన్నీ వెళ్ళిపోయాయి. ఇక ఇప్పటినించీ కష్టపడి పనిచెయ్యాలి.”

ఇతగాడు అంతర్జాతీయ వ్యవహారాలలో ప్రత్యేక కృషిచేశాడు. అందులోను అమెరికాకు సంబంధించిన వ్యవహారాలన్నీ క్షుణ్ణంగా చదువుకున్నానని సగర్వంగా రొమ్ము విరిచి మాట్లాడాడు. డెమొక్రట్ పార్టీనిగురించీ, రిపబ్లికన్ పార్టీనిగురించీ సవాలక్ష ప్రశ్నలడిగాడు. రాబోయే ఎన్నికలలో ఆ పార్టీల భవిష్యత్తును గురించి మరికొన్ని ప్రశ్నలడిగాడు. నేనతని ప్రశ్నలకేవో నాకు తెలిసిన సమాధానాలు చెప్పాను. చివరికతనిలా గన్నాడు:

“మీరు చెప్పినదానినిబట్టి నాకీవేళ కొత్త విశేషాలు కొన్ని తెలిశాయి. నేను విశ్వవిద్యాలయానికిచ్చిన నా ప్రత్యేక నివేదికలో ఈ రెండు పార్టీలకు యదార్థమైన భేదము లేదని బుజువుపరిచి సిద్ధాంతీకరించాను.”

నేను తిరిగివచ్చివేసే సమయంలో ఇతడు అమెరికాచరిత్ర పుస్తకం ఒకటి పంపించవలసిందని అడిగాడు:

“నేనమెరికాను దుయ్యబట్టడంలో ప్రత్యేక కృషి చేశాను.”

అని దుడుసుగానే మాట్లాడాడు. నేను కొంచెం వ్యంగ్యంగానే అన్నాను:

“నేను పంపించే పుస్తకం మీకీవిషయంలో బాగా ఉపయోగిస్తుంది.”

అతడొక చిరునవ్వునవ్వి నెమ్మదిగా తలపంకిస్తూ వెళ్లిపోయాడు.

ఇంకొక విద్యార్థిని ప్రపంచ శిల్పచరిత్రలో ప్రత్యేకకృషి చేసింది. స్వతః ప్రతిభావంతురాలు. ఆమె తన ఉద్యోగ భవిష్యత్తును గురించి ప్రసంగిస్తూ ఇలాగ చెప్పింది:

“నాకంత సుఖమైన ఉద్యోగం దొరకుతుందనే నమ్మకమేమీ లేదు. బహుశః ఇంకా రెండు మూడు సంవత్సరాలు నేనేవో చదువుకుంటూనే కాలక్షేపం చెయ్యాలని అనుకుంటున్నాను.”

ఆ అమ్మాయి అంతగా ఉత్సాహవంతురాలు కాదు. ఎప్పుడూ ఎందుకో దిగులుపడుతూన్నట్టుంటుంది. కాని ఫ్రాన్సుదేశం ప్రసంగంవచ్చేసరికి ఆమెకెక్కడలేని ఉత్సాహము పుట్టుకొచ్చింది. ఆ అమ్మాయికి ఫ్రెంచిభాష తెలుసును. పైగా ఫ్రాన్సునించి వచ్చిన కొందరు యాత్రికులతో కలిసిమెలిసి తిరిగింది. పుష్కిన్, టాల్‌స్టాయిలకన్న ఫ్లాబర్టు, బాల్జాక్‌లంటేనే ఎక్కువ అభిమానం ఉన్నట్టు కనబడింది. రష్యాలో చాలామందికి తమకు విదేశ సంచారం చేసే అదృష్టమే పట్టదన్నట్టు మాట్లాడతారు. ఆమె కూడా అలాగే కొంచెం నిస్పృహగా, వ్యంగ్యంగా మాట్లాడింది:

“నేనే కనక ఎప్పటికయినా ఫ్రాన్సుదేశం వెళ్ళడం అంటూ జరిగితే మాదేశం అసలుచరిత్ర అక్కడే తెలుస్తుంది.”

అన్నాడింకొక అర్థశాస్త్రవేత్త. అతని అర్థశాస్త్రవిజ్ఞానం — లెనిన్, బుఖరిన్, రాడెక్, ట్రాట్స్కీ — మొదలైన వారి పంథాలో నడిచింది.

ఈ నిరాశ, నిరుత్సాహము నిరుద్యోగ సమస్య వల్ల ఏర్పడుతున్నాయని అనుకోవడం పొరపాటే. నిరుద్యోగులయిన మేధావు లాయాదేశాలలో విప్లవ శక్తులకు దోహదం ఇచ్చారు. రష్యాలో అటువంటి నిరుద్యోగి మేధావివర్గం ఏర్పడే అవకాశమేమీ లేదు. పెద్దపెద్ద చదువులు చదివినవారికి అంతగా అభిరుచిలేని చిన్నచిన్న ఉద్యోగాలు సిద్ధమయ్యే పరిస్థితులవల్ల ఇటువంటి నిరుత్సాహం ఏర్పడి ఉండవచ్చును. ఒక నాడు నేనొక ఉపాధ్యాయుణ్ణి కలుసుకున్నాను. అతను మంచి శక్తిసామర్థ్యాలున్న వ్యక్తి. ఒక విశ్వవిద్యాలయంలో పని చేస్తున్నాడు. ముందేదో ఉన్నతపదవి అందుకోవచ్చునని ఉవ్విళ్లూరుతున్నాడు. అతనికలాంటి అవకాశాలు కూడా ఉన్నాయి. అటువంటి వ్యక్తి నాతో ఇలాగన్నాడు:

“చిన్నప్పటినించీ నేనొక ఉపాధ్యాయపదవి సంపాదించాలని కలలుకన్నాను. నాకా ఉద్యోగం దొరికింది. చెప్పవలసిందంతా ముందే, జాగ్రత్తగా ఇంటి దగ్గరే చదువుకుని వెళ్ళాను. తీరా పాఠం చెప్పి ఇవతలకి వచ్చేసరికి నా అజ్ఞానమంతా నా కళ్ళముందు ప్రత్యక్షమయింది. నాకెదురుగా కూర్చుని నా పాఠంవిన్న విద్యార్థుల పరిస్థితికూడా అలాగే ఉంది!”

రష్యాలో ఉన్నవాళ్ళంతా ఏదో ఖైదులో ఉన్నట్లుంటారు! అయితే చాలామంది తమ జీవితాలన్నీ కుంచించుకుపోతున్నట్లుంటారు. మరికొందరు ఐరోపా అమెరికాలు సందర్శించాలని తహతహలాడుతూంటారు. అంతేగాని రష్యాలో ఏదో బాధలనుభవిస్తూండడంవల్ల బయటికి పారిపోవాలనుకునే సూచన లేవీ కనిపించవు. ఇంతకుపూర్వం రష్యానుంచిపారిపోయి వచ్చిన వారందరిలోను ఇలాంటి సూచనలు కనిపించాయి. వారందరు సాంస్కృతికంగా కొంచెం వెనకపడ్డవారు. కాని ప్రస్తుతం నేను కలుసుకుని మాట్లాడినవారిలో ఆధోరణి కనబడలేదు.

ఇంతేకాదు. నాతో మాట్లాడినవారంతా వారి దేశం కష్టసుఖాలను గురించి ఆలోచిస్తున్నట్లే కనిపించారు. రష్యాలో పరిస్థితులను గురించి తీవ్రంగా విమర్శించేవారుకూడా తమదేశాన్ని గురించి గర్వంగానే మాట్లాడారు. స్టాలిన్ కాలంలో రష్యావాసులను విదేశాలు పంపించకుండా గట్టి కట్టుదిట్టాలు చేశారు. బహుశః ఈవిషయంలో స్టాలిన్ అవలంబించిన పద్ధతే మంచిదేమో! కృశ్చేవ్ ప్రత్యేకంగా కొంతమంది విదేశాలు వెళ్ళడాని కంగీకరించాడు. దానివల్ల వారి తహతహ మరింత ఎక్కువవుతుందిగాని తగ్గదు. రష్యానించి పైదేశాలకు వెళ్లేవారిని జాగ్రత్తగా కనిపెట్టి చూస్తూంటారు. అదిగాక ఆ ప్రయాణాలకు బోలెడుడబ్బు ఖర్చవుతుంది. అయినా రష్యాలో అలాంటి విదేశయాత్రానుమతి దొరికిందంటే అది గొప్ప అదృష్టమన్నమాట! పెద్దపెద్ద పరీక్షల్లో బాగా ఉత్తీర్ణులయిన పట్టభద్రులకే అలాంటి అదృష్టంపడుతుంది. ఇక మిగిలిన వారిలో చాలామంది తమకలాంటి అదృష్టంపట్టే అవకాశమే లేదని భావిస్తారు.

స్టాలిన్ చనిపోయిన తరవాత, ప్రత్యేకంగా కృశ్చేవ్ ఇచ్చిన ఉపన్యాసం చదివినవారందరికీ రష్యాలో సాంస్కృతిక రాజకీయరంగాలలో కొంత సడలింపు జరిగిందని స్ఫురించడం సహజం. నామట్టుకు నేనిలాగే ఊహించాను. ఎవరిని అడిగినా మొత్తంమీద పరిస్థితులు పూర్వంకన్నా బాగానే ఉన్నాయని అన్నారు. అంతేగాని పూర్వానికీ ఇప్పటికీ పెద్దతేడా ఏమీ లేదని చెప్పారు. కాని సాహిత్యవేత్తలుమాత్రం చాలా ఉత్సాహంగా కనిపించారు. వారందరు ఏదో ఒక నూతన సాహిత్యయుగం గడపడంలో అడుగుపెడుతున్నట్టు, ఏవేవో సరికొత్తవిషయాలమీద తమ సాహిత్య వ్యవసాయం సాగించబోతున్నట్టు మాట్లాడారు. ప్రస్తుతం అందరికీ ఎగ్నెస్టు హెమింగ్వే అంటే మో జెక్కువయింది. అందుచేత సమష్టిక్షేత్రాలనుగురించి రాసే రష్యానవలలో ఇకనించీ చిన్నచిన్న యుద్ధాలు, కొట్లాటలు ఎక్కువ కావచ్చును! ఓ లేషా, ఇసాయేక్ బేబిల్—ఈ ఇద్దరి నవలలు నిషేధించి చాలాకాల మయింది. ఇటీవల ఆ నిషేధాలు తొలిగించారు. ఇప్పుడు వీరి పుస్తకాల గిరాకీ బాగా పెరిగింది.

నేనొకసారి సెర్జీ అనే అర్థశాస్త్రవేత్తను కలుసుకున్నాను. మే మిద్దరం ఒకచోట కలుసుకోవాలని అనుకున్నాము. అతను రావడం కొంచెం ఆలస్యం అయింది. బోరిస్ పిల్నియాక్ పుస్తకం చదువుతూ కూర్చుని వేళ దాటిపోయినమాటే మరిచిపోయానని క్షమాపణ చెప్పుకున్నాడు. నే నాశ్చర్యపోయాను. బోరిస్ పిల్నియాక్ పుస్తకాలు కొంతకాలంనించి రష్యాలో నిషేధించారు: నే నడిగాను:

# రష్యా యువ మేధావులు

"మళ్ళీ అతగాణ్ణిగాని తవ్వి బయటికి తీశారా?"

నిషేధమేమీ తొలగించలేదట! సెర్జీకి తండ్రి కాలంనాటి పుస్తకాలలో పిల్నియాక్ రాసిన 'మాయీ మిర్' హఠాత్తుగా కనిపించిందట! అది చదువుతూ కూర్చున్నానని అతను సమాధానం చెప్పాడు. సెర్జీ రష్యాలో ప్రస్తుత పరిస్థితుల్ని గురించి కొంచెం విగులుగానే మాట్లాడాడుగాని త్వరలోనే పిల్నియాక్ మీద నిషేధం తీసి వెయ్యవచ్చునని అన్నాడు. అంతేకాదు జమియాటిన్ రాసిన 'ఉయ్' అనే పుస్తకం కూడా మళ్లీ ప్రజలముఖం చూడవచ్చునని అన్నాడు. అది 1920 తరవాత అచ్చుపడిన తీవ్ర వ్యంగ్యరచన. రష్యాలో చిన్నతరం వారెవరికీ ఆ పుస్తకం సంగతి తెలియనే తెలియదు. జార్జ్ ఆర్వెల్ '1984' దాని ఆశయచ్ఛాయల్లోనే నడిచింది. 'ఉయ్' పునరుద్ధరణ సంగతి విని నేను మరింత ఆశ్చర్యపోయాను. సెర్జీ చిరునవ్వునవ్వి వ్యంగ్యంగా అన్నాడు:

"ఇందులోకూడా మేము పాశ్చాత్యదేశాల వారిని తలదన్నుతున్నాము! మీకందరికీ పునర్జన్మ ఒక్కసారే! కాని మా కడుగడుక్కీ పునర్జన్మలే!"

అయితే అతడీ 'పునర్జన్మ'లకంతగా ప్రాముఖ్యం ఉన్నట్టు మాట్లాడలేదు:

"19వ శతాబ్దంలోకూడా సరీగా ఇలాగే జరిగింది. మావాళ్ళు సాహిత్యం సాహిత్యంలా చదవరు. అదంతా రాజకీయాల్లా చదువుతారు. ఈమధ్యన బైబిల్ పుస్తకాలుకూడా మళ్ళీ అచ్చు వేయించి ప్రజల కందిస్తారని విన్నాను. దీనిలోమాత్రం రాజకీయా లేవీ లేవు!"

"పూర్వంకంటె ఇప్పుడు కొంచెం మెరుగేగాని పరిస్థితు లంతగా మారలేదు. పూర్వం ముగ్గురొకచోట కూర్చుంటే అందులో ఒక ఆసామీ తప్పకుండా గూఢచారిఅయి ఉంటాడని నిశ్చయించేవాళ్లం! ఇప్పుడెంతమందిలో ఎందరు గూఢచారులో తిన్నగా తెలియడంలేదు."

అని ఒక లేడీ డాక్టరు నాతో చెప్పింది. మేమిద్దరం ఒక విమానంలో ప్రయాణం చేశాము. ఆపైన కొంచెం జో స్టీకూడా కలిసింది. ఆమె రష్యన్ జ్యూ. పేరు టాన్యా. రష్యాలో ఈ విషయానికి పెద్ద ప్రాముఖ్యమేమీ లేదు. పాస్‌పోర్టుల్లో మాత్రం ఊరికే రష్యన్‌అనో, పోలండ్‌దేశీయుడనో, రష్యన్ జ్యూ అనో లట్వియా దేశస్థుడనో ఉదహరిస్తారు. అంతే. రష్యాలో ఒకప్పుడు సర్వజాతి సామరస్య సిద్ధాంతానికి వ్యతిరేకంగా ఒక పెద్ద ఉద్యమం లేవదీశారు. ఆ సమయంలో టాన్యా ఒక వైద్య పాఠశాలలో చదువుకుంటూంది. ఆమె ఆరోజుల్ని గురించి మాటాడుతూ—"అవన్నీ చాలా చెడ్డరోజులు." అని ముక్తసరిగా మూడుమాటలు చెప్పి మాట్లాడ మానుకుంది. తనసంగతి పూర్తిగా మరిచిపోయి సమాధానా లిచ్చింది. తనకున్న ఉద్యోగం కాస్తా ఊడిపోనందుకే సంతోషించింది! కాని ఆమె తల్లిదండ్రులిద్దరికీ అంతటి అదృష్టంపట్టలేదు. వారిలో ఒకరికి విశ్వవిద్యాలయంలో ఉన్న ఉద్యోగం కాస్తా ఊడిపోయింది. ఇంకొకరికి ఏదో ఇంకో ఇన్‌స్టిట్యూట్‌లోఉన్న ఉద్యోగం పోయింది. పరిస్థితులు 'బాగు' పడడంవల్ల ఇద్దరు మళ్ళీ ఉద్యోగాల్లో కుదురుకున్నారు. దానిమీద నేనడిగాను:

"మళ్లీ పాత ఉద్యోగాల్లోనే చేరారా?"

"లేదు! లేదు! వారిద్దరు పార్టీ సభ్యులు కారు. అందుచేత బహుశః అది జరగ నేరదు."

తరవాత మా సంభాషణ ఇల్యా ఎహ్రెన్‌బర్గ్ నవలలమీదికి తిరిగింది. అతని నవలలంటే టాన్యా చెవికోసుకుంటుంది. ఆ నవలలో యూదు జాతీయుల అంతర్జాతీయ తత్త్వంమీద దుమ్మెత్తిపోసే ఘట్టాలు చాలా వున్నాయి. అవి నాకు బొత్తిగా సరిపడలేదు. నేనామాటే ఆమెతో అన్నాను. టాన్యా కొంచెం సేపాలోచించి మొట్టమొదట "అవును! నిజమే." అని సమాధానం చెప్పింది.

తరవాత కొంచెంసేపూరుకొని మళ్లీ అంతలోనే రుసరుసలాడింది:

"మీరీవిధంగా మాట్లాడడం తేలికే! మీ విశ్వవిద్యాలయాలలో యూదు లున్నారని విన్నాను. మీ కాంగ్రెస్‌లోను యూదులున్నారు. మీ దేశం యూదుల్లో కొందరు కోటీశ్వరులుకూడా ఉన్నారు. అయితే మా పరిస్థితులు మీకెలా తెలుస్తాయి? అందుచేత ఇల్యాఎహ్రెన్‌బర్గ్‌నుగాని మమ్మల్నిగాని మీ రెలాగ విమర్శించగలరు? మీకటువంటి అధికారం లేదు."

ఇంకొకసారి నేనొక చరిత్రవేత్తతో మాట్లాడాను. అతని అభిప్రాయాలు బాగా సమ్మడానికి వీలుగా ఉన్నాయి. అతి డప్పటికి ఒక పెద్ద ఉద్యోగంలో కుదురుకున్నాడు. పైగా కృశ్చేవ్ పేరు చెబితే చెవి కోసుకుంటాడు. పూర్వం ఒకప్పుడు రష్యాలో కొంత స్వాతంత్ర్య వాతావరణం ఏర్పడిన రోజులతనికి బాగా గుర్తున్నాయి. అందుచేత అతను ఉన్న పరిస్థితులు మారిపోవాలని కోరడం సహజం. అతను ప్రతిదీ మార్క్సిస్టు దృక్పథంతోనే పరిశీలిస్తాడు. చివరికి భయోక్తులలో కూడా రాజకీయాలగోలే! కొంచెంసేపు వాదోపవాదాల్లో పడి మేమిద్దరము కృశ్చేవ్ ఉపన్యాసాన్ని గురించి చర్చించడం మొదలుపెట్టాము. న్యూయార్కు టైమ్స్‌లో పడిన కృశ్చేవ్ ఉపన్యాసము, రష్యా పత్రికలలో పడిన ఉపన్యాసము ఒకటేనా అని నాకు కొంచెం సందేహం కలిగింది. నే నది తెలుసుకోవాలని ప్రయత్నిస్తున్నాను. నేను కృశ్చేవ్ ఉపన్యాసం అంతా తిన్నగా చదివానా? లేదా? లేక భోగట్టా రాబట్టడానికి ఊరికే దబాయిస్తున్నానా? అని అతని కనుమానం కలిగింది. అతనది కనుక్కోవాలని ప్రయత్నిస్తున్నాడు. చిట్టచివరి కిలాగన్నాడు :

"కృశ్చేవ్ చెప్పింది తిన్నగా అర్థంచేసుకోవడం చాలా కష్టం. పైగా అతను అతి తెలివైనవాడు. అయితే స్టాలిన్‌కి పక్కతాళం వేసే మూలటోవ్ వర్గం వాళ్లు ఆసభలో చాలామంది ఉన్నారు. అందుకనే కృశ్చేవ్ ఉపన్యాసంలో చివరి భాగంలో స్టాలిన్ ప్రాగస్త్య కనబడుతుంది."

దాని కుదాహరణగా అతడా ఉపన్యాసంలో ఆఖరిభాగం అంతా మళ్ళీచదివి వినిపించాడు. దానిలో ట్రాట్స్కీపక్షం వారిని నిర్దాక్షిణ్యంగా అణగదొక్కివేసిన సందర్భంలో స్టాలిన్ ప్రశంస ఉన్న మాట నిజమే. ఇది వ్రాసిచదివిన కృశ్చేవ్ ఉపన్యాసంలో లేదనీ, సభలో బయలుదేరిన అధిక్షేపణ శాంతింప జెయ్యడానికి కృశ్చేవ్ ఆ భాగంఅంతా నోటిమాటలతో ఉపన్యసించాడనీ అతడూహించాడు. పైగా ఇలాగన్నాడు :

"నేను మార్క్సిజం బాగా చదువుకున్నాను. సిద్ధాంతాలు, ఆచరణలు, బాగా మారితేతప్ప పైపైన చూస్తున్నవారెవరో ఒకరిద్దరు మారినంతమాత్రాన చెయ్యగలిగిందిమీ లేదు!"

ఇతను స్టాలిన్ పేరు చెబితేనే మండిపోయేవాడు. మాటిమాటికి "లెనిన్ కనక ఇప్పుడు బతికి ఉంటేనా?" అని అంటూండడం అతనికొక పరిపాటి అయింది. ఆపైన నేనడిగాను :

"కృశ్చేవ్ ఎంతటివాడయినా ఒక్కడు చెయ్యగలిగిందేమీ లేదని మీరన్నారు. అలాగే ఎంత చెడ్డవాడయితేమాత్రం స్టాలిన్ ఒక్కడు చెయ్యగలిగిందేముంది? మార్క్సిజం మీరింతగా ఆకాశానికెత్తివేస్తున్నారుగాని ఇదంతా మళ్లీ పునర్విమర్శన చెయ్యడం అవసరమేమో?"

అతనది నిజమే అని అంగీకరించాడుగాని, ఆ సంగతి మళ్లీ పట్టించుకోవడమే మానేశాడు.

తరవాత నడిచిన సంభాషణలో నేను, నా భర్త తత్త్వశాస్త్రవేత్త అనీ, మార్క్సిజంలో ఆయనకు శ్రద్ధాభక్తులున్నాయనీ చెప్పాను. కాని ఆయనకు రష్యాభాష బాగారాదని చెప్పాను.

"అయితే మార్క్సిజం అర్థంచేసుకోవడానికది బాగా ఉపకరిస్తుంది! అసలు మాకిప్పుడు మార్క్సిజం మీద స్టాలిన్ రాసిన గొప్ప గొప్ప వ్యాఖ్యానాల వంటివేవీ అక్కరలేదు. మేమంతా ఇప్పుడు విప్లవానికి సంబంధించిన వాస్తవిక చరిత్ర జాగ్రత్తగా పరిశీలించాలి."

అతనింకా అలాగే చెప్పుకుపోయాడు: "ఈ దేశంలో చరిత్రవేత్త అంటే అర్థమేమిటో తెలుసునా? ఊరికే వాస్తవిక విషయాలన్నీ జాగ్రత్తచేసి వాటిమీద పరిశోధనసాగిస్తే చాలదు! ప్రతీది చారిత్రికలక్ష్యాల దృష్టితో పరిశీలించాలి. మార్క్సిజం — లెనినిజం దృష్టిలో అసలు చారిత్రిక లక్ష్యాలేవో జాగ్రత్తగా పరిశీలించాలి. ఆపైన శాంతిసాధనలో చరిత్ర లక్ష్యాలేవో తెలుసుకోవాలి. ఇంకా ఇరవయ్యో కాంగ్రెసు తరవాత చరిత్ర లక్ష్యాలేవో తెలుసుకోవాలి. తెలిసిందా?"

నేనతను చెప్పేవదంతా జాగ్రత్తగా విన్నాను. ఎంతైనా ఆశ్చర్యపడ్డాను :

"ఇంతేనా? ఇంతకంటె నిజమయిన చరిత్ర రచన చెయ్యడానికి వీలేలేదా?"

# రష్యా యువ మేధావులు

"అలాంటి అవకాశాలేవీ లేవు. అసలు సంగతులేవీ ఉన్నవి ఉన్నట్టుగా దొరకడంలేదు. ఒకవేళ దొరికినా అవి ఉన్నవి ఉన్నట్టుగా ప్రకటించడానికి వీలుపడదు. ఈ విషయంలో ఒకవేళ ఏదైనా మంచిపని జరిగిందంటే అది ఏదో తెలవని తలంపుగా జరిగిపోయిందన్నమాట!"

నేటి రష్యా మేధావులలో స్టాలిన్ తరవాత వచ్చిన నాయకులమీద అంతపెద్ద ఆశ ఏమీ కనిపించదు. అంతమాత్రంచేత స్టాలిన్ తరవాత పెద్ద మార్పులేవీ రాలేదని అనుకోకూడదు. ఇలాంటి మార్పులకంత గొప్ప దాఖలా లేవీ కనుపించవు. లేక వీటినిగురించి మాట్లాడుతున్నవారెవరైనా పొరబడుతున్నారేమోనని అనుకోవాలి. లేకపోతే వీరంతా ఇంతకుపూర్వం ఇలాంటి "మార్పులు" చాలా చూసిన బాపతేనా అయిఉండాలి. అందుచేతనే వీరంతా కొంత ముందు జాగ్రత్తతో మాట్లాడి ఉండవచ్చును.

ఇలాగ మాటలాడినవారిలో చాలామందికి రష్యాలో రాజకీయవాదుల పేరు చెపితేనే అరికాలి మంట నెత్తికెక్కుతుంది. "రాజకీయవాదులు వాళ్ళ గోడతప్ప ఇంకొకళ్ళ గోడు పట్టించుకోరు. ఎవడి మట్టుకు వాడికి తన తల కాచుకోవడమే పరమలక్ష్యం!"

ఈ బాపతు మాటలధోరణి నేను చాలామంది నోట విన్నాను. విదేశీ యాత్రికుల దృక్పథాలనుబట్టి కూడా వారివారి మాటల కర్థాలు తీయడం జరుగుతూ ఉంటుంది. టి. యస్. ఇలియట్ వ్రాసిన 'వేస్ట్ లాండ్' చదివినవాళ్ళు మన పాశ్చాత్యదేశాలలో శక్తిసామర్థ్యాలు, ఆరోగ్యభాగ్యాలు చూచి గుండె బాదుకుని ఆశ్చర్యపడవచ్చును! అలాగే కోస్లర్, ఆర్వెల్ మొదలైనవారి వ్యంగ్య రచనలు చదివి రష్యా సందర్శించిన వారికందరికీ రష్యా పౌరుల మేధాశక్తి, జిజ్ఞాస, ప్రత్యేక వ్యక్తిత్వము పరిశీలిస్తే ఎంతో ఆశ్చర్యం కలుగుతుంది.

ఏ కొలతప్రకారం చూసినా రష్యా మేధావుల అంతస్తు గొప్పదే! ఇక వారిచుట్టూ నిలిచిన సామాన్య విద్యావంతుల దృష్టితో చూస్తే వారి ప్రతిభ మరింత గొప్పగా కనిపిస్తుంది. ఈ మేధావులలో చాలామంది గొప్ప గొప్ప నిపుణులు. పెద్ద పెద్ద ఉద్యోగాలు చేస్తున్నారు. కాని వీరంతా రష్యాలో జరిగే రాజకీయ ప్రచారం యావత్తు కిమ్మనకుండా అతురాలా యథార్థమని నమ్మేస్తారు. నాకొకసారి రష్యాలో విదేశీ యాత్రికులకు సాయపడే పట్టభద్రుడొకడు తటస్థపడ్డాడు. ఇతగాడొకసారి నాతో మాట్లాడుతూ వార్తాపత్రికలు తమ ఇష్టంవచ్చినట్లు పరస్పర వ్యతిరేకవార్తలు ప్రచురించే దేశంలో అడుగుపెట్టడానికి కూడా అసహ్యం వేస్తుందని అన్నాడు! పరస్పర విరుద్ధమైన వార్తలు ప్రకటిస్తే వాటిలో ఏది నిజమో నిర్ణయించడం చాలా కష్టమట!

ఇంకొకసారి ఒక జీవశాస్త్రవేత్త రష్యా వార్తాపత్రికలలో కేవలం యథార్థ సత్యాలు మాత్రమే ప్రకటిస్తారని రొమ్ముగుద్ది మాట్లాడాడు. ఆ శాస్త్రవేత్త రష్యాశాస్త్ర పరిషత్తులో ఒక ప్రముఖోద్యోగి! అడుగడుక్కూ ఛలోక్తులు విసురుతూ పాశ్చాత్య దేశాలమీది తన పైత్యం అంతా నామీద వెళ్ళగక్కడం మొదలుపెట్టాడు. పాశ్చాత్యదేశాలలో కార్మికులంతా ధనస్వాముల పాదాలకిందపడి నలిగి ఛిన్నాభిన్నమై పోతున్నారని జాలిపడ్డాడు. మందు గుండు సామగ్రి, ఆయుధాలు, తయారుచేసే ధనస్వాములు, గుత్తపెత్తనదారులు ఏకమై అనుక్షణము యుద్ధంకోసం తహతహ లాడుతున్నారనీ, ఇక కమ్యూనిస్టులు, ప్రభుత్వ వ్యతిరేకులు మొదలైనవారినందరినీ పాశ్చాత్య దేశాలవారనేకవిధాల హింసిస్తున్నారనీ దుమ్మెత్తి పోశాడు. ఇవన్నీ పాశ్చాత్యదేశాలకు వ్యతిరేకంగా సాగించే అబద్ధప్రచారాల జాబితాలలోవే! వీటికన్నింటికీ వ్యతిరేకంగా తగినన్ని ఆధారాలు చూపించి ప్రత్యుత్తరం ఇచ్చినా అతడు నా మాటలు చెవికెక్కనీయలేదు. ఎంతసేపూ ఒకటే సమాధానం!

"మీకు మీ దేశంమీద అభిమానం ఎక్కువ. మీకు మీ దేశంమీద గౌరవాభిమానా లుండడం సహజమే!" ఇదే వరస!

నేనాపైన రష్యాలో ఉన్న లోపాలు కొన్ని పైకెత్తి చూపించాను. రష్యాలో సామాన్యకార్మికుల జీవనస్థాయికీ, వీరిమీద అధికారం చలాయించే, కార్మికాధికారుల జీవనస్థాయికీ మధ్య ఉండే పెద్ద తేడా అంతా వివరించి చెప్పాను. దక్షిణకొరియామీద జరిగిన దండయాత్ర రష్యా ప్రేరేపించినదే అని నిరూపించాను. రష్యాలోనే వేలకొలది సామ్యవాదుల్ని ఖైదుల్లో పెట్టి హింసించిన వైనాలన్నీ వరసగా ఏకరువు పెట్టాను. అతడేవీ వినిపించుకోలేదు. పైగా మధ్య

మధ్యన కొంచెం కంగారు పడుతూ తనమాట లెవరైనా వింటున్నారేమోనని అటు, ఇటు చూడడం మొదలు పెట్టాడు. అతని ధోరణి అంతా నేనతి జాగ్రత్తగా పరిశీలించాను. అతనికి రష్యా మార్క్సు సోషలిజం మీదకంటె తనపై 'అధికారి' వర్గంమీదే ఎక్కువ భక్తి తాత్పర్యాలున్నట్టు కనిపించాయి!

తరువాత అమెరికా కమ్యూనిస్టుపార్టీని గురించి చర్చ జరిగింది. ఆపార్టీలో సభ్యుల సంఖ్య అమెరికా జనాభాతో పోలిస్తే చాలా తక్కువే అనీ, ఆ పార్టీ అభిప్రాయాలు చాలా స్వల్ప సంఖ్యాకుల అభిప్రాయాలనీ అన్నాను.

“అయితే అది ఎందుకు పనికిరాని పార్టీ అన్న మాట!” అని హేళనగా నవ్వాడు.

తరవాత “వచ్చే ఎన్నికలలో మీ రేపార్టీకి ఓటు వేస్తారు?” అన్నాడు. డెమొక్రటిక్ పార్టీ ప్రతినిధి స్టీవెన్‌సన్‌కే నా ఓటిస్తానని సమాధానం చెప్పాను.

అతడలాగే నిర్ఘాంతపోయాడు: “డెమోక్రటిక్ పార్టీకా?” అని మళ్ళీ రెట్టించి రెట్టించి అడిగాడు. అమెరికాలో చాలామంది ఓటర్లు తాము సోషలిస్టుల మని అనుకుంటారు; కాని తమ పేరు లిబరల్ పార్టీలో నమోదు చేయించుకుంటారు; దేశంలో ఎన్నికల సమయంలో డెమోక్రటిక్ పార్టీ ప్రతినిధులకు ఓట్లిస్తారు. అదంతా అతనికి వివరించి చెబితే తికమక అవుతుందని ఆలోచించి “అవును! డెమోక్రటిక్ పార్టీకే!” అని సమాధానం ఇచ్చాను. ఇందాకటినించీ నాకు వ్యతిరేకంగా మాట్లాడిన అతనొక్కసారిగా మారిపోయాడు. నామీద అతనికి లెక్కలేని గౌరవము కలిగింది!

“మీరు డెమోక్రటిక్ పార్టీలో సభ్యులా? ఇంత చిన్న వయస్సులోనే?”

అని హఠాత్తుగా లేచి నిలుచున్నాడు. దానితో అతడు కూర్చున్న కుర్చీకూడా కిర్రుమని ఒక్క గావుకేక పెట్టింది. మళ్లీ అదేమాట రెండు మూడు మారులు రెట్టించి ఎంతో ఉత్సాహంగా నాతో కరచాలనం చేశాడు.

నేను నెమ్మదిగా అమెరికాలో ఎవరయినా డెమొక్రాటిక్ పార్టీ సభ్యులు కావచ్చుననీ ప్రస్తుతం ఆ పార్టీలో లక్షలాది సభ్యులున్నారనీ ఇందులో అంత ఎగిరి గంతెయ్యవలసినంత గొప్పదనమేమీ లేదనీ చెప్పాను. నేను మాట్లాడుతూంటే మధ్యమధ్యన అతను “ఎంత గొప్ప పార్టీ! ఎంత గొప్ప పార్టీ! మీరిలాగ తగ్గించి మాట్లాడుతున్నారేమిటి?”

అని ఆశ్చర్యపోయాడు. నేను చెప్పినదంతా విని మళ్ళీ కరచాలనం చేశాడు. అతనప్పుడే అరవై పడిలో అడుగుపెట్టాడు. అందుచేత రష్యాలో వెనక తరానికి సంబంధించిన స్వాతంత్ర్య సంప్రదాయాలన్నీ అతనికి బాగా తెలిసిఉండాలి. విప్లవానికి వెనకటి సంప్రదాయాలు తెలియకపోయినా అధమం స్టాలిన్‌యుగానికి పూర్వపు స్వాతంత్ర్య సంప్రదాయాలయినా బాగా తెలిసి ఉండాలి. ఆ తరాలకు చెందిన కొందరు ప్రస్తుత పరిస్థితులపై విప్లవాలు సాగించారని విన్నానుగాని అలాంటివారు నాకెవరు తటస్థపడలేదు.

ఒకసారి నేనా తరానికి చెందిన ఒక గ్రంథకర్తను కలుసుకున్నాను. అతడెంతసేపు ఒకటే ధోరణి:

“రష్యా జీవితస్థాయి శరవేగంతో ముందుకు సాగిపోతూంటే రష్యా సారస్వతం మాత్రం దానికి బాగా వెనకబడి పోయింది.”

“మా దేశంలో ప్రతీదీ అభ్యుదయ పరంపరాభివృద్ధిగా ముమ్ముందుకు సాగిపోతూంటే మా రచయితలు జీవితం నిస్పృహగా, దిగులుగా ఎందుకు చిత్రించాలి?”

అతని సంభాషణ ఎంతసేపు ఇదే ధోరణిలో సాగిపోయింది. అలాంటి ప్రగల్భాలు అడపా తడపా అందరినోట వినబడుతూనే ఉంటాయి. ఆ గ్రంథకర్తకూడా మళ్ళీ అవే ఏకరువుపెట్టాడు. అయితే చిన్నతరం రచయితలెవరూ ఈధోరణిలో మాట్లాడరు. నేను పేర్కొన్న వెనకతరం రచయితవచనరచనలో బాగా పేరు ప్రఖ్యాతులు సంపాదించుకొన్నాడు.

ఒకొక్కప్పుడు పాతతరం మనుషులు కొందరు చాలా సామాన్యపరిస్థితుల్లో తటస్థపడుతూంటారు. ఆ పరిస్థితులవల్ల వారి సంభాషణ కూడా అదే ధోరణిలో సాగిపోతూంటుంది. నేనొకసారి పాతతరానికి చెందిన ఒక స్త్రీతో కలిసి రెండున్నర రోజులపాటు ప్రయాణం సాగించాను. ఆమె అంత ఉత్సాహంగా మాట్లాడినట్లు కనపడలేదు. చాలాకాలం ఉపాధ్యాయురాలుగా పనిచేసింది. ప్రస్తుతం ఆ ఉద్యోగంనించి

విరమించింది. ఆమె భర్త చాలాకాలంపాటొక విశ్వ విద్యాలయంలో ప్రొఫెసరుగా పనిచేసి విశ్రాంతి తీసుకుంటున్నాడు. ఆమె జీవితంలో సగానికి పైభాగం రష్యా విప్లవానికి పూర్వమే గడిచిపోయింది. చిన్నతనంలో ఆమెకు, భర్తకు మధ్య నడిచిన ప్రేమ గాథ ఏదో 19వ శతాబ్దం నవలలో ఒక అనురాగ ఘట్టంలా వినిపించింది. వారిద్దరు ఒక్క స్కూల్లోనే చదువుకొన్నారట! మొట్టమొదట వారిద్దరు ఒక నిరసన సభలో కలుసుకున్నారట! ఆరోజుల్లో జార్ ప్రభుత్వం 'షెవ్ చంకో' అనే విప్లవ కవిని నిర్బంధించింది. దానికి నిరసన తెలియజెయ్యడానికా సభ ఏర్పాటుచేశారు. షెవ్ చంకో ఒక గొప్ప యుక్రేనియన్ కవి. అప్పటి జార్ ప్రభుత్వం ఆ కవివల్ల ఏదో గొప్ప ప్రమాదం రాగలదని భయపడింది. ఇప్పుడామెకు డెబ్బై ఏళ్లు పైబడ్డాయి. ఆ రోజుల పరిస్థితుల్ని గురించి ఆమె కొంచెం వివరించి చెప్పింది:

"ఆ రోజుల్లో మా కెవరికీ మతవిషయాలంటే నమ్మకం లేదు. రాజకీయ నిరసన సూచకంగానైనా చర్చికి వెళ్ళడం మంచిదా? కాదా? అని అదేపనిగా చర్చించుకునే వాళ్ళం!"

అని ఇంకా కొన్ని సంగతులేకరువుపెట్టింది. ఒకసారి ఆమె నిద్రపోయేముందు ప్రార్థనచేసింది. నేనది గమనించాను:

"అయితే మీరు ప్రస్తుతం చర్చికివెళుతున్నారా?"

ఆమె నిర్ఘాంత పోయింది. అలాంటి దేమీ లేదని సమాధానం చెప్పింది:

"నా భర్త రష్యా శాస్త్రపరిషత్తులో సభ్యులుగా ఉన్నారని మీకు చెప్పాను గదా! మీకది జ్ఞాపకం లేదా?"

కాని చర్చికి వెళ్లకూడదనే నిషేధమేమీ లేదని ఆమె చెప్పింది:

"అయితే నా పరిస్థితుల్లో నేను చర్చికి వెళ్లి ప్రార్థన చెయ్యడం బాగుండదు. మరి అమెరికాలో అందరు తప్పకుండా చర్చికి వెళ్లితీరాలటే! నాకదేమీ బాగుండలేదు!"

ఆమె బుర్రలో అమెరికాలో బాగా లేని వింకా ఎన్నెన్నో పోసుపడ్డాయి:

"అమెరికాలో చిన్న పిల్లలసలు పుస్తకాలే చదవరు! చదివితే కామిక్సే చదువుతారు. వాటిల్లో ఎంతసేపు బందిపోటు దొంగలు, తాగుడు, కార్మికుల్ని హింసించడం—ఇవే సంగతులు!"

"నేనమెరికా వారి జీవితాన్ని గురించి చాలా పుస్తకాలు చదివాను. హొవర్డ్ ఫాస్ట్, ఫెనిమోర్ కూపర్, జాక్ లండన్ మొదలైన వారి పుస్తకాలెన్నో చదివాను. అమెరికా వారంతా వట్టి అడవి మృగాల్లా కనిపిస్తారు. నాకమెరికాలో జీవితం అంటే బొత్తిగా సరిపడదు! ఇక సామాన్య సంసారులు, తమ సంసారాలెలాగ సాగిస్తారో నాకు తెలియడంలేదు!"

ఆమె మాటలధోరణి అంతా అలాగసాగిపోయింది. నేనామెకు అమెరికాలో సామాన్యసంసారుల పరిస్థితులు ఉన్నవి ఉన్నట్టుగా చిత్రించి చెప్పడానికి ప్రయత్నించాను.

రష్యాలోలాగే అమెరికాలోకూడా సంసారులు చాలా మంది సౌమ్యంగానే తమ జీవిత యాత్రలు సాగిస్తారనీ వారి కాలం అంతా ఉద్యోగాలలోను, కుటుంబ సంరక్షణంలోను, గృహ పరిసరాలలోను సాగిపోతుందనీ చెప్పాను. కాని ఆమె భావనా శక్తి అంతా రష్యా ప్రభుత్వ ప్రచార ధోరణిలోనే సాగిపోయింది. అదే ఆమె కెక్కువ విశ్వసనీయంగా కనిపించింది. అందుచేత అదే ధోరణిలో కమ్యూనిస్టు చైనాను పొగడడం మొదలు పెట్టింది:

"చైనా జాతి నిజంగా చాలా గొప్పజాతి. 10 ఏళ్ళకు పూర్వం చైనా వారంతా వట్టి కూలీలు. బొత్తిగా విద్యాగంధం సోకని జనాభా! ఇప్పుడు చైనా అంతా ఎలాగ మారిపోయిందో! కిందటి నెలలో ఒక ప్రఖ్యాత చైనా శాస్త్ర వేత్త మాశాస్త్రపరిషత్తు చూడడానికి వచ్చాడట. మా ఆయన నాకీ సంగతిచెప్పారు. అతను రష్యా భాష ఎక్కడా పొల్లు పోకుండా అతి స్వచ్ఛంగా మాట్లాడాడట! ఎంత త్వరగా వారంతా విద్యావంతులయ్యారో! ఈ మధ్యన ఈజిప్టు వారు కూడా బాగా ముందడుగు వేస్తున్నారు. ఆ దేశంలో ఎక్కడ చూచినా స్కూళ్లే! ఎక్కడికి వెళ్లినా చిత్రకళే! ఎక్కడికి వెళ్ళినా బృందగానాలే!"

ఆమె చాలా మంచిది. ప్రయాణంలో నాకెన్నెన్నో సదుపాయాలు చేసింది. గడిచిన 70 ఏళ్ల

జీవితంలోను ఎన్నెన్నో యుద్ధాలు, కరువులు చూసింది. ఎన్నెన్నో ఇబ్బందులు పడింది. ఆమె కుటుంబంలో వారు, మిత్రులు అందరు పెద్దపెద్ద చదువులు చదువుకున్నారు. ఆ విషయం ఆమె ఎంతో గొప్పగా చెప్పగుంది. అయితే రష్యాలో అడపా తడపా జరిగిన రాజకీయ నిందితుల 'బహిష్కరణలలో' వారిలో చాలామంది అంతరించిపోయి ఉంటారని నే ననుమానించాను. నిర్మొహమాటంగా అమాటే అడిగాను. దానికామె అంతే అంటనట్టుగా సమాధానం చెప్పింది:

"ఇదిగో! మాది అసలే విప్లవ ప్రభుత్వం! అది మా నిరక్షరాస్యతిని పూర్తిగా నిర్మూలించింది. ఇప్పుడు పల్లెటూరి జనం అంతా పుస్తకాలు చదువుకుంటున్నారు. ఎప్పుడూ లేనిది వారందరికీ ఇప్పుడు విద్యుచ్ఛక్తి సౌకర్యంకూడా ఏర్పడింది."

ఆమె మాటలు విని నేనిక ఉండబట్టలేక పోయాను. చిట్టచివరికి అడగవలసింది కాస్తా అడిగేశాను: "మీది సోషలిస్టుపంథా? మీరు సోషలిస్టులు! అయితే విప్లవం వచ్చినప్పటినించీ జరిగినవన్నీ నిజంగా మీకు నచ్చాయా?"

"లేని మాట నిజమే! నాజీలంతటి ఘాతుక కృత్యాలు చేస్తారని ఎవరు కలగన్నారు! భూస్వాములావిధంగా క్రూరంగా ప్రవర్తిస్తారని ఎవరనుకున్నారు!"

అయినా నేనంతటితో విడిచిపెట్టలేదు. ఆమె దగ్గరనించి ఇంకా రాబట్టాలని అలాగే గుచ్చిగుచ్చి అడిగాను:

"ఇలాంటి అవాంతరాలదారి వేరు! అయితే మరి మిగిలిన విషయాల మాటేమిటి?"

ఆమె నెంతో బాధపెట్టిన దింకొక విషయం ఉంది. చివరి కామె అది చెప్పివేసింది. ఆమెకు, ఆమె భర్తకు ప్రాచీన పాశ్చాత్య సాహిత్యంమీద భక్తి ప్రపత్తు లెక్కువ. నేటి ప్రపంచంలో రష్యా సాంస్కృతికంగా బాగా ముందడుగు వేసింది. ఆమాట ఎవరూ కాదనలేరు! కాని రష్యాలో గ్రీక్, లాటిన్ భాషాసాహిత్యపఠనం బాగా సన్నగిలింది; ఈ సాహిత్యాలు రెండు నిర్లక్ష్యంచేసిన దేశం నిజంగా సాంస్కృతికంగా ముందంజ వేసిందని అనగలనా?

—సశేషం

['ఎన్‌కౌంటర్' పత్రిక సౌజన్యంతో]

# తిరుగులేని న్యాయం

శ్రీ బలివాడ కాంతారావు

శ్రీకాకుళానికి దక్షిణపు చివరన ఒక పాడుపడిన గృహం యెవరో కొనుక్కున్నారని చుట్టుపట్ల వున్నవారు విని "అ దవడో మట్టిలో కలిసిపోడానికే కొన్నాడని" వ్యాఖ్యానించారు. కొనిన రెండు నెలల్లో ఆ పాతగోడలమీదనే పెంకుటిల్లు లేచింది. చుట్టూ తీగలతో కంచె వేసి, ఆ జాగాలో రకరకాల పూలమొక్కలు నాటుతూ ఒక ముసలాయన త్రోవ పోయేవాళ్లకు పంచెకట్టు, ఖద్దరుబనియను లేదా అంటే చవకరకం కమీజుతో కనిపించేవాడు. ఇంట్లో యెవరూ ఆడవాళ్లుగానీ నౌకర్లుగానీ అగుపించలేదు. వంట, వండిన గిన్నెలు తనే తోముకునేవాడు. ఎదురుగావున్న నాగావళీ నదినుంచి నీరు ఒక బాల్చీతో మోసుకొనేవాడు. ఇదంతా ఆ వీధిలోనివారు చూసి "దిక్కెవరూ లేనట్లు వుంది. ఏదో చవకగా దొరికిందని యీ యిల్లు కొనుక్కున్నాడని" అనుకున్నారు.

అతను ఆ యింటిలో దిగిన నెలరోజులకు ఆ చుట్టుపట్లవాళ్ళకి అతని విషయం కొంత తెలిసింది. ఆఫీసరుగా పనిచేసి ఈమధ్యనే యితను రిటయిరయ్యాడని, నెలకు అయిదువందలవరకు పింఛను వస్తుందని తెలుసుకున్నాక యీయనగురించి యింకా తెలుసుకుందామని ఉబలాటం ఆ వీధి ప్రజల్లోనేకాదు, ఆ పట్నంలోనే చాలమందికి కలిగింది. మరో నెలరోజుల్లోనే యేవీధిలో చూసినా యీయనమాటలే అనుకోవటం మొదలుపెట్టారు. "ఒక్కపూటే వండుకొని భోజనం చేస్తాడట! ఎవరు వెళ్లినా అట్టే మాటాడడు. ఆడంబరం కొద్దిగైనా లేదు. పోనీ పిసినారి అంటే కానే కాదు. వచ్చిన పింఛను అంతా పేదవాళ్ళకే పోస్తున్నాడు. చెయ్యిచాపినవాళ్ళకే కాకుండా చాపనివాళ్ళ కష్టాలూ తెలుసుకొని మరీ సహాయంచేస్తున్నాడు. పాదాలకు చెప్పులైనా లేవు. బాధపడే రోగులవద్దకు పరుగెత్తుతాడు. తన చల్లని మాటలతో వాళ్ళలో ధైర్యాన్ని, స్థైర్యాన్ని చేకూరుస్తాడు. ఆ పాడుపడిన మట్టి యెంత అదృష్టం చేసుకొని యీ పుణ్యాత్ముణ్ణి తెచ్చుకుందో!..."అని,తలోలా పేదారోదా మొదలు భాగ్యవంతులదాకా యీయనగురించి అనుకున్నారు.

స్వలాభాపేక్ష లేని రమణయ్య ఆ పట్నంలో అందరిచేత గౌరవింపబడటానికి కొన్ని నెలలైనా అవసరం లేకపోయింది. అతనిదగ్గరకు ఆ పూటకు యెలా జరుగుతుందని బాధపడే కటికపేదనుంచి భోగవిలాసాలలో సుఖపడే శ్రీమంతులవరకూ వచ్చి గౌరవిస్తున్నారు. అతని స్వగ్రామం, జీవితంగురించి యెన్నెన్నో ఊహాగానాలు జరుగుతున్నాయి. ఒకనాడు ఒక ముసలాడు మాటల్లోనే నలుగురిమధ్య "తమదేవూరు? మీ తండ్రిగారెవరు? మీ కెవరూ లేరా?" యిలా యేవేవో అడుగుతుంటే నవ్వి "ఈ లోకమే నా వూరు, ఆ భగవంతుడే నా తండ్రి— నాకెవరూ లేకేమి? మీరంతా నావాళ్ళు కారా?" అని సమాధానం చెప్పాడు.

ఒకనాటి సాయంత్రం వాకిట చాప వేసుకొని కూర్చున్నాడు. వయసుమళ్ళిన ఒక వితంతువు భక్తితో తన్మయయై గానంచేస్తోంది. చుట్టూ మూగిన ప్రజ కూడా ఆ పాటలో పరవశులైపోతున్నారు. ఇంతలో వచ్చిన టెలిగ్రాం రమణయ్య విప్పాడు. అది చూస్తూనే అలా చేతినుంచి జారిపోయింది. కళ్ళనించి నీరు బొటబొటా కారజొచ్చాయి. అటువంటి స్థితిలో ఆయనను యిదివరకు చూడని ప్రజానీకం ఆతృతతో చుట్టుముట్టేశారు. గోడకు చారబడి పెల్లుబికిపోయిన దుఃఖాన్ని ఆపుకోడానికి ప్రయత్నించలేదు. పంచ చివర కళ్లకు ఒత్తుకుంటూ వెక్కి వెక్కి యేడుస్తున్నాడు.

"సీతమ్మ...యెవరీమె?" అనే సందేహం అందరిలోనూ పొడసూపకముందే రమణయ్యగారు దుఃఖంలో "అమ్మా—నా బంగారుతల్లీ—నువ్వే మిగిలావను

ఉన్నాను..." అని యేడుపువిని అందరికళ్లూ తడిసిపోయాయి.

ఓ క్షణంపోయాక కట్టలు తెంచుకొని పొర్లే దుఃఖాన్ని ఆపుకోడానికి ప్రయత్నిస్తూ "నా ఒకే ఒక తల్లి గంపెడు పిల్లలను వదలిపోయింది. ఆ అమ్మలేని పిల్లలకు అష్టకష్టాలే!"

ఈ వార్త క్షణంలో పట్నం అంతా ప్రాకిపోయింది. ప్రజ తండోపతండాలుగా పరుగెత్తి వచ్చారు. మంచివాళ్ళకే దేముడు కష్టాలు తెచ్చిపెట్టాడని, వాడికే కళ్లుంటే న్యాయం అడివిలోకి పారిపోదని తలోలా రమణయ్య యెదరగా పరోక్షంగాకూడా దేముణ్ణి దూషిస్తున్నారు.

ఆవేళ రాత్రే కర్నూలుకు బయలుదేరాడు. తనతో యెవరినైనా తోడుగా పంపిస్తామంటే ససేమిరా ఒప్పుకోలేదు. వేగంగా తమరు తిరిగిరావాలని కొందరు ఆమదాలవలస స్టేషనువరకు వచ్చికూడా చెప్పారు.

పదిహేనురోజుల్లోనే తిరిగివచ్చాడు. ఈ దెబ్బనుంచి తెములుకున్నట్టులేదు. మనిషి చిక్కిపోయాడు. పరధ్యానంగా కూడా వుంటున్నాడు. ఉండీవుండీ కూతుర్ని తలచుకొని కళ్లుతుడుచుకోవటం కొందరు గమనిస్తునేవున్నారు. చాలామంది వస్తున్నారు—పోతున్నారు. ఒక ధనికుడు ఆ దగ్గరగావున్న విశాలమైన తనతోటలో ఆశ్రమంకట్టించి అంతా తనపేర వ్రాస్తానని యీ పాడుజాగాను విడిచిపెట్టమని ప్రాధేయపడ్డాడు. మొదట కాదని వారంరోజులుపోయాక "నాయనా! ఎంచి యెంచి యీ స్థలం నిర్ణయించుకున్నాను. నా కోరికలకి అనువైన జాగా యిదే! నీతోటలో కుష్ఠురోగులకి ఆశ్రయంచూపించు. వాళ్ల సేవచేసి తరిస్తాన"న్నాడు.

ఊళ్లోనూ పొరుగుఊళ్లలోవున్న కుష్ఠురోగులు రానురాను ఆతోటలో చేరారు. వాళ్లతో కలిసిమెలిసి సేవచేస్తుంటే చాలామంది అది అంటువ్యాధని జాగ్రత్తగావుండమని బ్రతిమాలారు. మీరు చూపిస్తున్న అభిమానాన్ని స్వీకరిస్తూ అన్నాడు. "ఆ జబ్బే నాకు అంటుకిస్తే నాకంటే సంతోషి అయిన మనిషి యీలోకంలో యింకెవరూ వుండరు."

ఈ మాటలు విన్నవాళ్లల్లో సంచలనం బయలుదేరింది. కూతురుపోయాక రమణయ్యకు మతికాస్త చలించిందేమోనని కొందరు అనుమానపడసాగారు. ఇప్పుడు తనను ఒంటిగా పడుకోనివ్వరు. ఎవరో కొందరు తనయింటి వరండాలోనే కాపలా వుంటుంటారు.

చవితి చంద్రుడు అప్పుడే క్రుంగిపోతున్నాడు. ఉండి వుండి మనసుకు ఆహ్లాదాన్నిచ్చే గాలివీస్తోంది. గంగమ్మతల్లి గలగలారవముతో వంగుతూ వాలుతూ దిగువకు దిగజారిపోతోంది. ఆకాశాన నక్షత్రాలు మిణుకు మిణుకుమంటున్నాయ్. వాకిట కూర్చున్న పలుగురు మనుషులూ మాటల్లో మాటగా దేవునిమీద దూషణలు వేస్తున్నారు. ఇందులో ఒక వయసుమళ్లిన వ్యక్తి, ఒక నడివయసులోనున్న ధనికుడు, యింకో ఉన్నతవిద్యనభ్యసించుతున్న విద్యార్థి కూడా ఉన్నారు. వీళ్లమాటలు వింటున్న రమణయ్య గదినుంచి బయటకురాగానే అంతా లేచి నులుచున్నారు. వాళ్లని కూర్చోబెట్టి తనుకూడా వాళ్లదగ్గరగా కూర్చొని యేదోనిశ్చయానికివచ్చి తొణకని గొంతుకతో మొదలుపెట్టాడు.

"నేను ఈ పట్నం వచ్చినదగ్గరనుంచీ ప్రజల్లో నాగురించి యెన్నో కట్టుకథలు అల్లుకున్నాయని నాకు తెలుసు. ఏ కట్టుకథలు అల్లుకున్నా అవన్నీ నాకు చెడుగు ఆపాదించినవిగా లేవు. నాలో యేదో మంచి వుందని యీపట్నంప్రజలంతా నన్నింతగా గౌరవిస్తున్నారు. అంతేకాదు, కొందరు "కోవెలకెందుకు వెళ్తారు ఆ బాబుముఖంచూసి మొక్కండి" అని అన్నమాటలుకూడా నాచెవినిపడ్డాయి. ఈ అనంతమైన విశ్వంలో నేనొక నీటిబిందువును. అది కాలమనే యెండకు ఆహుతి అవక యెంతకాలం వుండిపోతుంది? నేను చచ్చిపోయాక మీరంతా మీబిడ్డలకు, వాళ్లు వాళ్లబిడ్డలకు యిలా తరతరాలు నాగురించి "ఇక్కడ ఈ పాడుపడినస్థలంలో ఒక మనిషివుండేవాడు. సాధుపుంగవుడు. కాని క్రుద్ధదేముడు వాడిని అష్టకష్టాలు పాలుచేశాడని" దేముడిని దూషిస్తూ నన్ను పొగడుతూ చిత్రిస్తారు. ఈ కొద్దిరోజుల్లోనే దేవునిమీద, నామీదనున్న భక్తితో మీలో చాలమంది దూషణలు కురిపిస్తుంటే నేను వినలేకపోతున్నాను. ఇంతకీ నావిధి యేమంటే ఆదేవదేవుని గొప్పతనాన్ని,

# తిరుగులేని న్యాయం

తిరుగులేని న్యాయాన్ని మీకు విన్నవించాలని నిర్ణయానికి వచ్చాను.

నేను నెల్లూరులో ఒక సంపన్న గృహస్థుల యింట్లో పుట్టాను. ఆ సంపదకుతోడు మా కుటుంబం విద్యకు కూడా పేరుపడింది. మా తాత కవులను పోషించడమే కాకుండా తను ఆసుకవిత్వం చెప్పేవారు. మా తండ్రి మేజిస్ట్రేట్ గా పనిచేసేవారు. నేను వారి యేకైక పుత్రుణ్ణి. నాకు చిన్నప్పటినుంచీ ముద్దు యెంత చేసేవారో చదువువిషయంలో మా నాన్నగారు అంత శ్రద్ధవహించేవారు. ఆరోజుల్లో పేరుపడ్డ ఉపాధ్యాయులు యింటికివచ్చి చదువుచెప్తుండేవారు. ఉదయం మా నాన్నగారి తోపాటు నేను స్నానంచేసి పూజచేసేవాణ్ణి. తరవాత జోడుగుర్రాల బగ్గీయెక్కి బడికివెళ్ళేవాణ్ణి. మా నాన్నగారు ఇంగ్లీషు భాషలోనే కాకుండా, సంస్కృతాంధ్రాలలోనూ దిట్ట! నేను చిన్నవయసులోనే సంస్కృతం నేర్చుకున్నాను. పదిహేనేళ్ల ప్రాయంవచ్చేసరికి మా నాన్నగారి పరిజ్ఞానం కొంచం కొంచం అర్థంచేసుకొనేవాణ్ణి. పాశ్చాత్య విజ్ఞాన సంపర్కమున్నా యీ దేశంలోనే వేళ్లుపాతుకున్నారు. మా అమ్మ నాపెళ్లి విషయం యెత్తితే, నాన్నచేసిన వాదన నాకెంతో సమంజసమనిపించేది. మన పురాణాల్లో స్వయంవరాల విషయం చెప్తూ బాల్యవివాహాలు సంఘం కుప్పకూలించి పతివ మైపోయే సమయంలో వచ్చాయని చెప్పారు. నేను పెళ్లిచేసుకోకుండానే ఉన్నతవిద్యకు మద్రాసు వెళ్లటం జరిగింది.

నావిద్య పూర్తయింది. నేను మొదటితరగతిలో ఉత్తీర్ణుడనయ్యాను. ఇంగ్లాండుకు బారెట్లా చదువుకోసం పంపిస్తామని మా నాన్న అనుకుంటుంటే అనుకోకుండా ఉద్యోగం నా కాళ్ళదగ్గరకు వచ్చింది. మా అమ్మ నన్ను పైదేశాలు ససేమిరా పంపించడానికి ఒప్పుకోకపోవటంవల్ల ఆఫీసరు ఉద్యోగం దొరకటంవల్ల నేను యిక స్వతంత్ర జీవితంలో పడ్డాను. అప్పటివరకు ఒక మచ్చ, మాయ, యెరుగని జీవితం. చదువు తప్పించి యింకో ధ్యాసవుండేదికాదు. చెడుసహవాసం తలచటమే భయం. అలాంటివాళ్లను అసహ్యించుకొని దూరదూరంగా వుండేవాణ్ణి. అమ్మ నాన్నను విడిచిపెట్టి రావటంకాదు. కాబట్టి ఒంటిగా వుండవలసి వచ్చేది. ఏ పట్నం బదిలీ అయినా ఊరుబయట పెద్ద బంగాళా ఒకటి వుండేది. ఉద్యోగంలో నా ప్రతిభ చూపిస్తామనే ధ్యాసతప్పించి పెద్ద పెద్ద ఆశలు కోరికలూ యేమీ వుండేవికావు. నా మంచితనాన్ని గౌరవించేవారు.

అప్పుడప్పుడు నా పెళ్లివిషయం ప్రస్తావన వచ్చేది. సంబంధం విషయంలో మా అమ్మా, నాన్నకూ అభిప్రాయాలు యెప్పుడూ యేకీభవించేవికావు. నాక్కూడా పెళ్లి అంత వేగిరంగా చేసుకోవాలని మనసుండేదికాదు.

ఇలాంటి పరిస్థితులలో యీవూరికి బదిలీమీద వచ్చాను. పట్నం శివారులలో నా బంగాళా! మామూలుగానే కోరినట్లు. ఒక వయసుమళ్లిన స్త్రీని వంటపుట్టిగా బంట్రోతు కుదిర్చిపెట్టాడు. ఆమె యిదివరకువచ్చిన ఆఫీసర్లకు కొందరికి వంటపుట్టిగా వుండేది. పెద్దతోటవుండేది. నౌకర్లకోసం ఆ తోటలో ఒక మూల రెండు చిన్నగదులు వుండేవి. వంటమనిషి, తల్లి స్వంతబిడ్డని చూసినట్లుగా చూసేది. ఆమె యిల్లు బంగళాకు రెండు ఫర్లాంగులదూరంలో వున్న పట్నంలో చివరివీధిలో తాటాకుల గుడిసె. ఆ గుడిసెల్లో వున్నవాళ్ళు చాలా దరిద్రమైన జీవితంగడిపేవారు. వాళ్లంతా ఒకే కులస్థులు—కులపెద్ద—ఆ పెద్ద వేసే ఆంక్షలు—శిక్షవేసే అధికారం ఒక్కడి చేతిలోనే—వాడు అన్యాయానికిపోతే వాళ్ళకింకొక దారిలేదు.

మండువేసవి. ఒకనాటి మధ్యాహ్నం ఆవీధిలో ఒక కొంపకు నిప్పంటుకొని వీధంతా వూడ్చేసింది. వాళ్ళకు ప్రభుత్వం యేదో సహాయం చెయ్యటంకోసం నేను పలుకుబడి వినియోగించాను. ఈలోగా వంటమనిషి వుండటానికి నా బంగళాలో ఖాళీగావున్న నౌకర్లగదులు వుపయోగించుకోమని చెప్పాను. ఈ యిల్లు కాలిపోగానే ఆమె నెత్తీ నోరు కొట్టుకుంది. "ఈ పెద్దలందరికీ తాగడానికి పోస్తేగానీ నాకూతురికి పెళ్ళవదు. దానిపెళ్లికోసం చెమటోడ్చి దాచినదంతా ఆ అగ్గిదేముడు పొట్టనపెట్టుకున్నాడు. ఇంక నా యీ తనువుండగా నా కూతురికి పెంబుడినీరు పొయ్యగలనా?" అని ఆమె యేడ్చింది. నేనేదో సహాయంచేస్తానని ఓదార్చాను. నామాటలు ఆమెకేమీ సంతోషం యివ్వలేదు. ఎంచేతంటే కష్టించి గడించినదానితో చేసినపెళ్ళే,

ఒకరు వూరికే యిచ్చినదానితో చేసినపెళ్ళికి యెంతో తేడావుందని ఆమెనమ్మకం. ఆ యిల్లు కాలిపోవటం కాదుగాని ఆమె బెంగతో అదో పరధ్యానంగా వుండేది.

ఒకనాడు నిద్రనుంచిలేచి అలామంచంమీద నుంచే కిటికీగుండా చూశాను. తూరుపున ఉషః కాంతులు అలుముకుంటున్నాయ్. రానురాను తేట పడుతున్న కాంతిలో నూతిదగ్గర స్నానంచేస్తున్న వంటమనిషి కూతుర్ని చూశాను. నా దృష్టియెంత మరలింపుదామని ప్రయత్నిస్తున్నా లాభంలేక నాకోరికకు దాసుడయ్యాను. ఆమె నాకగపడేది కాదు—నా వేపు చూడనూలేదు. కిటికీనుంచి దొంగ తనంగా తొంగిచూసి తొలిసారి నా యౌవ్వనంలో వర్ణించలేని వ్యగ్రానుభూతిని పొందాను. ఆ వేళ కేంపుకు వెళ్ళవలసింది. వెళ్ళక యింటిలో నేవుండి దృష్టి ఆయింటి వేపే పారించేవాడిని. ఆరోజంతా ఆమె కనపడలేదు. ఇక కనపడుతుందన్న ఆశకూడా లేదు. ఆ మరుసటిరోజు ఉదయం వేగంగా మేల్కొని యెదురుచూశాను, కానీ ఆమె ఆ వేళ రానేరాలేదు.

ఆ వారంరోజుల్లో ఒకరోజున కేంపునుంచి తిరిగి వచ్చేసరికి భోజనాలగదిలో అన్నీ అమర్చివున్నాయ్. మామూలుగా వంటమామ్మ భోజనందగ్గర లేక పోవటంలో గ్రహించి నాలోవున్న ఉబలాటంతో క్రీగంటితో వంటయింటి వేపు చూస్తూ "మీఅమ్మ ఒంట్లో బాగులేదా ?"

జవాబు వెంటనేరాలేదు. గ్లాసులో మంచినీరు గడగడా త్రాగివేసి "మంచినీరు"న్నాను. ఆమె విధి లేక వస్తుంటే కళ్లిప్పనెప్పి చూశాను. ఆమె తిరిగి వెళ్లిపోతుంటే చప్పునలేచి వెంబడిద్దామని ఉబలాట పడ్డానుకాని ఆమె యింతలో మెల్లగావణుక్కుంటూ వచ్చి దగ్గరగా కూర్చుంది.

"జ్వరంతో యెందుకొచ్చావమ్మా" అన్నాను.

"అడిపోతుంది బాబూ......"

ఆ రాత్రి చాల సేపటివరకు నాకు నిద్రపట్టలేదు. మధ్యను ఈమె రాక పోతే అథవా మెల్లగా మాటలు కలిపే వరకైనా వచ్చే వాడిననుకున్నాను.

వాళ్లి వీధిలో మళ్ళీ యిల్లు తయారవుతోంది. నాలుగు రోజుల్లో వెళ్లిపోతారనగా నేను అనుకోకుండా కేంపు నుంచి ఒక రోజు ముందుగానే వచ్చేశాను. నేను వచ్చే సరికి వంటామామ్మ జ్వరంతో మూలుగుతోందని గబగబ వెళ్లాను. నన్ను చూడగానే లేని బలం తెచ్చుకొని కూతుర్ని వెళ్లి వంటచెయ్యమని గట్టిగా ఆజ్ఞాపించింది. కూతురు వెళ్లటానికి సంశయిస్తుంటే "బాబు దేముడి లాంటోడు - అలాంటి బాబును ఆకలితో వుస్తావా? నివ్వువెళ్లక పోతే నేనె వెళ్తాను" అని లేవబోతుంటే విధిలేక వంట చెయ్యటానికి బయలుదేరింది. నేను చాలా సేపు మామ్మదగ్గర కూర్చున్నా మనసు అక్కడనే వుంది. "వేడి నీరు కాగివుంటుంది స్నానం చేసీ బాబూ! అలసి పోయి వచ్చావు—అమ్మిదగ్గర సంశయం పడకండి. మీలాంటి మారాజులదగ్గర బతికింది మీ ఇష్టం అవుతాదిగానీ..."

వచ్చాను. బంగాళా వేపు అడుగులు వేస్తుంటే నాలో యౌవనం వుబ్బి తబ్బిబ్బయిపోతోంది. నాలోని మంచీచెడ్డా విచక్షణాజ్ఞానాన్ని పసుబలంతో కూడిన కోరిక చంపివేసింది. స్నానాల గదిలో నీరు దించి ఆమె వస్తుండగా యెదురుపడ్డాను. వసారాలో దీపం లేదు. ఆమె ప్రక్కకు తప్పుకొని రాబోతోంది. మెల్లగా పిలిచాను. ఆమె ఆగింది. ఎదురుగా నిల్చొని నోటి నిండుగా యేదో అందా మనుకున్నానుగాని అనలేక పోయాను. నా శరీరం అంతా నా అధీనంలో లేకుండా పోయింది.

* * *

ఆ దెబ్బ తిన్న లేడిని, మెల్లగా వెక్కి వెక్కి యేడుస్తున్న అబలను...విడిచిపెట్టి స్నానానికి వెళ్లాను. నేను తిరిగి వచ్చే సరికి ఆమె వంట యింటిలో ఒక మూలకూర్చొని యింకా కళ్లల్లోనుంచి మౌనంగా నీరు కారుస్తునే వుంది. నాలాంటి అందమైన యువకుని తొలివలపును పొందే అదృష్టం యీ దిగువ అంతస్తులో నున్న ఆమె పొందినందుకు సంతోష పడకుండా యెందుకేడవా లనిపించింది—ఆక్షణంలో ఆస్త్రీ సర్వస్వాన్ని నేను అపహరించానని అందువలన ఆమె నైతికంగా శక్తివిహీనఅయ్యిందనీ ఆమెను పూర్తిగా భరించే బాధ్యత నాకుందని ఆలోచించ లేకపోయాను. ఒక పువ్వు పూసింది. ఒక తుమ్మెద వ్రాలి మధువును గ్రోలి వెళ్ళిపోతుందనే వుద్దేశంతో నే వున్నాను.

రెండునెలలు గడిచిపోయాయి. నా కేదో సంబంధం చూశారంటే నెల్లూరు వెళ్ళవలసి వచ్చింది. అమ్మకు లక్షణాలు-నాన్నకు పిల్ల అభ్యసించిన సరి

రైన విద్య, అవిద్య యిచ్చిన వినయ సంస్కారాలు నాకు ఆమె వర్ణించవీలు పడని అందం నచ్చటంవల్ల సంబంధం స్థిరమై పోయింది. ఆ వాలు కళ్ళు, పసిమి ఛాయతో మెరుస్తున్న మృదువైన శరీరము, కదులు తుంటే జారుతున్నట్లుండే ఆనడక ముత్యాలు రాల్చే ఆ దరహాసం—ఆక్షణం నుంచీ నా కింకో ధ్యాసలేదు!

నేను తిరిగి వచ్చాక మారిన మనిషి నవటంతో వంటమనిషి "ఏవయసుకు తగ్గసొంపు ఆవయసులో లేకపోతే బతుకు పెడదారులుపట్టాయంటారు ఇంటికి వెళ్ళావు-నే చెప్పింది అమ్మకీ అయ్యకీ చెప్తావా బాబూ" అని అడిగింది. సంబంధం స్థిరమైనదని చెప్ప డానికి నా నోరు పెగల్లేదు. ఆ నెలరోజుల్లో నేఆమెకు, వాళ్ళ వీధిలో వాళ్ళకీ యేవో నానోపవాదాలు జరుగు తున్నాయని విన్నాను. అసలు విషయం బయట పడితే ఆకారకుడైన వాడి ప్రాణాలు నిలువునా తీస్తా రనికూడా విన్నాను. నాకింకో గత్యంతరం లేకపోయింది. నాకు మదరాసులో వుండే పలుకుబడిని వినియో గించి పెల్లెగ్రాములమీద బదిలీ తెప్పించుకున్నాను.

ఇంకా ఒకగంటలో యిల్లు కదుల్తాననగా వంటమనిషి వీధిలోని పదిమంది నా బంగళా చుట్టు ముట్టారు. నాకు హెచ్చుభయంవల్ల వచ్చేధైర్యంతో "ఒకడిని కొట్టడానికి యింతమంది రావాలా? ఒక ఆఫీ సరు మీద లేనిపోని అనుమానాలతో మీరు యిలా పరుగెత్తుకొచ్చారు. నాకుతగ్గబలం నాకూవుంది. ఇక్కడనుంచి కేకవేశానంటే పోలీసులు తయారు. మీ అందరి చేతులకూ బేడీలు పడ్తాయి-జాగ్రత్త," అని హెచ్చరించినా అందులో పెద్దమీసాలు తిముదు కుంటూ ఒకడు ముందుకొచ్చి "నివ్వు పెద్దోడివైతే పెద్దోడింగాగవుండు. ఆఫీసరు వైతే నీతిగావుండు. అన్యాయం సేసావు-నీకు సిక్షయేస్తాం!"

వాళ్ళు చేతులు సర్దుకుంటున్నారు. వంటమనిషి చప్పున ముందుకొచ్చి గట్టిగా "ఈ బాబుదేముడి లాంటోడు. యీ బాబుసేశాడంటే నేను నమ్మను. ఇలాంటి మంచిబాబు మీద మీరు సెయ్యేస్తే మీకు దేముడు బాగా సూడడు-వెళిపొండి నామాట వినండి" అనగానే అందులో ఒక మొరటుమనిషి.

"నీ కూతురు గడ్డికొరికింది గానీ నివ్వు కాదే... అదే కాదని సెప్పనీ...సల్లగ వెళిపోతాం!"

అంతలోనే వంటమనిషి కూతురును పిలి పంచ డానికి ఒకడు వెళ్ళాడు. ఈలోగా "అదివీశే అంటే ముక్కచెక్కలుగా కోసి యిక్కడే పాతిపెడ్దాం. పారిపోదామని చూశాడు..."—యిలా వ్యాఖ్యాని స్తున్న వాళ్లమాటలువిని నా ప్రాణాలు సగంపోయాయ్.

మామ్మకూతురు వచ్చింది. ఒకసారి మెల్లగా తలెత్తి నావేపుచూసింది. బహుశః నాముఖాన్న రక్తంలేకపోవటం గమనించిందేమో ఓక్షణంపోయాక :

"ఈ బాబుకేమీ తెలీదు"

ఈ జవాబువిని, ఆమెను నానాదుర్భాషలాడు కుంటూ వచ్చిన వాళ్లు వెళ్లియారు.

ఇక స్వంత పట్నంలోపని. ఐశ్వర్యంతో పాటు అధికారం—ఊఁఅంటే సేవకులు ఆఁఅంటే సేవకులు. అచుట్టుపట్ల కని వినియెరగనంత బ్రహ్మాండంగా నా పెళ్లిజరిగింది. ఈ పెళ్లితో రెండు పెద్ద సంపన్న గృహాలు ఒకటయ్యాయి. నా భార్య యింట్లో అడుగు పెట్టినతోడనే ఉద్యోగరీత్యా ఒకమెట్టు పైకి లేచాను. ఇంట్లో క్రొత్తకోడలు కొద్దిరోజుల్లోనే పాతబడి యింటి మహాలక్ష్మి అయిపోయింది. అన్ని శుభ లక్షణాలు కలిగి తనమంచితో అందరిచేతా జేజేలు అందుకోవటం మొదలుపెట్టింది. నేను పూర్తిగా ఆమెలో యేకమైపోయాను. ఆమెను విడిచిపెట్టి ఒక రోజు వుండటం కష్టమనిపించేది. ఈలోకంలో ఆమె కంటే ప్రియాతి ప్రియమైన దింకొకటిలేదు. జీవితం ఆనందం వెన్నెలలా గడిచిపోతోంది. ప్రజలచే ధర్మ ప్రభువని నేను, మహాలక్ష్మి అని మా ఆవిడకొనియాడ బడుతున్నాం!

నాభార్య కాపరానికి వచ్చిన మూడోయేట బాబుపుట్టాడు. మా సంతోషానికి మేరలేదు. ఆబాబు అందచందాలు యెన్నోసార్లు నేనే తలచుకొనేవాడిని. సరిగ్గా నెలరోజులనాటికి పోయాడు. ఆదుఃఖంనుంచి నాభార్య మళ్లీ కడుపుపండేవరకూ తేరుకోలేదు. బాబుపుట్టిన నక్షత్రం మంచిదికాదని బాబే బ్రతికుంటే దంపతులలో యెవరికైనా గండం వుండేదని సిద్ధాంతులు చెప్పటంవల్ల నేను బాబుపోయినందుకు విచారించలేదు. బాబుపోయిన యేడాదికే నా సీతమ్మతల్లి పుట్టింది. నాతల్లిది నారూపే. అందరూ చాలా అదృష్టవంతురా లౌతుందనేవారు. నా సీతమ్మను యెంతో గారా

బంగా పెంచాం. ఇందరు సేవకులున్నా రోజా యెలాగో తీరుబడిచేసుకొని పిల్లను ఆడించేవాడిని; ఎదిగినకొద్దీ అది నాన్నపిల్ల అయ్యిందిగానీ అమ్మపిల్ల కాలేదు. నాన్నను విడిచిపెట్టి వుండలేకపోయేది.

సీతమ్మ పుట్టిన తరవాత నా భార్య ఆరోగ్యం కొంతవరకు దెబ్బతిన్నది. పెద్ద వైద్యులను పెట్టాను. తేరుకుంది. కానీ మరి సంతానం లేదు. సీతమ్మకు యెనిమిదేళ్ళ ప్రాయం వచ్చేసరికి నా భార్యకు పెద్ద జబ్బుచేసింది. సెలవుపెట్టి మరీ ఆమెకు సేవచేశాను. నాకు ఒకక్షణం విశ్రాంతి వుండేదికాదు. ఏమౌతుందనో ఆతృత. ఏ కొద్ది తీరుబడిలోనూ ఆ ప్రతిబింబం నాతలలో తిరిగి ఆలోచనలను హద్దూ అపూ లేకండా తీసుకపోయేది—

ఆ రాత్రి... సరిగ్గా పండ్రెండు కొట్టింది. ఐనా నిద్దర రాలేదు. నా భార్య మంచంమీద తలదగ్గర ప్రక్కనే కూర్చున్నాను. ఆమె యేవో తెలివిలేని మాటలు అనుతోంది. నా చేతిని తీసుకొని ఆమె నుదిటి మీద పెట్టుకుంది. డాక్టరు ప్రక్కగదిలో పడుకున్నాడు. చీకటి రాత్రి. బంగాళా చుట్టూ హోరుమంటూ ఘీంకారం వినిపిస్తోంది. ఒకోసారి యేదో భయంకరమైన అరుపు, మనసు ప్రళయం వచ్చి పడినట్లుగా భయంతో ఓతుకు బితుకు మంటోంది. గుండె జోరుగా కొట్టుకుంటోంది. అయినా నేను ఆక్షణంలో యీ లోకంలో నాకు ప్రియాతి ప్రియమైనది చెయ్యి జారిపోతుందని అనుకోలేదు.

ఒక గంట పోయాక తుఫాను తరవాత అలముకున్న ప్రశాంతతలా నిర్మలమైన నిశ్శబ్దం—నా భార్య కళ్లు తెరచింది—ఆమె కళ్లల్లోకి చూశాను. ఆ పెదవులపై చిన్న నవ్వు... మెల్లగా ఆ పెదవులు కదల నారంభించాయ్... "లోకంలో అవసరం లేకండా... ఏపనీ జరగదు! ఇప్పట్లో—నాకళ్లు మూయటానికీ—అవసరం కలిగిందేమో! మీరు లోకంకోసం బ్రతికే అవసరంకూడా వుందని... మరచిపోకండి!"

ఆమె ముఖం చూస్తుండగానే నా కళ్ళల్లో నీరు నిండుకున్నాయ్. ఆమె కళ్ళు క్రుంగిపోతూ క్రుంగిపోతూ మిగిలిన నీటిని బయటకు రాల్చాయ్. ఆ పెదవులు, ఆ చిరునగవుతోనే యెండిపోయాయ్."

ఇంతవరకూ రమణయ్య చెప్పాక ఆ దృశ్యం యిప్పుడు కళ్లకు కట్టడంవలన కామోసు దుఃఖం ముంచుకొచ్చి మాటాడలేకపోయాడు. కళ్లల్లో నీరు గిర్రున తిరిగిపోయాయి. కాస్సేపు పోయాక గద్గదస్వరంతో "నేను చాలా బలహీనుణ్ణి. నాభార్య ఆ రూపులో నా దగ్గరనుంచి మాయమైపోగానే జీవితంమీద విరక్తి కలిగి అన్నహారాలమీద, వుద్యోగంమీద ఆసక్తి పోయింది. ఈ జీవితం అంతా మాయ అని యేదీ శాశ్వతంకాదని గ్రహించాను. ఏ అడవుల్లోకో, హిమాలయాలకో పోయి తపస్సు చేసుకుందామని అనుకున్నాను. రోజంతా యెడతెగని ఆ వేదన, దుఃఖంతో క్రుంగిపోయాను. నడుస్తున్న బస్సుమీదనుంచి గెంతాలని, పరుగెత్తుతున్న రైలు క్రింద తల దూర్చాలనిపించేది. నా కాళ్ళక్రింద వుండే నేల బీటలుదేరి నేను కూలిపోయినట్లు; నేనో వెన్నముద్దలా అయి మీద కత్తిపడటానికి సిద్ధంగా వున్నట్లు—బాగుచేసిన దూదిలా యెగిరిపోతున్నట్లు-ఇలా యెన్నో విధాలుగా అయిపోయాను.

శీతాకాలం యింకా సరిగ్గా చొచ్చుకోలేదు. సాయంత్రం గాలివిటలతో పెద్ద వర్షం కురుస్తోంది. బంగాళాకిటికీగుండా వీధిలోకి చూశాను. రోడ్డుమీద గేదెలు, దున్నపోతులు వర్షంలో తడుస్తున్నయ్. ఆ కదలని గేదెలు, పోతులవేపుచూసి బయటకు వచ్చాను. చలివేస్తోంది. నేను వర్షంలోనికి చొచ్చుకొని ఆ గేదెల దగ్గరగా వెళ్లి కూర్చోవటం అనుకోకుండానే జరిగింది.

ఇన్నాళ్ళూ పేరుకున్న దుఃఖాన్ని పెల్లుబికి గట్టిగా యేడవటానికి వుపక్రమించాను. ఆ కొద్ది సేపట్లో ఒక పోతు అరచింది. నేనొక నరకంలో వున్నట్లు యీ యమధర్మరాజా నన్ను ప్రశ్నిస్తున్నట్లనిపించింది. ఆ అరుపు విన్నవెంటనే నాలో "ఇలా యేడుస్తున్నావు నువ్వు నీ భార్యతో నిజాన్ని కప్పకండా మెసలావా?"

ఈ ప్రశ్న నన్నెంతో కలవరపెట్టసాగింది. ఈ కలవరం నా యేడుపును తగ్గించి "నిజ్వే అలా మెసిలి వుంటే వంటమనిషి కూతురితో నీ సంబంధం చెప్పకండా యెలా వుంచేవాడివి? నువ్వు నీ భార్యను మనసారా ప్రేమించావంటే యెలా నమ్మమంటావ్?"

"అందులో యేముంది? తక్కువతరగతి మనిషి-నేను కాకపోతే యింకెవరయ్యేవారో?" అన్న నా సమాధానానికి పోతు నవ్వింది.

"ఏముందంటావా? తక్కువ తరగతి మనిషా? డబ్బునుచూశా మనిషి విలువకట్టావు? యింతగా యెవరి కోసం విలపిస్తున్నావో ఆ భార్యను పెళ్లాడటానికి తన జీవితం కాల్చుకొని ఆమె నీ ప్రాణాలు దక్కించిందని నీవు కొద్దిగానైనా కృతజ్ఞత చూపించావా? ఇందులో యేముందంటావు? నిద్రలోనుంచి మేలుకో—నిజం వేపు కళ్ళెత్తిచూడు—నీ భార్యకే యీ విషయం తెలిసుంటే యేంచేసేది?"

"ఏంచేసేది...? జీవితం అంతా అనుమానాలతో నిండిపోయేది."

"అర్థం చేసుకోలేని భర్తవై యెందుకిలా కుమిలిపోతావు. ఆమె వంటమనిషి కూతురే మొదలని ఆమెను తీసుకవచ్చి మంచి చెడ్డలు చూసేవరకు నీకు నిద్దర పట్టనిచ్చేదా?"

క్షణంలో నాకు వణుకు పట్టుకుంది. ఇంటికి పరుగెత్తాను. ఆ రాత్రంతా నాకు నిద్దరపట్టలేదు. ఆలోచనమీద ఆలోచనలు సవారీ చేస్తున్నాయి. నాలో యే అన్యాయం లేకపోతే నేనీ కష్టాల్లో చిక్కుకొనిపోవాలి? తెలతెలవారుతున్న కొద్దీ నేను పెనునిద్ర నుంచి మేల్కొన్నట్లయింది. ఏం చేద్దామన్నా నాలో యేదో పెనుగులాటతో శక్తి లేకుండా వుంది. అడుగువేస్తే నేను కూలిపోతున్నట్లున్నాను. ప్రకృతంతా నా కళ్లయెదుట గిరగిర తిరుగుతూ తల తిరిగిపోతోంది-పగిలిపోతోం దనుకున్నాను.

ఆబాధ భరించలేకపోయాను. నన్ను ప్రతి క్షణం భార్య ప్రశ్నిస్తున్నట్లనిపించేది. ఆమె చని పోతూ అన్నమాటలో నిజం నాకిప్పుడు స్ఫురించింది. నేను బ్రతికి నా పాపానికి బాధపడే అవసరం వుండ బట్టే ఆమె చిరంజీవి కాలేదు.

బయలుదేరాను. ఈ వేషంతో మళ్ళీ ఆమె యెదుటపడటం నాకిష్టం లేదు. ఆమె యెవరితోనో లేచిపోయి వుంటుంది. పిల్లలతోనూ పాపలతోనూ వున్నా దరిద్రంతో బాధపడుతూ వుంటుంది. ఆమె రక్షణకోసం యిదివరకే డబ్బు ముట్టచెప్పి వుంటే ఆర్థికంగా పునాది వేసేవాడిని. యిప్పుడు ఆమెకు నే నెవరికీ తెలియకుండా సహాయం చెయ్యాలి.

సాధువేషం వేసుకున్నాను. 'భిక్షాందేహి' అని ఆ పాకదగ్గరకు రాత్రి యెనిమిది దాటాక వెళ్లాను. పాకలోపల చిన్న బుడ్డీదీపం వెలుగుతోంది. పిల్లలు పండుకున్నారు. లోనుంచే ఒక స్త్రీ "మేమే పస్తులున్నాంబాబూ...యెళ్లండి" అన్నది. ఆ గొంతుక లానే వుంది. కానీ మనిషిని చూడాలి. మీ యింటి వెనక సరిగ్గా యీ రోజు సరుకు చెట్టు మొదట త్రవ్వితే లక్ష్మి ప్రసన్నమౌతుందని జోస్యం చెబుదామను కున్నాను. ఆమె బయటకు రాలేదు. పోనీ కాసిన్ని మంచినీరు పోయమ్మా అని అడిగాను. ఆమె బయటకు రాగా నే వెన్నెల్లో చూశాను. ఆమె పోలికలేవీ లేవు. వెంటనే "పదియేళ్ళ క్రితం కాశీ పోతూ యిలా వచ్చాం తల్లీ! ఈ యింటిలో ఒక తల్లీ కూతురూ వుండేవారు..."

"అయ్యో పాపం!..." అనగానే నేను అక్కడ కూర్చుండిపోయి "మా మంచి తల్లమ్మా... ఏమైంది?"

అయిల్లాలు గడపలో కూర్చొని చెప్పడానికి ఉపక్రమించింది. "ఆకూతురు యెక్కడో గడ్డితిన్నాదని ఆతల్లి యాతనపడిపోయి మంచంపట్టింది. జాతోళ్లు వెలివేశారు. మనమరాల్ని చూడకుండానే సచ్చిపోయింది. మనుమరాలంటే మనుమరాలు కాదు. మారాజులయింట్లో పుట్టవలసిందిగానీ ఇలాంటి పాకల్లో మెసలాలిసింది కాదు. విధి విధంతా యీపిల్లని నూసాక ఆపాపం పాపిష్టి పెద్దింటోడే సేసాడని అనుకున్నారు. ఆడు దీని బతుకునాశనం సేసి దూరదేశాలు యెలిపోయి పెళ్లి సేసికోని పిల్లా జల్లాతోని హాయిగా బతుకుతున్నాడట! ఆసక్కని పిల్ల ఆడి రక్తానికి పుట్టిందికదా ఆడి కూతురౌతాదా, దాని కూతురౌతాదా? అయ్యో! సేసినాపాపం సేసినాను—దాన్ని సేరదీయకపోయినా నాకూతురని అభిమాన మేనా ఆడికి లేకపోనాది? ఆడు మనిషేనా? అడవిలో సింహంలాంటివానికి పిల్లలని అభిమానం వుంటాది? దాన్ని యేలుకోమని అనలేదు. పిల్లబతికి ఒకింటి దివడానికేనా ఆదరువు చూపించాడు కాదు. ఇల్లు అమ్మేసింది—ఆపిల్లకి పాలుసాలకే—చెట్టుమీద పక్షిలాగ ఆ కూనని నీగడప నాగడపా తిప్పి తిప్పి యేడాదిపిల్లను సేసింది. తిండికిలేదు. ఒళ్ళు కప్పుకోడానికైనా బట్టలేదు. ఎందుకు మారాజు మాయల్లో పడిపోనాది? కూడుగుడ్డాలేక కుమిలిపోనాది. నలుగుర్లోను అపకీర్తి తెచ్చుకుంది—ఎవరూ కనికరించలేదు. ఆ పుట్టించిన దేముడు కూడా కనికరించ

లేదు. పిల్ల బతకాలని మానం అమ్ముకున్నాది. వ్యాపారంలోకి దిగిపోయింది. అందులోకి దిగాక మనిషెంత కాలం దిట్టంగా వుంటాది? అందరూ దాని తల్లి మంచికీ దీనిచెడ్డకీ పోల్చి తిట్టారు. ఏ గడపా యెక్క నివ్వారుకాదు. జబ్బులతో వికారంగా తయారయి పోయి—రెండేళ్ళక్రిందటే సచ్చిపోయింది."

నేను ఆమె మాటలువిని అలా కూలబడి పోయాను. ఆమె మానం దాల్చిందని కొంతసేపటికి తెలుసుకొని "అకూతురేమైంది — ఎక్కడుంది చెప్పమ్మా" అని అడిగాను.

ఆమె నా ఆత్రుత గమనించి "అంత సక్కని పిల్ల—ఎవరైనా దగ్గరుంచుకో గలరు. కానీ ఆ తల్లి సంగతి తెలిసిన వాళ్లు యీ వూర్లో ఆ పిల్లను యెవరు సేరదీస్తారు? ఏదో పెద్దపట్నమట—పెద్దయితే ఆ పడుపు వృత్తిలో పెట్టుకుందామని ఒక షాకు కత్తె తీసుకుపోయింది! నూడు బాబూ? దానిగతి — ఆ పెద్దోడి కూతురు పడుపువృత్తిలో వయసు వచ్చాక దిగేట్టప్పుడు - వాడి భాగ్యభోగాలు వుండి యెందుకు? ఏవోజాతోణ్ణి కట్టుకుంటే అది నలుగురూ యేలెత్తి చూపించినట్లు హీనంగా సచ్చిపోనా?..."

అక్కడనుంచి బయలు దేరుతూ త్రోవలోనే మూర్ఛ పడిపోయినట్లయిపోయాను. క్షణికోద్రేకాలు మనిషిని న్యాయాన్యాయ విచక్షణ లేకుండా చేసేస్తాయి. నా చదువు నాకు బలమైన వ్యక్తిత్వాన్ని యివ్వలేదు. అంచేత నాలో ఆ రోజుల్లో దృఢమైన మనస్సు, స్వంతం మరచిపోయి అందరినీ ప్రేమించే స్థోమత లేక పోయింది. ఇంత జరిగాక నేను యిక జీవితం మీద ఆశపెట్టుకోవడ మెందుకని ఆత్మహత్య చేసుకోడానికి ప్రయత్నించాను. ఎన్ని సార్లు ప్రయత్నించినా నా భార్య చనిపోతూ అన్నమాటలే జ్ఞప్తికి వస్తున్నయ్. నేను బ్రతికే అవసరం యెందుకు కలిగిందీ కొన్నాళ్లు పోయాక గానీ నాకు అర్థం కాలేదు.

నా కూతురుకోసం వెతకడానికి ప్రారంభించాను. నాకు ఆమె జాడ తెలియలేదు. నా జీవితం నా కష్టం మీద వచ్చే ఫలంతోనూ మా నవసేవకు అంకితం చేస్తే గానీ నాకు ముందుగతి లేదు. ఆ మధ్య తీర్థయాత్రలు సేవిస్తూ కలకత్తా, బొంబాయి నగరాల్లోని పడుపువృత్తి పెట్టుకొనే వారుండే వీధుల్లోనికి వెళ్లాను. అక్కడైనా నాకూతురు అనుపడుతుందేమోనన్న భ్రాంతితో! వాళ్ల హీనపరిస్థితులు చూశాను, వాళ్ల చిరునవ్వు వెనక అగాధంలావున్న బాధను చూడగలిగాను. వాళ్లందరిలోనూ నాకూతుర్ని చూశాను. అంతా నాబిడ్డలే! నాలో యీ పరివర్తన యెప్పుడు వచ్చిందో అప్పుడే అనుకున్నాను. నేను అసలైన విద్య లోకంలో మెసలి అనుభవించి అభ్యసించ గలుగుతున్నానని!

మీరంతా అడగొచ్చు — ఈ పాడుకొంపలో యెందుకున్నారని? క్షయరోగం రావాలని యెందుకు కోరుకుంటున్నారని! నేను యెప్పుడైతే నాతప్పును తెలుసుకున్నానో అప్పటినుంచీ నాకు పీరైనంత హెచ్చుగా హీనంగా బాధపడాలనేవుంది. నేను చేసిన పాపానికి ఫలితం అనుభవించకుండా వుండటానికి ప్రయత్నిస్తే యీ పాపాన్ని నేను మళ్లీ జన్మకు తీసుకపోయి అప్పుడు అనుభవించవలసివస్తుంది. మనకున్న అధికారాలని స్వలాభంకోసం దుర్వినియోగం చేసేవచ్చు. మనకున్న బలం దీనులమీద చూపించవచ్చు. చాటుగా మన ఆశలు, అబద్ధాలు అన్యాయాలతో ఫలింపచేసుకోవచ్చు! ఇవన్నీ యెవరూవినరు, చూడరనుకోవటం పొరపాటు! దేవుడు లోకంయొక్క కళ్లూ చెవులూనూ! మనుషుల అంతర్గతంలో యేంజరుగుతుందో కూడా ఆ కళ్లు చూస్తాయి, ఆ చెవులువింటాయ్!

# కీ. శే. నండూరి సుబ్బారావు

తెన్నేటి సూరి

స్వార్థరహితుడు కవి; తన ఊహాశక్తితో జగత్తులో లేని ఏదో ఒక మహాసౌందర్యాన్ని ఎక్కడి నుంచో అంది పుచ్చుకుంటాడు. దాని సౌందర్య సౌరభాలను ముందు తాను అనుభవించి ఆనంద పారవశ్యంతో చిందులు త్రొక్కుతాడు. స్వార్థరహితుడు కావటంచేత ఆ అందాలమొలకను నలుగురికీ చూపించి, తన ఆనందాన్ని తనజాతికంతకూ పంచిపెట్టడానికి ముచ్చటపడి అంగలారుస్తాడు. ఈ ఆవేశాన్ని అవగతం చేసుకోలేని వారు కొందరు దీన్నంతా బాలిశ చాపల్యంక్రింద జమకట్టి పరిహాసమాడి, పరమ మూర్ఖంగా, చేతికందిన అలాంటి మధుపాత్రను దొర్ల దోసుకుని విముఖులవటంకూడా కద్దు. అందుచేతనే, హేతువాదం సర్వాధికారం చెలాయిస్తున్న ఈనాడు కూడా, 'ఎట్టి అనుభూతికైనా పూర్వజన్మ సుకృతం కొంత వుండాలి' అనే ప్రాచీనులను అభిప్రాయాన్ని కొట్టి పారేయటానికి వీలుకాకుండావుంది. అట్టి ఆనందానుభూతిని అనుభవించగలవారిని "సహృదయు"లంటున్నారు. ఆనందించలేనివారికి......మరో పేరేది వున్నట్టు లేదు.

కావ్యరచనావేశం ఒకవిధంగా బాలిశచాపల్యం లాంటిదే ననిపించుతుంది. దొడ్లోవున్న ఊకబంతిచెట్టు ఎర్రనిపూవు పూస్తుంది. లౌకికజ్ఞానం ముదిరిన యింట్లో వున్న పెద్దలు దాని జననాన్ని లక్ష్యంచరు. కాని అమాయకుడైన ఆ యింట్లోని కుర్రవాడుమాత్రం దాన్ని చూచి ఆనందంతో చిందులు త్రొక్కుతాడు. చప్పట్లు కొట్టి అక్కచెల్లెళ్లనూ, అన్నదమ్ములనూ, స్నేహితులనూ కేకేసి దాన్ని వాళ్లకు చూపించి తన ఆనందంలో వాళ్లందరికీ భాగం పంచుతాడు. ఈ బ్రహ్మానందంలో, ఒకొక్కప్పుడు, విసుగులోవున్న పెద్దవాళ్లను పిల్చి మొట్టికాయలుకూడా తినటం కద్దు. కవికూడా, కావ్యరచనకు సంబంధించినంతవరకు, ఇదేవిధంగా సంచరించుతాడు. నిజానికి బాలిశచాపల్య సదృశమైనదే, ఐనా, ఇలాంటి ఆనందాన్ని ఊహించగల వ్యక్తి భగవంతునికూ, ప్రకృతికీ సన్నిహితుడుగా వుంటాడు. ప్రకృతి నుంచి సౌందర్యాన్నీ, భగవంతునినుంచి మహోన్నత గుణ సంపత్తినీ అందిపుచ్చుకుంటాడు. వీటితో తన జీవితాన్ని తేజోమయం చేసుకుని మానవ జీవితాలను తేజోమయం చేస్తాడు. అలాంటి పునీతజీవిని కవి అంటాం.

కీ. శే. నండూరి సుబ్బారావుగారు అలాంటిపునీత జీవి. తనభావనా పథాన, ప్రణయ సమ్మోహితమూ, సుఖస్వరూపమూ అయిన ఒక మనోజ్ఞ మిథునాన్ని దర్శించాడు. ఆ మిథునానికి ఆయన 'ఎంకి-నాయుడుబావ'లని నామకరణం చేశాడు. ఇది— జీవితమంటే యేవిటో గుర్తెరిగి సుఖించే మిథునం; నిరాడంబరశీలము కలది. అమాయికమైనది. భగవంతుని యందు విశ్వాసము కలిగి తత్సాన్నిధ్య పవిత్ర వాతావరణమున వర్తించునది.

శ్రీ సుబ్బారావుగారు ఈ మిథునాన్ని కావ్యరూపంలో ద్యోతమానం చేయటానికి ఉపక్రమించినప్పుడు వారి వారి సంస్కృతులనుబట్టీ, వారి వారి ఊహాపోహాలనుబట్టి పలువురు పలువిధాలుగా వ్యాఖ్యానించారు. ఆయన గ్రామీణ ప్రణయాన్ని అభివర్ణించటానికి ప్రయత్నించుతున్నాడనీ తదనుయుక్తమైన గ్రామ్యభాషను వాడుతున్నారని అన్నారు. మాణిక్యంలాంటి కవితా ప్రపంచాన్ని మాదిగమంచంగా మార్చుతున్నాడని మరికొందరు గుమ్మెత్తిపోశారు.

నిజానికి ఎంకి-నాయుడుబావల పాత్రలు గ్రామీణ పాత్రలా?—అంటే మొరటుమొద్దులా?— వాళ్లు మాట్లాడింది కటువైన గ్రామ్యమా? ఇలా అని విమర్శించేవారికి గ్రామీణ దంపతులలో ఎట్టి పరిచయమూ లేదనీ, వారు వ్యవహరించే భాషను వీరెప్పుడూ విన లేదనీ ఖండితంగా చెప్పవలసివుంటుంది. గ్రామీణ దాంపత్యాలలోవుండే సంక్షోభం, నిష్ఠురత, వారిలోవుండే వాక్పారుష్యం ఏ అవధిని

వుంటుందో ప్రత్యక్షంగా గమనించినవా రెవరూ అలా అనరు.

శ్రీ సుబ్బారావుగారు ఊహించినది గ్రామీణ దాంపత్యమూ కాదు. ఆయన వాడింది గ్రామ్యభాషా కాదు. వ్యగ్రతాదూషితంకాని చల్లని దాంపత్యం; ఆ దాంపత్యాన్ని వ్యక్తం చెయ్యటానికి శ్రీ సుబ్బారావుగారు నిష్ఠురపదదూషితంకాని చల్లని ప్రసాద గుణంకల భాషను సృష్టించుకున్నారు; లేదా ఆ పాత్రలే వాటి భాష నవి సృష్టించుకున్నాయి.

'గాములేతిరియేళ జముపు గిముపూ మాని
సెట్టుపుట్టా దాటి సేనులో సేనుంటె
మెల్లంగ వస్తాది నా యెంకి
సల్లంగ వస్తాది నా యెంకి'.

నాయుడుబావ హృదయంలో ప్రవేశించినట్టే ఇల్లా మెల్లగా చల్లగా రసికహృదయా లన్నిటిలోకి ప్రవేశించింది 'వొయ్యారి మొలికించుకూ'—యెంకి.

ఇట్టి అలౌకికమిథునాన్ని ఊహించటానికి సుబ్బారావుగారిని ప్రేరేచిన కారణాలేమై వుంటాయి అని ఆలోచించితే మనకు కొన్ని విషయాలు బోధపడవచ్చు. శ్రీ సుబ్బారావుగారు మధ్యమ తరగతి పట్నవాసపు కుటుంబాలకు చెందినవారు. ఈ కుటుంబాలలో పెచ్చుపెరిగిన వ్యర్థాటోపమూ, కృత్రిమ జీవితము, తద్వారా సంక్షుభితములై భిభత్సమైపోయిన దాంపత్య జీవితములూ—వీటిని చూచి శ్రీ సుబ్బారావుగారి అంతరంగంలో చికాకు జనించి ఉండవచ్చు. ఇట్టి ఛిద్రాలులేని దాంపత్య జీవితాన్ని ఊహించటానికి ఆయన హృదయం ఉవ్విళ్లూరి ఉండవచ్చు.

ఏదియేమైనా, ఆయన ఊహించిన ఈ మిథునం, జోతిర్మిథునమై, వ్యర్థాటోప మహాంధకారకూపంలో క్షుభితములైపోతున్న ఆ క్షుద్రదాంపత్యాలను తేజోమయం చేసి సముద్ధరించటానికి సమర్థమైవుంది.

యెంకీ, నాయుడుబావా పరస్పరం ఒకర్నించి ఒకరు వాంఛించేవి—కట్నాలూ, కానుకలూ, నగలూ నాణాలూ, మేడలూ, మిద్దెలూ, రేడియోలూ, కార్లూ గుర్రపందేలకి డబ్బూ, కొటకామార్కెట్టుకు పైసాలూ—ఇవ్వికాదు. వాళ్ళకు పరస్పరం కావలసినవి చల్లని హృదయాలు.

'సరుకులేమి కావాలె సంతన పిల్లా?'
"నువ్వు మరమమిడిసి మనసియ్యి నాయుడుబావా?"
"సక్కదనము కేమిత్తు సంతన పిల్లా?"
"నువ్వు
సల్లగుండు పొద్దాక నాయుడుబావా!"
"యేడ నే నీ కాపురమూ యెల్లుగు పిల్లా?"
"నీ
నీడలోన మేడ కడతా నాయుడుబావా!"

శ్రీ సుబ్బారావు, విద్యార్థిదశలో తాము న్యాయశాస్త్ర కళాశాలనుంచి ట్రాములో తమ మకాముకు తిరిగి వస్తూవుండగా ఈ యెంకిపాటలలోని తొలి గేయం, 'గుండె గొంతుకలోన' అన్నది, దానంతటి కది గొంతులో హఠాత్తుగా మెసిలిందనీ దానిని మననంచేస్తూ ఇంటికి చేరేలోగా సంపూర్ణ గేయంగా రూపొందిందనీ, తొలిసంపుటి పీఠికలో వ్రాశారు. ఆనాడు హఠాత్తుగా ఆ గేయానికి రూపకల్పన జరిగినా, ఈ నూతన గేయకల్పనల వెనుకనున్న విస్తృత వాతావరణాన్ని మనం విస్మరించటానికి వీల్లేదు.

ఆనాడు సాహిత్యరంగంలో ఆంధ్రదేశం నలుమూలల ఒక మహావేశం బయలుదేరింది. సాహిత్యరంగాన్ని ఒక నూత్నవిధానంలో చైతన్యవంతం చెయ్యాలనే తిపాతిహా యువ విజ్ఞానవేత్త లందరిలోనూ బయలుదేరింది. ఆంగ్ల సారస్వత పరిచయమూ జాతీయోద్యమ ప్రభావమూ ఈ నూతనావేశం ప్రభవించటానికి కారణాలైనై. ఎవరికితోచిన విధంగా వారు స్వతంత్రించి క్రొత్తదోవలు త్రొక్కటానికి ప్రయత్నించారు. అట్టి ఆవేశమే ఈ యెంకిపాటలు ఆవిర్భవించటానికి గూడా కారణం. శ్రీ సుబ్బారావుగారు అంతవరకూ ఎట్టి రచనలూ చేయకపోయినా, ఆవేశపరులైన అట్టి రచయితల వాతావరణంలో మెసులుతున్నారు. బసవరాజు అప్పారావు వంటి తద్యుగకర్తల సమావేశాల తర్జనభర్జనలలో పాల్గొంటున్నారు. ఈ వాతావరణంలో ఎంకి పాటలు ప్రభవిల్లినాయి.

కావ్యనిర్మాణవిషయమూ, శబ్దప్రయోగ విషయమూ, తెలిసినవా డెవడూ, గొల్లవాడు కాళిదాసై పోయినట్టు, సాహిత్య పరిచయమేమీలేని సుబ్బారావు ట్రామ్‌బండిలో వస్తూ హఠాత్తుగా కవి అయిపోయాడనే మాటను ఎన్నడూ అంగీకరించడు. శ్రీ సుబ్బారావుగారి భావనావిధానం వెనుక,

# కీ. శే. నండూరి సుబ్బారావు

ప్రాచ్య పాశ్చాత్య సాహిత్యరీతుల పరిచయం అనంతంగా కనుపించుతుంది. 'సహజ కవి' అనే పదానికి ఇటీవల కొందరు ఒక విచిత్రమైన నిర్వచనం చెప్పటం మొదలెట్టారు. కవిగావటానికి పాండిత్యం అక్కర లేదనీ, అమాంతం పుట్టుకతోనే కవిఅయి పుట్టేస్తాడనీ చెబుతున్నారు. ఈ చెత్త అభిప్రాయం కారణంగా ఈ వేళ అక్షరం ముక్కలేని ప్రతిబొడ్డూడని వస్కరంతీ కవినంటూ బయలుదేరటానికి అవకాశం కలిగింది. శాస్త్రజ్ఞానంచేత ఆత్మవికాసం కలుగుతుంది. అట్టి ఆత్మవికాసంతో సమస్త జగత్తునూ తేలికగా అవగతం చేసుకో గల మహత్తరమైన శక్తి కలుగుతుంది, అట్టి శక్తివంతుడైన మహాపురుషుణ్ని 'సహజకవి' అంటారు. మనలో ఒక్క మహాకవి పోతనామాత్యునిమాత్రమే 'సహజకవి' అంటున్నాం. పోతనకు అక్షరంముక్కలు రావనటం ఎంత అపచారంగా వుంటుంది. ఇంతకూ చెప్ప వచ్చిందేమంటే, మహాపండితుడైనా కవిగా ప్రతిభావంతుడు కాలేకపోవచ్చు; కాని కవిగా ప్రతిభావంతుడు కావటానికి విశేషమైన పాండిత్యం అవసరం.

'ఎంకి వస్తాదని యెదురూగ నేబోయి
గట్టుమీదా దాని కంటి కాపడగాను
కాలు కదపాలేదు నా యెంకి
కరిగి నీరౌతాది నాయెంకి'

*   *   *

యెన్నెలంతా మేసి యేరు నెమరేసింది

*   *   *

ఈ భావచిత్రాలను నిర్మించిన కవికి, భావుకులైన యెంతమంది మహాకవుల బలం వెనుక వున్నదో ఎవరు గమనించలేరు!

'ముత్యాలపేరు' అన్న ఈ కావ్యంలో విభ్రమం గొలిపే ఈ భావనను తిలకించండి! ఇది గ్రామీణ శృంగారమనీ, వ్యుత్పత్తిహీనుడైన కవి వ్రాశాడనీ అంటే ఎంత హాస్యాస్పదంగా వుంటుంది.

## —ముత్యాల పేరు—

అద్దములో నా రాజ అంత నీరూపు!
ఇంతిముత్తెములోన ఇరికె నేలాగు?—

ఇన్నిపొంకాలున్న యెంకివే నీవు!
ఇంత నా గుండెలో ఇమిడిపోలేదా?

వోమూపె, వోరూపె, నోవవ్వెరాజా
ఇన్నింట వోపాలె యెటు సెదిరినాదో?

మాటలో, మనసులో, మంచిలో-యెంకీ!
సొగసు నీవోపాలె అగపడిత నాకూ!

అటుతిరగ విటుమసల
వామరమమేటో!
అణిముత్తెములోన
అడిపోతావే!

కునుకల్లె, సినుకల్లె కూకుండె యెంకి
కనబడక మనసులో గంతులేయవటే.

ప్రియునికోసం, ఎంకి అన్వేషణ పరమాత్మునికోసం జీవుని అన్వేషణవలె ఎంతో ఉదాత్తమైన స్థాయిలో మధురవిద్యాల హృదయాన్ని ద్యోతమానం చేస్తోంది. 'మధుర భక్తి మధుర భక్తి' అని ఉచ్చిలు చరిచే ఏ పదకర్త ఇట్టి ఉదాత్త భావనాస్థితిని అందుకో గలిగాడు? పోతన తరువాత మరొకరికెవరికీ ఇట్టి భావావేశం కైవసం కాలేదంటే ఇందులో అతిశయోక్తి లేదు.

## I

'ఈ కలి రొక్కలెవు యే మొచ్చినావే?'
'అకు నే నిక్కడే ఆడినామమ్మ!'
'యేటి నురగలకేసి యేటి సూశేవే?'
'మావోడి మనసట్టె మురుసుతాదమ్మ!'
'సెంద్రవొంకలో యేమి సిత్రమున్నాదే?'
'వొంకపోగానె మా వోడొస్తడమ్మ!'

## II

ఉత్తమా ఇల్లాల నోయీ!
నన్ను సుగుపెడితే దోసమోయీ!
నిగురలో నినునూసి సెదరనేమో మనసు!
పొరుగువారంత నా సరస కురికొరంట!
ఉత్తమా యిల్లాల నోయీ!...
'ఏలనే నవ్వ'ంట! 'ఏసుపేలే' యంట!
పదిమంది—అయింత పగలబడినారంట!
ఉత్తమా యిల్లాలనోయీ!...
గాలెంటవోయమ్మ! దూలెంటవోయమ్మ!
ఇరుగు పొరుగోరంత యిరగబడినారంట!
ఉత్తమా యిల్లాలనోయీ!...
యీ పూది వొకతెట్టె! ఈ పింకొకటితట్టె!
నీలుపిలికెకొకతె! విలిసి మూసేవొకతె!
ఉత్తమా యిల్లాలనోయీ...
సాటుమంతే యెంకి సబకురాజేలావ?
పదిమంది నోళ్లలో పడమంట రాశావ?
ఉత్తమాయిల్లాలనోయి!...

## III

సుక్కెక్కడున్నాదో సూడవే చెల్లీ!
బారడైనా కొంపపైకి సాగిందేమొ!
సుక్కెక్కడున్నాదో సూడవే చెల్లీ!...

తానునిలిపిన గడువు
దాటిపోనే లేదు—

కాలుసేతులు పక్క
కంటుకొని పోనాయి!
సుక్కెక్కడున్నాదో సూడవే సెల్లీ...
సుక్కతోనే కొండ
లెక్కుతున్నాడు—
మబ్బు, మనిసోకొంప
మలుపు పరకాయించి!
సుక్కెక్క డున్నాదో సూడవే సెల్లీ...

ఒకటొకటిగా మెట్లు
ఒదిగి దిగిరావాలి—
తోట యెలపల గలగ
లేటా యినసీవమ్మ!
సుక్కెక్కడున్నాదో...

నా సొగసు నన్నైన
సూసుకో నీవమ్మ—
ఆవుమెళ్ళో మువ్వ
లట్టెమోగిన వేళ!
సుక్కెక్క డున్నాదో...

ఈ మధుర గీతికలను ఇలా ఉదాహరింపుతూ పోతే తీయనీటికి చేప యెక్కినట్టు గ్రంథం ఆదినుంచి చివరిదాకా చర్వణం చెయ్యాలనే వెల్లిపుడుతుంది.

శ్రీ సుబ్బారావుగారు యీ పాటలు ఆషామాషీగా వ్రాసినవి కావు. మనన జలధిని మథించి ఈ అమూల్య మణిజాలాన్ని వెలికితెచ్చారు. అమూల్య పదజాలంలో పొదిగి వాటికి వన్నె తెచ్చారు.

శబ్ద స్వభావాన్ని గుర్తెరుగ లేనివాడు ఎంతటి పండితుడైనా కవిగా రాణించడు. శబ్దానుభవం విశేష గ్రంథ పరిచయంవల్లగాని యేర్పడదు. శబ్దశక్తిని అవగతం చేసుకున్న వ్యక్తికి రసానందం కరతలామలకం. శబ్దానుభూతిలేని మానవుడు నిజంగా దురదృష్టవంతుడు.

శబ్ద ప్రయోగంలో శ్రీ సుబ్బారావుగారికి గల ప్రతిభ అజేయమైనది. అందుచేతనే ఆయనకు వ్యతిరేకంగా అంతగుమారం చెలరేగినా దాన్ని అధిగమించి రసిక ప్రపంచాన్ని యావత్తూ తనవైపు మొగ్గించుకో గలిగాడు.

'నన్ను తలుసుకు యెంకి కన్ను మూయాలి!
కనుబొమ్మ సూడాలి!
కరిగి పోవాలి'

* * *

మెళ్లో పూసలపేరు,
తల్లో పూవులసేరు,
కళ్లెత్తితే సాలు
కనకాబిసేకాలు!—

* * *

పచ్చన్ని సేలోకి పండు యెన్నెల్లోన
నీలి సీరాగట్టి నీటుగొస్తావుంటె
వొయ్యార మొలికించు నా యెంకి!
వొనలచ్చి మనిపించు నా యెంకి!

పై పదజాలాన్ని పరిశీలించితే శ్రీ సుబ్బారావుగారు పద పదాన్నీ ఎలా సానతీర్చిన వజ్రంగా, ఎంత పొంకంగా తయారుచేసి అందించుతారో మనకు బోధపడుతుంది. ఇదంతా గ్రామ్యమని కొట్టిపారేయ జూచే అరసికుల మాటకేమిగాని—శబ్ద ప్రయోగంలో యిలాంటి జాగ్రత్త యీనాడు ఎందరు కవులలో వుంది!

శ్రీ సుబ్బారావుగారు ఈ నూత్నపథాన కావ్య నిర్మాణానికి ఉపక్రమించిన తొలిరోజులలో ఆయన మీద అనంతమైన గుమారం లేచింది. ఆయనతోపాటు ఈ పాటలను తొలిగా ఆవిష్కరించి ఆంధ్ర రసికులకు అందజేయడానికి పూనుకున్న 'భారతి' కూడా కొంతకొంత పండితుల ఈసడింపులు తినవలసి వచ్చింది. అయినా సుబ్బారావుగారు వెనుకాడలేదు. గభీరమైన అభినివేశంతో ముందుకు సాగారు:

'సాటేలా? నీకు మాటేలా?
సిన్నతనమేలా? సిగ్గేలా?
ఆ సీమ యీ సీమ అందరందాలు
తిన్నంగ నిను సూసె దిద్దుకొంటారు!
సాటేలా?...

ముందు మన పాపణ్ణి
కింద దిగనీడు!
యెంకికో వంటారు
యెత్తుకుంటాను! సాటేలా?...

యెంకొక్క దేవతై
యెలిసె నంటారు—
యింటింట పెడతారు
యెంకి నీ పేరు'

అని సాహసోపేతుడై ముందుకుసాగి విజయాన్ని చేపట్టారు. లతాపుష్ప పరిశోభితమైన ఆంధ్ర సాహిత్యపు తామరకొలను సోపానాలమీద ప్రణయ సమ్మోహితులై సరసాలాడుకుంటూ కూర్చున్న ఎంకి-నాయుడుబావలు మనకు సర్వదా కనుపించుతూ వుంటారు. 'యెంకి సరసాలాడ జంకుతావుంటె, సూసి సూడక కన్ను మూసి తెరుస్తూ' గోవుమాలచ్చిమి కూడా ప్రక్కనే దర్శనమిస్తుంది.—

కాని...ఇంతా చేసి సుబ్బారావుగారు మనందర్నీ విడిచిపెట్టేసి, ఈ లోకం నుంచి వెళ్లిపోయారనే మాట చప్పున జ్ఞాపకంరాగానే కడుపులో కొండంత దుఃఖం ముంచుకొస్తుంది.

# ఛాందసులు

శ్రీ పమిడిముక్కల లక్ష్మణరావు

పాత్రలు: డాక్టరు, శకుంతల, తండ్రి, దాసు, పంకజం.

* * ప్రక్కగదిలో రేడియో మెల్లగా పాడుతూవుంటుంది..."గృహమేకదా స్వర్గసీమా! చిన్నారి పొన్నారి..." అని; భార్య పేముకుర్చీలో కూర్చుని భర్తకు స్వెట్టర్ అల్లుతూ వుంటుంది. భర్త బిస్కట్లు నంజుకుంటూ కాఫీ తాగుతూవుంటాడు.

భార్య : ఈపాట విన్నప్పుడల్లా నాకు చెడ్డ చిరాకేసుకొస్తుంది.

భర్త : ఎందుకో?

భా : పిల్లలుంటేనేనా ఇల్లు స్వర్గసీమ? పిల్లలు లేకుండా మనం హాయిగా బ్రతికటంలేదూ?

భ : నిన్న ఇంటికిరావటం కాస్త ఆలస్యమైతే ఏమన్నావ్?

భా : ఏమన్నానేమిటి?

భ : "మీరు రావటం ఒక్కనిమిషం ఆలస్యమైతే గడియారంవైపు చూడలేక కళ్ళు కాయలు కాచిపోతున్నాయ్" అన్నావు. యేం అన్నావా?

భా : ఊఁ అంటే?

భ : పిల్లలుంటే అలా అనేదానివా?

భా : ఎలా అనేదాన్నో అదికూడా మీరే సెలవీయండి.

భ : "అప్పుడే ఐదు అయిందిటండీ? అబ్బ! పెద్దవాడు మీరొచ్చినదగ్గిరనుంచీ ఒకటే అల్లరి. చిన్నవాడు సరే సరి, పోయి నడివీధిలో కూర్చుంటాడు. వచ్చే కార్లూ, పోయేబళ్లూ పట్టుకోలేక నాప్రాణం విసిగిపోతోంది. ఇక మూడోవాడు...

భా : ఇకచాలు ఆపండి. ఆలు లేదు చూలు లేదు కొడుకుపేరు సోమలింగంట ... అన్నట్టు జ్ఞాపకంచేశారు. నిన్నసాయంత్రం ఇంటికి రావటం ఆలస్యం ఎందుకైందంటే చెప్పనే లేదు.

భ : అప్పుడే చెప్పాననుకొంటాను.

భా : నిజం చెప్పకుండా ఏవో మాటల్లోపెట్టి మరిపించారు.

భ : ఆ ఏముందీ—మామూలుగా ఆస్పత్రుల్లో జరిగే సంగతులే—ఒకళ్ళు పోతారు. మరొకరు వస్తారు.

భా : రోగులా?

భ అబ్బే—డాక్టర్లే.

భా పోయినవా రెవరు?

భ మిస్ ఛార్లెట్ అని ఒక లేడీడాక్టరు లేదూ? ఆవిడకు బదిలీ అయింది.

భా మరి వచ్చిందెవరు?

భ క్రొత్తిగా యమ్. బి. ప్యాసయి వచ్చింది ఇంకో మిస్సు; పార్టీ జరిగింది. అందువల్లనే ఇంటికిరావటం కాస్త ఆలస్యమయింది. ఇదీ వస్తగింజలో బియ్యపుగింజ.

భా : ఈ కాస్తా అప్పుడే చెబితే మళ్ళీ అడిగే దాన్ని కాదుగా.

---

* ఆంధ్ర విశ్వకళాపరిష దాంధ్రభాషాసమితి నిర్వహించిన ఏకాంకికల పోటీలో ప్రథమ బహుమతి నందుకొన్న నాటిక. (1956—57)

భ : మధ్యాహ్నంపూట ఊరికే కూర్చుని యిలా ఆలోచిస్తూవుంటావ్ కాబోలు.

భా : ఈమధ్య పగలు అసలు మరీబోరుగా చచ్చిపోతున్నాను.

భ : ఏవైనా పత్రికలు చదువుకో.

భా : ఎంతసేపని చదవను?

భ : మరి బాతాఖానీకి దాసుగారిభార్య రావటం లేదూ?

భా : నెలరోజులనుంచీ ఆవిడ వూళ్ళోలేదు.

భ : ఏం? తీర్థయాత్రకు వెళ్ళిందా?

భా : పుట్టింటికి వెళ్ళింది.

భ : మరి ఆయన భోజనం?

భా : హోటలునుంచి కారియరు తెప్పించుకుంటున్నారు.

ఆడవాళ్లతో ఇదేచిక్కు. ఏడాది కాపురం చేస్తారో లేదో, దొరలు వేసవికాలం ఊటీకి వెళ్ళినట్టు పుట్టింట్లో రెండునెల్లు మకాం చేసిరావాలి.

భా : రెణ్ణెల్లుకాదు, అవి ఇంకా నాలుగునెలలన్నా వుండాలి.

భ : అదేం? ఓ ... సరే. చెప్పబోకు ... అర్థమైంది—"అర్థమైంది—వూఁ ఇదింకోటి.

భా : అబ్బ వూరుకోండి! మీకు హాస్యంగానే వుంటుంది మా అవస్థ చూస్తుంటే.

భ : అవస్తేం?

భా : కాదుమరి? ఒక్కటి చెప్తాను మీకు కోపం రాదంటే.

భ : వచ్చేదైతే నువ్వు చెప్పవని నాకు తెలుసుగా.

భా : మీ మగాళ్లు భార్యలు కష్టాలు పడుతూంటే నవ్వుతారు. ఆవిడ రేపు బిడ్డను కనబోతూ పుట్టింట్లో అవస్థపడుతూ ఉందనుకోండి. ఇక్కడ ఆదాసుగారు తను ఇవాళ్నో రేపో తండ్రిని కాబోతున్నానని నలుగురికీ చెప్పుకొని టీ పార్టీలు చేసుకొంటారు.

భ : ఏం తప్పా?

భా : ఆ దాసుగారే ఆవిడ కాస్త సింగారించుకొని ఆయన ఆఫీసునుండి ఎప్పుడొస్తారా అని అలా వీధిలో కాసేపు నిల్చుని చూస్తుంటే...

భ : ఊఁ ఆగావేం?

భా : "వీధి కాపలావేశావే. తప్పించుకుపోతాననుకున్నావా?" అని పైకినవ్వుతూనే సందు నాలుగుమూల్లా చూస్తారు.

భ : బాగుబాగు! నువ్వసలు బి. ఎ. దాకా చదవాల్సింది, మీ నాన్నగారు ఇంటరుతోనే ఆపేశారుగాని...

భా : పోనీ ఆ బి. ఎ. మీరు చెప్పించరాదూ?

భ : నువ్వు చదువుకొంటానంటే రేపీపాటికి తీసికెళ్ళి కాలేజీలో పడేస్తాను.

భా : ఇక్కడుంటే చదువుసాగదు. హాస్టల్లోవుండి రెండేళ్లు చదువుతాను.

భ : రెండేళ్ళే!... కాసిని మంచినీళ్లుందుకో.

భా : రెండేళ్ళేగా ... ఆరేళ్లుమీరు డాక్టరుకోర్సు చదవలేదూ?

భ : రెండేళ్లంటే ఇరువయినాలుగు నెలలు, అంటే

భా : 720 రోజులు. సరేనా. మరి నేను అంత ఆలస్యంగా వచ్చారేమని అడిగినందుకే ఇన్ని శాస్త్రాలుచెప్పారే. ఏదన్నా తమదాకా వస్తేగాని తెలిసిరాదుట.

[రేడియోలో ఒకామె త్యాగరాయకీర్తన పాడుతూవుంటుంది. దాసు ప్రవేశిస్తాడు]

దాసు : హల్లో. గుడీవినింగ్ డాక్టర్!

[శకుంతల లోపలికి వెళ్తుంది]

డాక్టరు : రండి దాసుగారూ! చాలారోజులయింది మనం కలుసుకొని. ఇరుగుపొరుగు వారమైనా మనం పొరుగూరి వాళ్ల క్రిందే లెక్క.

దాసు : ఏదండీ ఈమధ్య బొత్తిగా తీరికవుండటం లేదు. పగలు భోజనంకూడా రేడియోస్టేషనుకే తెప్పించుకుంటున్నాను. రాత్రి ఏ పన్నెండింటికో ఇంటికివచ్చి మళ్లీ ప్రొద్దునే వెళ్ళిపోతున్నాను.

[శకుంతల లోపలినుండి కాఫీ తెస్తుంది. వస్తూ రేడియో ఆపివస్తుంది.]

దాసు : నమస్కారమండీ.

శ : నమస్కారమండీ. కాఫీ పుచ్చుకోండి.

దా : (తీసుకొంటూ) థాంక్స్.

శ : అక్కయ్యగారు ఖులాసాగా వున్నట్లు ఉత్తరం వచ్చిందా?

దా : మొన్ననే వచ్చింది. ఖులాసాయేనట. మిమ్మల్ని అడిగానని చెప్పమంది.

శ : ఆవిడ పూరెళ్లి వదగ్గఱ్నుంచి నాకు పొద్దు పోవటంలేదు. ఆవిడుంటే ఏదో ఆడుతూ పాడుతూ కాలక్షేపం చేసేవాళ్లము.

దా : ఆడుతూ పాడుతూ అంటే గుర్తొచ్చింది. ఇప్పుడు నేను ఇంట్లోకివస్తూ రేడియోపాట విని మీరేపాడుతున్నారనుకొన్నాను.

శ : ఎలా అనుకున్నారు?

దా : మీకు సంగీతమంటే చాలాఇష్టమనీ, చక్కగా పాడతారనీ మా శ్రీమతి అంటూ వుండేది. కాపురంచేసుకొంటూ ఇంకా సంగీతం సాధకం చేస్తున్న మీలాంటివారు చాలాఅరుదు. అందుకు ముఖ్యంగా డాక్టరు గారిని అభినందించాలి.

శ : కాపురానికొచ్చాక నేర్చుకొన్నది కాదు లెండి. మానాన్నగారు నా తొమ్మిదో ఏటినుంచే నాకు సంగీతం చెప్పించారు.

దా : అలాగా. చాలా సంతోషమైన విషయం. ఆ అభ్యాసం ఒక్క అరవవాళ్లల్లోనే చూశాను. ఆడపిల్లకు ఆరోసంవత్సరం రావటంతోనే శాస్త్రీయమైన సంగీతమో, నృత్యమో నేర్పిస్తారు. ఆ శ్రద్ధ మన తెలుగు వాళ్లల్లో మీ నాన్నగారిలాంటివారికి ఏకొద్ది మందికోతప్ప అందరికీ లేదు.

శ : లేదండీ. ఇప్పుడిప్పుడు మనవాళ్లల్లోకూడ సంగీతం అదీ చక్కగానే చెప్పిస్తున్నారు.

డాక్టరు : అవీ పెళ్లి సంగీతాలులెండి దాసుగారూ. పిల్లకు ఆమూడుముళ్లూ పడేవరకూ నాలుగు జంటస్వరాలూ, ఒకటో రెండో త్యాగరాయ కీర్తనలు నేర్పించి తాంబూలాలు పుచ్చుకొన్న మార్నాడే మానిపిస్తారు.

శ : ఎలాగోకష్టపడి సంగీతం నేర్చుకుంటేమాత్రం దానివల్ల ప్రయోజన మేముంటుంది దాసు గారూ? ఎన్నివిద్యలు నేర్చినా ఆడదానికి వంటచెయ్యటం తప్పదుగదా?

దా : అలాఅనకండి. విద్య నేర్చుకొన్నంతమాత్రాన అది సార్థకంగాదు. దానిని ఉపయోగంలోకి తీసుకొనిరావటంవల్లనే అది రాణిస్తుంది. ఉదాహరణకు మీసంగతే చెప్తాను. అంత చిన్నవయస్సునుంచీ సంగీతం నేర్చుకొని దానివల్ల ఏమి సాధించారు చెప్పండి.

శ : అందుకని సంసారాలుచేసుకొంటున్న వాళ్లము ఊరూరా తిరిగి కచేరీలు చెయ్యటానికి వీలుంటుందా దాసుగారూ?

దా : ఊరూరా తిరగఖ్ఖర్లేదు. ఒక్కచిన్నప్రశ్న అడుగుతాను మీకు కోపంరాదంటే—ఈ పట్టణంలో ఇన్ని సంగీతసభలు జరిగాయి. ఎంతోమంది విద్వాంసులొచ్చి పాల్గొన్నారు—ఒక్కసభలోవచ్చి మీపాండిత్యం చూపారా? పోనీ పదుగుర్లో పాడటము సిగ్గయితే కనీసం మా రేడియోలో ఒక్క కార్యక్రమంలోనైనా పాల్గొన్నారా చెప్పండి? మొన్నీ మధ్యనే శ్రోతలకోసం రేడియో వారము జరిపాము. ఎన్ని కార్యక్రమాలు! ఎంతమంది పాల్గొన్నారు—అది కేవలము మీ తప్పే కాదనుకోండి—డాక్టరుగారికేమన్నా అభ్యంతరము వుండవచ్చు.

డాక్టరు : ఉరుము ఉరిమి మంగలంమీద పడ్డట్లు మధ్య నన్ను దోషిగా చేశారే. ఆవిడ వెళ్తానంటే నేను కాదంటానా? సంగీతం అంటే ఆవిడ కంత సరదా అనే—దానివల్ల ప్రతిసారీ నాకు డబ్బు దురద వదిలినా—ప్రతి గాన సభకూ హాజరై, ముందుసీట్లలో కూర్చుంటాము. పైగా మా శకూ కాలక్షేపం కోసం కొత్తగా రేడియోకూడ కొన్నాము. చూశారా దాసుగారూ! శకూ! వెళ్ళి రేడియో ట్యూను చేసిరా. దాసుగారు కాసేపు వింటారు.

[శకుంతల రేడియో ట్యూనుచేసి వస్తుంది. రేడియోలో...]

ఒకకంఠం : ఆడది ఇల్లుకదిలి బయటకు అడుగు పెట్టటమే చాలామంది మొగాళ్లకు యిష్టముండదండీ. అలాంటప్పుడు కచేరీలు చెయ్యటమంటే వాళ్లదృష్టిలో అదేదో నీచమైన పని.

రెండో కంఠం: మీ శ్రీమతి చెప్పినదానితో మీరు ఏకీభవిస్తారా రావుగారూ?

రావు : అది గిట్టకపోవడం కాదనుకోండి. నాకు మటుకు నాకొపని ఇష్టమే. కానీ...మా అమ్మ, నాన్న మాత్రం కాస్త ఛాందసులండి. వాళ్ళకిది తెలిస్తే...

రెండో కంఠం: తెలిస్తే ఏం చేస్తారండీ? ఇదేం కాని పనా?

రావు : కాదనుకోండి. వాళ్లు కాస్త పూర్వకాలపు వాళ్లు...

శకుంతల: ఏదో నాటికలా వుందే, అచ్చం మనం మాట్లాడుకున్నట్లే వుంది.

దాసు : "ఛాందసులు" అని విజయవాడనుండి ఈ నాటిక ప్రసారమౌతోంది.

డాక్టరు : చాలా తమాషాగా వుంది. వాళ్ళూ మనం మాట్లాడుకొంటూందే మాట్లాడుకోవడము ఆశ్చర్యం కాదూ?

దాసు : దీన్నే 'కోయెన్సిడెన్స్' అంటారు. గాంధి గారిలాంటి మనిషి ఇంగ్లెండులో వున్నాట్ట.

డాక్టరు : పదండి దాసుగారూ. రేడియో రూములో కూర్చుని కాసేపు ఆనాటిక విందాము రండి. ఇవాళ మనిద్దరికీ సెలవేగా.

[ముగ్గురూ లోపలి గదిలోకి వెళ్తారు. రేడియోలో కలవరం వినిపిస్తుంది. తెర పడిపోతుంది.]

## 2

** తెర లేచేసరికి పుష్‌బటన్ నొక్కినట్లు బైటనుండి వినిపిస్తుంది. శకుంతల స్టేజిమీదుగా బైటికి వెళ్ళి తలుపు తీస్తుంది.

శకుంతల: (తలుపు తీస్తూ) ఎవరూ?

స్త్రీకంఠం: (బైటనుంచే) డాక్టరు రాఘవేంద్ర రావు గారు వుండేది ఇక్కడే కదండీ?

శకుంతల: అవును. లోపలికి రండి.

[హైహీల్డు షూస్ తొడుక్కొని అందంగా నాజూగ్గా అతిఆధునికంగా వున్న ఓయువతి చేతిలో హేండ్‌బ్యాగ్ విలాసంగా తిప్పుతూ ప్రవేశిస్తుంది.]

ఆమె : డాక్టరుగారు లోపల వున్నారా అండీ?

శకుంతల: ఆ! వున్నారు. కూర్చోండి. మీ పేరు...

[డాక్టరు రావు, రామదాసు లోపలినుండి బైటికి వస్తారు.]

రావు : హల్లో మిస్ పంకజ! ఏమి టిలా వచ్చారు. (రామదాసు వంక, శకుంతలవంక చూస్తూ) ఈమె మిస్ పంకజ. క్రొత్తగా హాస్పిటల్ లో డాక్టరుగా పోస్టు అయ్యారు. (దాసు వంక చూపిస్తూ) ఈయన మా నైబర్ రామదాసుగారు–రేడియో స్టేషనులో పనిచేస్తారు.

రామ : నమస్కారం.

పంకజ : నమస్కారం.

రావు : ఈమె నా భార్య—శకుంతల.

పంకజ : నమస్కారం శకుంతలా దేవిగారూ.

శకు : నమస్కారమండి. కూర్చోండి.

[అందరూ సోఫాలమీద కూర్చుంటారు.]

రామ : మీ రెన్నాళ్ళయింది ఈ వూరు వచ్చి.

పంకజ : మొన్ననే చార్జీ పుచ్చుకొన్నాను. నాకీ వూరు చాలా క్రొత్తగా వుంది. తెలిసినవాళ్లెవరూ లేరు. కాలం గడవక చచ్చిపోతున్నాను.

శకు : మొన్న వచ్చారో లేదో అప్పుడే అలా అనుకొంటున్నారు.

రామ : ఏదన్నా క్లబ్బుకి వెళ్ళకపోయారా?

పంకజ : నాకీ క్లబ్బులంటే ఇష్టంలేదండి. ఏవో పుస్తకాలూ, సినిమాలూ తప్ప మరే వ్యాసంగాలూ లేవు.

శకు : మీకు నవలలు చదవడమంటే చాలా సరదాలా వుంది.

పంకజ : అవును. మీకు?

శకు : నాకు సంగీతమంటే చాలా మక్కువ.

రామ : శకుంతలాదేవి చాలా బాగా పాడుతారు.

పంకజ : ఓ! అలాగా! అయితే డాక్టరుగారికి మంచి కాలక్షేపమే.

రావు : (నవ్వుతూ) అందుకనే రేడియో కొన్నాను.

పంకజ : మీ దగ్గరేమన్నా కానన్ డైల్ పుస్తకాలుంటే పంపండి డాక్టర్. చదివిస్తాను.

రావు : ఓ తప్పకుండా - వుండాలి. చూసి పంపుతాను.

పంకజ : అయితే మా బోయ్‌ని పంపుతాను. ఇక్కడ గాలి చాలా బావుంది. మంచి వాతావరణం. వస్తాను డాక్టర్. ఏదన్నా పిక్చరుకు వెళ్తాను. (కొంచెం ముందు కెళ్ళి మళ్లీ వెనక్కు తిరిగి) అన్నట్టు మరిచాను. మంచి పిక్చర్సు ఏం వున్నాయండీ?

రామ : "షి స్టూప్స్ టు కాంకర్" వుంది.

పంకజ : బి. సి. నాటిది.

రావు : "డిసైర్" ఆడు తున్నట్లుంది.

పంకజ : క్రైమ్ పిక్చర్సు ఏమీ లేవూ? సరే లెండి నేను కనుక్కుంటాను. వస్తా.

[వెళ్లిపోతుంది]

రామ : ఈవిడ కొంచెం తమాషా మనిషిలా వుందే.

రావు : ఏం అలా అన్నారు?

రామ : క్లబ్బులంటే పడేను. ఎవరూ స్నేహితుల్లేరట. పుస్తకాలుంటే కాలం గడుస్తుంది-అందులో షెర్లాక్ హోమ్స్.

శకు : ఒకసారి నిద్రపట్టక "హౌండ్ ఆఫ్ బాస్కర్ విల్లీ" (Hound of Baskerbille) చదివాను. సగం చదివే సరికి ముచ్చెమటలు పోశాయి నాకు.

రామ : నిజం—మగవాళ్లకు మాకే అది రాత్రివేళ చదువుతూంటే గుండె పీచుపీచు మంటుంది... ఇంతకీ రేడియో స్టేషను కెప్పుడు వెళ్దాం.

రావు : చూద్దాం లెండి.

రామ : చూద్దాం అంటే కాదు. తప్పకుండా తీసుకు రండి...పోనీ మీ కభ్యంతరమైతే వద్దులెండి.

రావు : అబ్బే. నాకేమీ లేదండీ. సరే, ఎప్పుడు వెళ్దామంటారు.

రామ : రేపు ఉదయం నేను వస్తాను. మనం ముగ్గురం కలిసి రేడియోస్టేషనుకు వెళ్లి (ఆడిషన్) చేయిద్దాము.

రావు : మంచిదండీ.

రామ : కొంచెం తొందర పనుంది. శలవు పుచ్చుకొంటాను...డాక్టరుగారు మర్చిపోతారేమో మీరన్నా జ్ఞాపకం చెయ్యండి శకుంతలాదేవి గారూ.

శకు : అలాగే నండి.

[రామదాసు వెళ్లిపోతాడు]

పాపం ఆయన పనిగట్టుకొని ఇది చెప్పటానికి వచ్చారు.

రావు : ఇక రేపట్నుండీ శకుంతలాదేవి గానం గాల్లో—అంటే గగన పథంలో తేలిపోతుందన్న మాట.

శకు : ఇంకానయం. నేనే తేలిపోతా నన్నారు కాదు.

[ఇద్దరూ నవ్వుతారు]

శకు : నలుగుర్లో పాడటమంటే నాకు భయంగా వుందండీ.

రావు : మన దాసుగా రుంటారుగా.

శకు : (ఆశ్చర్యంగా) అయితే మీరు రారన్న మాట! అయితే నేనూ వెళ్లను.

రావు : అరెరె! నా కోసం నువ్వు మానుకోవడ మెందుకు? సరే చూద్దాం. వీలుంటే నేనూ వస్తాలే. అదిగాక దాసుగారు పరాయి వారేమీ కాదుగా.

శకు : ఇక రండి. భోజనం చేద్దాం. కబుర్లతో కడుపు నిండి పోయినట్టుంది మీకు.

రావు : నాకా! ఎలికలు ఎప్పుడో జొరబడితే.

[ఇద్దరు నవ్వుకొంటూ లోపలికి వెళ్తారు. తెర పడుతుంది.]

## 3

** తెర లేచేసరికి రేడియోలో డిస్టర్బెన్స్, నేపథ్య సంగీతం వినబడుతూ వుంటాయి

తండ్రి : (ప్రవేశిస్తూ) అబ్బాయి రాఘవా!

రావు : (లోపలినుండి వస్తూ) ఎవరూ? (చూసి) నువ్వా నాన్నా! ఎప్పుడొచ్చావ్?

తండ్రి : ఈ బండికేరా

రావు : ఉత్తరం పత్రం వ్రాయకుండా వచ్చావేం నాన్నా. స్టేషను కొచ్చే వాణ్ణిగా.

తండ్రి : ఆ-ఎందుకురా నే రాలేనూ! ఏదో చూసి పోదామని బుద్ధి పుట్టింది. ఆ పళంగా రైలు దేరి రైలెక్కాను.

రావు : బాగుంది. ఇంటి దగ్గిఱ ఇలా వెళ్తున్నానసైనా చెప్పివచ్చావా? అమ్మ కంగారుపడుతుందేమో!

తండ్రి లేదురా. ఇక్కడున్నట్లు వైరిద్దామురే. కోడలేది!

రావు అలా బైటికి వెళ్ళింది.

తండ్రి ఎక్కడికి!

రావు ఇప్పుడే వస్తుంది.

తండ్రి అదేదీ, ఆ రేడియో స్టేషనుకేగా.

రావు అవున్నాన్నా. నీ కెవరు చెప్పారు!

తండ్రి కుప్పిళ్లు మూస్తావు గాని లోకం నోళ్లు మూయగలవుట్రా? ఇదసలు మన ఇంటా వంటా వుందిరా రాఘవా! ఆడది ఆకుల్లో పిందలాగ అణగి మణగి వుండాలి గాని ఇలా వీధి కెక్కితే నలుగురూ ఏమంటార్రా?

రావు : ఇప్పుడది వీధి కేమెక్కింది నాన్నా?

తండ్రి : వీధి క్కెక్కకపోతే ఏమిట్రా నలుగుర్లో యాగీ అయినాక. ఒక రాత్రినీ, పగలనీ లేకుండా రేడియో స్టేషన్లో తిరుగుతోందట-ఇలా చేస్తే, ఇంకా నలుగురుకూతుళ్లకు పెళ్లిళ్లు చెయ్యాలి నేను—అదేమన్నా గ్రహించారా మీరు—కొమ్మకు చీడ పడితే అది చెట్టుకు చేటు కాదుట్రా. (శకుంతల మెల్లిగా వస్తుంది) ఏవమ్మా...ఎక్కణ్నుంచీరావడం?

శకు : నేనా...అలా వెళ్ళాను మామయ్యా.

తండ్రి : అలా అంటే ఎలా? ఇలా అని చెప్పు. వెళ్ళగా లేనిది చేస్తే తప్పు.

శకు : తప్పనికాదు మామయ్యా—రేడియోస్టేషనుకి వెళ్ళాను.

తండ్రి : ఒక్కదానివేనా?...

శకు : వారిని రమ్మన్నా మామయ్యా. పనుంది రానన్నారు.

తండ్రి : ప్రపంచజ్ఞానం తెలిసినదానివి, సంసార బాధ్యతలు ఎఱిగున్నదానివి నువ్వే ఇలా ప్రవర్తించటము తప్పుకాదుటమ్మా. భర్త వెంటలేకుండా పరాయివాళ్ళవెంట తిరగటము.

శకు : వారు వెళ్లమంటేనే వెళ్ళాను మామయ్యా. దాసుగారు కార్లోతీసుకెళ్లి కార్లో దిగబెట్టారు.

తండ్రి : సర్లేవమ్మా —— చెప్పొచ్చావ్ పైగా. మా రోజుల్లో యీ రేడియోలూ, టూడియోలూ లేకపోయినా అక్కడేం జరుగుతుంటాయో అన్నీ మాకు తెలుస్తూనేవుంటాయి.

శకు : సరిగ్గా తెలియనివాళ్లు అనేక కథలు పుట్టిస్తారు మామయ్యా. ఒక్కసారిమాస్తే మీకే తెలుస్తుంది అదెలాంటిచోటో.

రావు : నిజమే నాన్నా. రాత్రికి మళ్ళీ ప్రోగ్రామ్ వుంది. అప్పుడు నువ్వుకూడా వెళ్లు. నీకు నచ్చలేదంటే మానేస్తుంది. సరేనా.

శకు : మీ పరువుప్రతిష్ఠకు భంగం కలుగుతోందంటే అది మాకు కలిగినట్టుకాదా మామయ్యా? —— లోపలికిరండి. వేడినీళ్లున్నాయి. స్నానంచేద్దురుగాని.

రావు : ముందు స్నానంచేసిరా నాన్నా.

తండ్రి : (ఆలోచిస్తూ లోపలికి వెళ్తాడు.)

[మిస్ పంకజ వస్తుంది.]

పంకజ : హల్లో గుడ్‌మార్నింగ్ డాక్టర్.

రావు : వెరీగుడ్‌మార్నింగ్. ఏం ఇలావచ్చారు?

పంకజ : ఆ! ఏంలేదు. రిక్షావాడు రాలేదు. మీరు లిఫ్ట్ ఇస్తారేమోనని వచ్చాను.

రావు : 'ష్యూర్' ఇప్పుడే డ్రస్సుమార్చుకొని వస్తా తప్పకుండా —— కుర్చోండి, శకూ డాక్టరుగారికి కాఫీ పట్టుకురా.

పంకజ : నేను కాఫీ తాగను డాక్టర్.

రావు : ఏం తాగుతారు?

పంకజ : మిల్కో గానీ, ఓవల్టీనుగాని.

రావు : శకూ డాక్టరుగారికి ఓవల్టీను కలుపు. వస్తాను కూర్చోండి. వన్‌మినిట్.

పంకజ : ఆ—చూడండి. సాయంత్రం మీకేదన్నా ఎంగేజిమెంటువుందా?

రావు : లేదు. ఎందుకు?

పంకజ : 'డిసైర్'కి రెండు టిక్కెట్లు తెప్పించాను. వస్తారా? (శకుంతల కప్పు పట్టుకొస్తుంది.)

పంకజ : ఏమంటారు?

రావు : దోవలో మాట్లాడుదాం. ఓవల్టీను తీసుకోండి. (లోపలికి వెళ్తాడు.)

శకు : నమస్తే డాక్టర్.

పంకజ : నమస్తే. ఇవాళ మీకేదో ప్రోగ్రామ్ వుందనుకొంటాను.

శకు : అవును. ఇప్పుడేవచ్చాను. మళ్ళీ సాయంత్రం వెళ్లాలి.

పంకజ : (తాగుతూ) క్రిందటిసారి విన్నాను రేడియోలో మీ పాట......శాస్త్రీయ సంగీతం చాలాబాగా పాడుతారు మీరు.

శకు : 'థాంక్స్' [తండ్రి వస్తాడు స్నానంచేసి.]

తండ్రి : (వస్తూ) ఈ మెగా రెవరు?

శకు : వారి తోటిడాక్టరు మామయ్యా — వీరు మా మామగారు.

పంకజ ఓ-ఐ-సీ-నైస్-వెరీగ్లేడ్ టు సీ యు. (షేక్ హ్యాండు చెయ్యబోతుంది.)

తండ్రి నాకు చెయ్యి చూపటం రాదమ్మాయీ!

శకు : (నవ్వుతుంది.) అదికాదు మామయ్యా. చెయ్యి చూపమనికాదు అడిగేది, చెయ్యి కలపమని. అది దొరల పద్ధతి.

తండ్రి : ఇప్పుడు చూసిందో లేదో అప్పుడే చేతులు కలపటందాకా వచ్చిందా? వస్తుతల్లీ. ఆ దొరల పద్ధతులు మనకెందుకు?

పంకజ : (చిన్నబుచ్చుకొని) ఐ యామ్ సారీ. (రావు వస్తాడు.)

రావు : (వస్తూ) దేనికి?

శకు : అబ్బె ఏమీ లేదు. ఆవిడ షేక్‌హ్యాండు చెయ్యబోతే మామగారికి అర్థంకాలేదు...

రావు : కాకపోతే నువ్వు చెప్పఖర్లా?

శకు : అదే చెబుతున్నాను. ఇంతలో మీరొచ్చారు.

రావు : ఆల్ రైట్ - పదండి డాక్టర్—సాయంత్రం ఆలస్యంగా వస్తానేమో అప్పాయింటు కేసులున్నాయి—నాన్నకుకూడా రేడియోస్టేషనుకు తీసుకొనివెళ్ళు—వస్తానాన్నా.

తండ్రి : భోజనంచేసి పోవట్రా?

రావు : టైములేదు.

శకు : క్యారేజీలో పెట్టి పంపుతాలే మామయ్యా.

[రావు, పంకజ వెళ్ళిపోతారు.]

తండ్రి : బాగానేవుంది సాంగత్యం—

శకు : మీకు మడిబట్ట ఆరేశాను. పూజచేసుకోండి మామయ్యా.

తండ్రి : ఆ సంచిలో భగవద్గీత పుస్తకం వుంది. అందుకో తల్లీ.

[లోపలికి వెళ్తారు: తెర]

## 4

* * తెరలేచేసరికి రేడియో డిస్టర్బెన్సెస్ ......సంగీతం ..... కిలకిలా నవ్వులు వినిపిస్తాయి. డాక్టర్ రావు, పంకజ వస్తారు. వచ్చి లైట్లు వేస్తారు.

రావు : తలకాయ నొప్పిగావుందని ఇటర్‌వెల్ లోనే బైటికి లాక్కొచ్చావ్. నిజమే ననుకొన్నాను.

పంకజ : డాక్టర్ల దగ్గిర జబ్బు దాగుతుందా?

రావు : జబ్బు అంటే జ్ఞాపకం వచ్చింది. నేను ప్రైవేటు ప్రాక్టీసు చేస్తున్నప్పుడు ఒక పేషెంటు వచ్చాడు. బాగా డబ్బున్నవాడు. పరీక్షచేసి రోగం ఏమీ లేదయ్యా అని చెప్పాను. అంటే వినడే—ఒకవారంరోజులు ఏదో మందిచ్చి 150 రూపాయలు బిల్లు చేశాను. ఆబిల్లు తీసుకొని "డాక్టర్! ఇపట్నుంచీ మందవసరంలేదు. రోగం పూర్తిగా నయమైంది" అన్నాడు. "మందు బాగా పనిచేసిందన్నమాట" అన్నాను. "మందుకన్నా ఈ బిల్లు బాగా పనిచేసింద"న్నాడు.

[ఇద్దరూ నవ్వుతారు.]

పంకజ : అలా వుందంటారా నారోగం? అయితే బిల్లురాయండి.

రావు : కాగితంలేదు. చేతిమీద వ్రాస్తాను. (చెయ్యి గిల్లుతాడు) (ఇద్దరూ నవ్వుతారు.)

[గడియారం తొమ్మిది కొట్టుంది.]

పంకజ : మీ మిసెస్ వాళ్ళింకా రాలేదు?

రావు : వస్తారు. స్టేషనునుంచి ఇక్కడకు రావటానికి అరగంటన్నా పడుతుంది.

పంకజ : శకుంతలాదేవికి చాలా ప్రోగ్రాములు వస్తున్నాయి కదూ డాక్టర్?

రావు : దాదాపు ప్రతివారం ఏదో ఒకటివుంటోంది.

పంకజ : నేనొకటి విన్నాను డాక్టర్. మీరు ఇంకో విధంగా అనుకోకుండా వుంటే...

రావు : చెప్పు...

పంకజ : అభిమానులకు తప్ప ఇతరులకు ఎక్కువ ప్రోగ్రాములు ఇవ్వరట అసలు.

రావు : .........

పంకజ : దాసుగారు మీ మిసెస్ విషయంలో చాలా ప్రత్యేకశ్రద్ధ చూపిస్తారని కూడ చాలా మంది చెప్పారు.

రావు : (హాసం)

పంకజ : పెళ్ళయినా కాకుండా 'ఏ' క్లాస్ ఆర్టిస్టుల్లో చేర్చారట ఆమె పేరు.

రావు : నేనే పెళ్ళయున్నాను.

పంకజ : ఆయన స్వంతకార్లో ఆమెను తీసుకెళ్ళి మళ్ళీ ఇంటి దగ్గర దిగబెట్టారట. ఇదంతా అభిమానం కాదంటారా డాక్టర్?

రావు : నిన్ను ఇంటిదగ్గర దిగబెట్టాను పద.

పంకజ : ఇవాళ మీ భోజనం నా క్వార్టర్సులో ఏర్పాటు చేశాను డాక్టర్.

రావు : ఎందుకు?

పంకజ : ఇవాళ నా బర్త్‌డే డాక్టర్.

రావు : మరి ప్రొద్దుటినుంచీ ఎందుకు చెప్పలేదు? మానాన్న కూడ వున్నారు. ప్రొద్దున భోంచేయలేదు ఇంట్లో.

పంకజ : (చెయ్యిపట్టుకొని) చెప్పటం మర్చిపోయాను ఇవాళ కాదనకండి. అసలీ ఏడు నా పుట్టిన రోజు పండగ గ్రాండ్‌గా ఏర్పాటు చేద్దామనుకున్నాను. కాని...

[బైట కారు హారను వినిపిస్తుంది.]

[నవ్వుతూ రామదాసు, శకుంతల, తండ్రి వస్తారు.]

తండ్రి : ఏవో అర్జెంటుకేసు లున్నాయ్. ఆలస్యంగా వస్తానని చెబితివి కదోయ్.

రావు : తొందరగా పూర్తిచేశా నాన్నా.

రామ : నమస్తే రావుగారూ. గుడీవినింగ్ పంకజం గారు.

రావు : నమస్తే.

రామ : ఇవాళ శకుంతలాదేవి అద్భుతంగా పాడారు.

తండ్రి : కోడలింత చక్కగా పాడుతుందని నేనెప్పుడూ అనుకోలేదురా రాఘవా. పెళ్ళిలో పాడించాముగాని మరి నేను పరధ్యానంగా విన్నానో ఏమో ఇంత బాగా లేదు.

రామ : మీకోడల్లా చక్కగా పాడేవాళ్ళు ఇంకా ఎందరో వున్నారు బాబూ. తిరగల్లోపడ్డ గింజల్లాగా వాళ్ళు సంసారాల్లో నలిగిపోయి బైటికి రావటంలేదు.

తండ్రి : దానికి కారణం ఏమంటారు?

రామ : కారణం పెద్దలు మీకు తెలియందికాదు— అసలు పదిమందిలోనూ పాడటం కానిపని అనీ, అప్రతిష్ఠ అనీ, ఆడది వేన్నీళ్ళకు చన్నీళ్ళుగా డబ్బు సంపాయించడం మగవాడికి అవమానం అనీ—ఇలాంటివే అనేకమైన మూఢ నమ్మకాలుంటాయి వాళ్ళకు.

తండ్రి : ఇప్పుడు యథార్థం తెలుసుకున్నాను. ప్రొద్దున్నవరకూ నాకీరేడియోలు అంటే అదో అభిప్రాయముండేది. ఇప్పుడుమాత్రం నాకు చాలా సంతోషంగావుంది. అందులో ఘంగానావారి కోడలు అంత చక్కగా పాడుతోంది అంటే అది మాకు మాత్రం గొప్ప కదండీ?

శకు : కబుర్లలోనే తెల్లవారేట్టుంది. వడ్డిస్తాను— పదండి. మామయ్యా కాళ్ళు కడుక్కోండి. మీరుకూడా ఈ పూట ఇక్కడే భోంచేయాలి దాసుగారూ.

రామ : అబ్బే ఎందుకండీ మీకా శ్రమ. నాక్యారేజి వచ్చేవుంటుంది.

తండ్రి : మీరలా అంటే నేనొప్పుకోను. పదండి సరదాగా కూర్చుందాము. ముందు కాళ్ళు కడుక్కొని వద్దాం రండి.

[ఇద్దరూ లోపలికి వెళ్తారు.]

శకు : (భర్తతో) మీరుకూడా లేవండి భోజనానికి.

రావు : నాకీ పూట ఆకల్లేదు. పైగా అర్జెంటుకేసొకటి చూసి రావాలి.

శకు : అదేమండి! ఇప్పుడేగా మామగారితో పని పూర్తయిందన్నారు?

రావు : అంటే అబద్ధమాడుతున్నాననంటావా?—చాలాదాక వచ్చింది. మాటలు నేర్పిన కుక్కను వేటకు పంపితే ఇస్కూ అంటే ఇస్కూ అందిట.

శకు : తప్పైనున్నాను. వడ్డిస్తాను భోజనము చేసి వెళ్ళండి.

రావు : నేను భోజనం చెయ్యనని చెప్పాను.

శకు : దాసుగార్ని కూడా వుంచమన్నాము. మీరు వెళ్ళిపోతే బాగుంటుందా?

రావు : నే లేకుండా ఆయనతో వస్తే బాగుండటంలా?

శకు : మీ రివాళ వింతగా మాట్లాడుతున్నారు.

రావు : నువ్వూ వింతగా ప్రవర్తిస్తున్నావ్.

శకు : ఇప్పటిదాకా కూర్చుని ఆస్పత్రికని వంక పెట్టుకొని భోజనం చెయ్యకుండా వస్తే వాళ్ళేమనుకొంటారు. నా మాట వినండి. మామగారు కూడా వున్నారు.

రావు : పంకజ నన్ను ఇవాళ డిన్నరుకి పిల్చింది. వస్తున్నాను.

శకు : ఓ! అందుకా ఇప్పటిదాకా కాపాలా వేసు కూర్చున్నారు.

పంకజ : కాపలా వేసేందుకు నేను మీ ఇంటి నౌకర్నేమీ కాను.

శకు : కాకపోతే ఇంతిరాత్రివరకూ ఇక్కడెందుకున్నారు? మీ కిక్కడేం పని?

పంకజ : నన్ను సంజాయిషీ అడగటానికి మీ రెవరు?

శకు : ఈ ఇల్లు నాది. మీ రీఇంట్లో వున్నంత సేపూ అడగటానికి నా కధికారం వుంది.

పంకజ : డాక్టర్! ఇంటికి పిల్చింది మీ రిలా నన్ను అవమానం చేయించటానికేనా?

రావు : నీ కసలు బుద్ధుందా? ఇంటికి వచ్చినవాళ్లను సంజాయిషీ అడుగుతావా?

శకు : నేను లేనప్పుడు రాత్రిపూట నా ఇంటికి వచ్చి నా భర్తతో కిలకిల్లాడుతూ కూర్చోటానికి ఆవిడకేం అధికారం వుందని అడిగాను. తప్పా?

పంకజ : మీగు రేడియో ప్రోగ్రామ్ అని వంక పెట్టుకొని ఆ దాసుగారివెంట తిరగటం, తప్పు పని కాదూ?

[దాసు, తండ్రి వస్తారు]

రా. దా : మిస్ పంకజ నోటికొచ్చినట్లు వాగటం పద్ధతి కాదు. ఇది ఆస్పత్రి కాదు.

పంకజ : షటప్. మీ రనవసరంగా కల్పించుకో నక్కర్లేదు. నే వస్తున్నా డాక్టర్. నలుగురూ చేరి వంటరిదాన్ని అవమానం చేస్తారా?

రావు : మిస్టర్ దాసూ! మీరు ముందు నా ఇంట్లోంచి బైటికి నడవండి.

తండ్రి : అదేమిట్రా! పెద్దమనిషిని......

రావు : నువ్వూరుకోవయ్యా—నీకు తెలీదు—నల్లనివన్నీ నీళ్ళు తెల్లనివన్నీ పాలు అనుకొంటావ్ మిస్టర్ దాసూ మీరు తక్షణం బైటికి వెళ్లండి.

శకు : (వ్యగ్రతతో) ఏమండీ విస్తరిముందు కూర్చోబోయే మనిషిని అట్లా అనకూడదు.

రా. దా : వెళ్లటానికి నా కేమీ అభ్యంతరము లేదు. కాని తర్వాత మీరే పశ్చాత్తాప పడతారు.

రావు : మీరిక నా ఇంటికి రానవసరములేదు, నా భార్యకు రేడియోప్రోగ్రాములు ఇవ్వనవసరమూ లేదు. మీ వంటి పయోముఖవిష కుంభాన్ని దగ్గఱకు చేరనియ్యటము నాదే తప్పు.

రా. దా : (ఖిన్నుడై) మీరు అపోహపడుతున్నారు డాక్టర్. నన్ను చాలా తప్పుగా అర్థం చేసుకొంటున్నారు.

రావు : లేదు. ఇప్పుడు సరిగ్గానే అర్థం చేసికొన్నాను. మొదట చేసికోలేదు కాబట్టే అనుభవిస్తున్నాను. "యు ఫస్ట్ గెట్ ఔట్ ఆఫ్ మై హౌస్"

[దాసు తలవంచుకొని వెళ్ళిపోతాడు]

శకు : (ఏడుస్తూ) ఏమండీ. మీ కాళ్ళు పట్టుకొంటాను. ఏవో అనుమానాలు పెట్టుకొని ఆయన్ను అవమానం చెయ్యటము మహాపాపం.

రావు : పాపం! ఛీ! వదులు-నన్ను ముట్టకోకు. చెప్పేవన్నీ శ్రీరంగనీతులే. నేను కూడా వెళ్తున్నాలే. నీకు పీడ వదులుతుంది. పద పంకజం

[వెళ్లిపోతారు]

శకు : మీ రిప్పుడు వెళ్లటానికి వీల్లేదు. మీరు వెళ్తే విషం పుచ్చుకుంటాను. (చెయ్యి పట్టుకుంటే చెంపమీద కొడ్తాడు)

రావు : నీ ఇష్టమొచ్చింది చేసుకో పో.

[శకుంతల ఏడుస్తూ లోపలికి పోతుంది]

తండ్రి : నువ్వు మనిషివా? పసువ్వా? ఆడదానిమీద చెయ్యి చేసుకొంటావురా దౌర్భాగ్యుడా!

రావు : నా ఇష్టం;

తండ్రి : నీ ఇష్టం. — ఎందుకు చదువుకొన్నావ్. అఘోరించవా! అదేం కాని పని చేసిందని నోటి కొచ్చి నట్లంటావ్?

రావు : ఏం చేసిందో నాకు తెలుసు. లోకానికి తెలుసు.

తండ్రి : తెలుసు. కళ్లకు చీకటిపొరలు కప్పుకుపోయాక నీకు తెలిసేదేముంది. ఇదిగో ఈ అమ్మవారు పూనిందిగా అన్నీ తెలుస్తాయి. [లోపలేదో పడ్డ చప్పుడవుతుంది. తండ్రి లోపలి కెళ్తాడు. చప్పున మళ్ళీ వచ్చి]

తండ్రి : (పెద్దగా) ఒరే రాఘవా. కోడలు సీసాలోది ఏదో మందు తాగి పడిపోయిందిరా. కళ్ళు తేలవేస్తోందిరా.

[తండ్రీ, కొడుకులు లోపలికి పరుగెత్తారు. రెండు నిమిషాలు కంగారు. ఇది చూసి పంకజం మెల్లిగా జారుకొంటుంది]

[రేడియోలో కలవరం. విచారాన్ని సూచిస్తూ వున్న మ్యూజిక్. తర్వాత ఆగిపోతుంది]

* * *

[లోపల్నుండి డాక్టరు, శకుంతల, దాసు బైటికి వస్తారు]

డాక్టరు : చాలా తమాషాగా వుంది నాటిక.

శకు : పాపం, ఆవిడ చచ్చిపోయిందా చివరకు.

దాసు : 'ఆసిడ్' త్రాగింది. బహుశా చచ్చిపోయే వుంటుంది.

శకు : నాకో సందేహం వచ్చింది. ఇందులో ఎవరు చాదస్తులు దాసుగారూ? చదువుకొన్న నాగరకుడైన ఆభర్తా?—చదువులేని మూఢాచారపరుడైన ఆ తండ్రా?

దాసు మీరు చెప్పండి డాక్టరుగారూ.

డాక్టరు నా ఉద్దేశం ఆ డాక్టరే చాదస్తుడు.

దాసు బాగా చెప్పారు.

శకు (నవ్వుతూ) ఈ డాక్టరుగారు కూడా అంతే దాసుగారూ.

డాక్టర్ (కోపంగా) ఏయ్...చిలిపీ!

దాసు (నవ్వుతూ) వస్తా డాక్టర్. రేపిప్పుడవ్వాళ శకుంతలాదేవిగారిని తీసుకొని రేడియో స్టేషనుకి ఒక్కసారి రండి. ఆడిషన్ చేయించి ప్రోగ్రామ్ ఇప్పిస్తాను.

డాక్టరు : నాకు తీరిక లేదు. మీరు తీసుకొని వెళ్లండి.

శకు : వద్దు దాసుగారూ ... చాదస్తులు వెంట వుంటేనే మంచిది.

[ముగ్గురూ నవ్వుతారు. తెర]

# వర్జ్యకాలము

శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు

విషనాడియనబడు నక్షత్రత్యాజ్యకాలమును (వర్జ్యకాలమును) గూర్చి కడచిన విజయసంవత్సరపు ఆషాఢ మాసపు భారతిలో నా ఊహలను చదువరులకు నివేదించియుంటిని. ఇప్పటి మన పంచాంగములలో ఈ విషనాడీ కాలము ఎంత అవ్యవస్థగా చూపబడుచున్నదో, వర్జ్యకాలమును పరిత్యజించి శుభ కార్యములను జరుపుకొనగోరువారికి దీనివలన ఎన్ని చిక్కులు ఏర్పడుచున్నవో, సోదాహరణముగా ఆ వ్యాసములో చూపితిని. విషనాడీకాలము ఇండియన్ స్టాండర్డ్ కాలములో (I. S. T.) నిష్కర్షగా ఏనాడు ఎప్పటినుండి ఎంతవరకు వ్యాప్తిలోనుండునో, సులభముగా, నిర్దుష్టంగా, నిస్సంశయముగా సాధించుటకు వీలగురీతి సాయన విషనాడీ పథకము సయితము అచట చేర్చబడినది. మరియు, చంద్ర విషనాడి మాత్రమేకాక, నాల్గు నిమిషములు వ్యాపించియుండగల సూక్ష్మమగు లగ్నవిషనాడి సయితము పరిత్యాజ్యమని సోపపత్తికముగా నిరూపించి, దానిని ఇండియన్ స్టాండర్డ్ కాలములో కనుగొనుటకు మార్గము సహా విన్నవించితిని.

కాని, విషనాడి (వర్జ్యకాలము) అంత దోషముగా పరిగణించవలయునా అని సందేహించువారు కొందరున్నారు. దాక్షిణాత్యులు ఈ త్యాజ్యకాలమును గమనించనే గమనించరు. అన్ని విషయములకు, పెండ్లికయినా, ప్రయాణమునకయినా, తప్పక వారు రాహుకాలమును మాత్రము చూచుట వాడుక. అందులో, ద్రావిడులలో పురుషులకంటె స్త్రీలకు సంప్రదాయముపైన అభిమానము హెచ్చు. రాహుకాలములో వారు సామాన్యముగా ఏ కార్యమూ చేయరు; ఇతరులను చేయనీయరుకూడా. రాహుకాలములో భర్తలకుకాని, పసిబాలురకుగాని, భోజనము సయితము పెట్టని స్త్రీలు కొందరు కలరట! అరవవారి సహవాసదోషమున ఆంధ్రులలో అనేకులకు ఇటీవల ఈ రాహుకాలపు అలవాటుతోపాటు వర్జ్యకాలమును గూర్చిన సంశయము వచ్చినది. వాస్తవమును విచారించినచో, విషనాడీకాలమును, ప్రయాణాదులయందును, శుభకార్యావసరములయందును, జాగరూకతతో పరిత్యజించుటే ఆంధ్రజాతికి అనూచానముగ వచ్చిన ఆచారము. కాని, ఇటీవల దాక్షిణాత్యుల సహవాసమువలన వీరు దానిపై నిరాదరము చూపుట అందందు చూపట్టుచున్నది. ఇది అవిచారరమణీయము.

ముహూర్తశాస్త్రములో శుభకార్యములకు వర్జించదగిన మహాదోషములలో ఒకటిగా విషనాడి పరిగణింపబడినది. కాని ఆదోషములపట్టికలో రాహుకాలమును ప్రాచీనులు చూపియుండలేదు. మాసరాహువు, దినరాహువు, యామార్ధరాహువు, క్షణిక రాహువు, మున్నగు పేర్లతో రాహుకాలము అనేక విధములు. దీని ప్రశంస ముహూర్త గ్రంథములలో యాత్రా ప్రకరణములో మాత్రమే చూపట్టుచున్నది.

"యాత్రాదౌ, ఫణీ, యోగినీ,
దినకరాః పృష్ఠస్థితా స్సిద్ధిదాః"

—విద్యా మాధవీయము

ప్రశంసలోనున్న రాహుకాలమును సాధించు సూత్రమిది:—

"సూర్యా, ర జీవ, జ్ఞ, భృగు
మం, దేందు దివసేష్వని।
ప్రాగాదిత స్సవ్యగామీ।
తిస్యాద్దక్షిణగోంతశః"

భానువారమున రవి, సోమవారమున శని, మంగళవారమున చంద్రుడు, బుధవారమున బుధుడు, గురువారమున కుజుడు, శుక్రవారమున గురువు, శనివారమున శుక్రుడు, పగలు ప్రథమ యామార్ధమునకు అధిపతిగా భావించి, ఆ అధిపతుల నుండి వారాధిక క్రమమున మిగిలిన యామార్ధములకు అధిపతులను

పంచగా శనికి ఏయామార్ధము వచ్చునో, దాని తరువాత యామార్ధము రాహుకాలమగు ననుట. దీనికి ఉపపత్తి ఏమీ తెలియ లేదు.

ఏవారమునకు ఆవారాధిపతినే మొదటి యామార్ధమునకు అధిపతిగా నిర్ణయించి, తరువాతి యామార్ధములకు వారాధిపత్య క్రమముగా ఆధిపత్యమును పంచినచో, శనికి ఏయామార్ధములో స్థానము వచ్చునో అది కాలము గుళిక స్థానమనియు, జాతక ముహూర్తాదులలో దుష్ఫలము దానినుండి వచ్చుననియు, చెప్పు సూత్రములున్నవి. ఇట్లే ఒక్కొక్కవారములో ఒక యామార్ధము 'యమకంటక'మని వేరొకయామార్ధము 'అర్ధప్రహర'మని, నిర్ణయించి ఇవి దుష్టకాలములుగా ముహూర్త శాస్త్రము తిరస్కరించినది.

ఇవి చాలక, వారత్యాజ్యమను మరియొక వర్జ్య కాలమును తెలుపు సూత్రము కలదు.

"నభోద్వయం, ద్వాదశ, దిక్ చ శైలా,
బాణాశ్చ, తత్త్వాని, యథాక్రమేణ,
సూర్యాది వారేషు పరం చతస్రో,
నాడ్యో విషం స్యాద్ఘటి వర్జనీయం"
(దైవజ్ఞ మనోహరము)

ఈకాలము లన్నియు రాహుకాలముకంటే భిన్నములైనవే. ఈ అయిదు విధములయిన కాలములు ఏ ఏ వారమున ఎప్పుడు వ్యాప్తిలో నుండునో, అను బంధము చూపగలము. దానిని చూచినచో మానవునకు మంచికాలమనునది లభించదేమో, అని భయమగు చున్నది. లోకహితైషులగు మన ప్రాచీన మహర్షులు దీనిని గమనించి, కొన్ని గ్రహయోగము లున్నచో ఈ వర్జ్యకాలములదోషము పరిహారమగునని అపవాద సూత్రములు వ్రాసి మనల నుద్ధరించినారు. ఈపద్ధతిలో రాహుకాలము చేర్చబడలేదు. యాత్రావిషయములో తప్ప, ఇతర శుభకార్యముల ముహూర్తములకు సంబంధించిన సామాన్య నియమములలో రాహుకాలము చెప్పబడలేదు. కనుకనే ఈ అపవాదములలో దీని ప్రశంస కానరాదని మనము ఊహించుట తప్పుకాదు.

ఎట్లయిననేమి ఆకాశరంగమున జరుగు విగ్రహ చారముతోనైనా సంబంధములేక, ఏసంవత్సరములో ఏనెలలోనైనాసరే, ఏకమూలికాప్రయోగ మను రీతిగా 'ఈవారమున కింత' అని నిర్ణయించబడినవే ఈకాలములన్నియు. నక్షత్ర విషనాడీకాలపు మార్గము వేరు. అది చంద్రుని చారమువలన ఏనాటికానాడు గణితముతో సాధించవలసియున్నది. ఒకనాడొక నక్షత్రములో విషనాడి ఏకాలమునకు వచ్చునో మరల ఆ నక్షత్రము వచ్చిన నాడు అదేకాలమునకు సాధారణముగా రానేరాదు. ఇదే దాని విశిష్టత అగుటచే, ఈ వారవర్జ్యకాలములకు ఎంత విలువ యుండినా, అది గణితాగతమగు నక్షత్రత్యాజ్యముతో తులతూగజాలదనుట నిర్వివాదాంశము. ఈ తారతమ్యమును మనస్సులో నుంచుకొన్నవారు కావుననే, ప్రాచీనులు విషనాడికి నాల్గుగడియలు వర్జ్యమనియు, వారత్యాజ్యమునకు రెండుగడియలు మాత్రము వదలినచో చాలుననియు శాసించిరి. రాహుకాలము సామాన్య ముహూర్త నియమములలో చేరినదేకాదు. ఇట్టి పరిస్థితులలో రాహుకాలముకంటే విషనాడీకాలమునకు హెచ్చు దోషము కలదనుట యుక్తి సహముగను. ద్రావిడుల సంప్రదాయ మెట్టిదైనా కానిండు. దాని నాశ్రయించి తమ ప్రాచీన సంప్రదాయపు వర్జ్యకాలమును ఆంధ్రులు మరచుట మాత్రము శ్రేయస్కరముకాదు.

విషనాడీకాలమునకు గొప్పదోషమును ప్రాచీనులు సూచించిరి.

"విషనాడ్యాం విపాద్భితిః
అపమృత్యు రథాపివా."
(జ్యోతిర్నిబంధము)

"వివాహవ్రతచూడాసు
గృహారంభ ప్రవేశయోః
యాత్రాది శుభకార్యేషు
విషదా, విషనాడికాః"
(జ్యోతిస్సారము)

"విషాఖ్యనాడీషు కృతం శుభంయత్,
వినాశ మాయాతి చిరేణసర్వం."
(వశిష్ఠసంహిత)

ఇంతేకాదు. విషనాడీభాగములో రవిచంద్రసంయోగము (అమావాస్య) వచ్చినపుడు, అట్టి పర్వభాగ జన్మకాల చంద్రస్థానమైనచో, అట్టి జాతకుడు అచిర కాలములోనే జీవయాత్ర చాలించుకొనగలడని వశిష్ఠ మహర్షి చాటిచెప్పినాడు. కనుక, రాహుకాలమును

గమనించినా, మానినా, విషనాడీ (వర్జ్య) కాలమును మాత్రము పాటించక శుభకార్యాదులు జరుపుట క్షేమకారి కాదని నా విన్నపము.

చంద్ర విషనాడిని, లగ్న విషనాడిని, నిరాదరించి క్లేశములపాలయిన ఈ క్రింది నిదర్శనములు చిత్తగింపుడు.

## చంద్ర విషనాడి

(1) మదరాసు నగరపు విమానాశ్రయములో 18-2-1952 నాడు 11-9 A. M. (I. S. T.) కాలమున గగన సంచార మారంభించిన విమాన మొక్కటి నాగపుర సమీపములో పడిపోయినని విన్నాముకదా? ఆ క్షణమున చంద్రుడు వృశ్చికరాశిలో 28°-51' లో నుండినాడు. అనూరాధానక్షత్రమందలి విషనాడి వృశ్చికరాశిలో 28°-48' నుండి 29° 36' వరకు వ్యాపించి యున్నది. కనుక ప్రయాణారంభకాలములో చంద్రుడు విషనాడిలో నుండినాడు. ఘోరమయిన నష్టము కల్గినది.

(2) ఢిల్లీనగరములో 21-11-1951 నాడు 7-48 A. M. (I. S. T.) లో ఒక విమానము పడిపోయినది. దానిలో ప్రాణములు కోలుపోయిన పదునాగ్గురిలో కొందరు ప్రముఖ వ్యక్తు లుండిరి. ఈ విమానము నాగపురములో ఆనాడే 3-31 A. M. (I.S.T.) లో బయలుదేరినదట. ఆ కాలములో చంద్రుడు సింహరాశిలో 17°-42' లో నుండెను. ఆశ్లేషానక్షత్రపు విషనాడి సింహరాశిలో 16°-57' మొదలు 17°-50' దాక కలదు. ప్రయాణారంభములో చంద్రునికి విషనాడి దోషము పట్టిన కారణమున ఘోరమయిన ప్రమాదము సంభవించెను.

(3) ఇన్‌డియన్ నేషనల్ ఎయిర్ వేస్ వారి డకోటా విమాన మొకటి ఢిల్లీలో 17-7-1950 నాడు 9-3 P. M. (I. S. T.) వేళలో ఆకాశ సంచార మారంభించి కొంతకాలములోపల నే పఠాన్ కోటవద్ద కూలిపోయినది. దానిలో నుండిన ఇరువదుగురిలో ఒకడైనా బ్రతుకలేదు. ప్రయాణారంభ కాలములో చంద్రుడు ఆశ్లేషానక్షత్రపు విషనాడిలో సింహరాశి 17°-21'లో నుండెను.

(4) మదరాసు విమానాశ్రయములో 6-5-1951 నాడు 2.20 AM (IST) లో ప్రయాణమారంభించిన సెంటినెలు విమాన మొకటి కొన్ని నిమిషములలో ఒక నీరులేని చెరువులో కూలి నాశనమైనది. అందుండిన విమానచోదకుడు, అతని అనుచరుడు సహా, ప్రాణములు కోలుపోయిరి. భరణీనక్షత్రపువిషనాడి వృషభరాశిలో 11°-50' మొదలు 12°-44' వరకు నుండినది. ప్రయాణకాలచంద్రుడు ఆ రాశిలో 12°-18' లో నుండినాడు కనుక విషనాడీ దోషము పట్టినది.

(5) భారతదేశమందలి ప్రాతకాలపు మహారాజపుత్రులలో నొకరి వివాహము మహావైభవముతో జరిగినది. కన్యారాశిలో 23°-21' లో చంద్రుడుండగ ఈ వివాహ క్రియాకలాపము ఆరంభమైనది. ఉత్తరాఫల్గునీనక్షత్రపు విషనాడి ఆరాశిలో 22°-31' నుండి 23°-24' వరకు వ్యాపించియుండిన దగుటచే, వివాహము విషనాడిలో జరిగినది. ఆ మహారాజపుత్రుని వైవాహిక జీవితము ఒక విషాదాంత కథ.

(6) 9-9-1952 నాడు సాయంకాలము 6 గంటల ప్రాంతములో విజయవాడదగ్గర భయంకరమైన కృష్ణానదీ మహాప్రవాహములో ఆనకట్టను రక్షించుటకయి బోట్లలోపోయి ప్రమాదముపాలై మునిగిపోయి కీర్తిశేషులయిన నలుగురు ప్రఖ్యాతులయిన (ఆంధ్ర) ఇంజనీయర్ల విషాదగాథను చదువరులు మరచియుండరు. ఆనాడు సాయంకాలమున వారు జలయానము నారంభించినపుడు వృషభరాశిలో 27°-26' చంద్రుడుండెను. ఇది కృత్తికా నక్షత్రపు విషనాడి ప్రదేశమని చదువరులు గుర్తింపగలరు.

(7) 1953 మార్చినెల 7 వ తేదీన ఒక ధనికుని ఇంట వివాహ మొకటి జరిగినది. ముహూర్తము 1-30 PM (IST) గంటలకని పురోహితులు చెప్పియుండిరట. కాని, అరణ ద్రవ్యము సంపూర్తిగాముట్టని కారణమున నిర్ణీత కాలములో కన్యాదానము జరుగలేదు. పంచాయతీలు జరిగి ఆ సమస్య పరిష్కారమగునప్పటికి పుణ్యకాలము దాటిపోయినది. అప్పటికి చంద్రుడు వృశ్చికరాశిలో 29°-37'కు వచ్చియుండెను. అనూరాధా నక్షత్రపు విషనాడి వృశ్చికరాశిలో 28°-24' మొదలు 29°-36' వరకు ఉండినది. కనుక, ఆ విషనాడీకాలమందే కన్యాదానము. కాని, వెంటనే భార్యాభర్తలకు పొసగలేదు. కథ కోర్టులకు ఎక్కినది. కడకు కోరికి వివాహము కానేలేదనెడి తీర్మానముతో ముక్తాయము.

(8) పంచాంగముల అశకతవకలవలన విషనాడిలో చంద్రుడుండగా లగ్నము నేర్పరచుటచే, 25-8-1952 నాడు విషనాడీ దోషములోనే ఒక వివాహము జరిగినదని కడచిన వ్యాసములో విన్నవించియుంటుట చదువరులు మరచి యుండరు. రత్నమువంటి ఆ వధువు మూడేండ్లలోగానే మృత్యువు పాలయినదను శోచనీయ వార్త వినుచున్నాము.

"కుర్యా దుద్వాహితాంకన్యాం
విధవాం వత్సరత్రయాత్,"

అను వశిష్ఠ సంహితా వాక్యము ఈ వివాహమున కన్వయించినదనవచ్చును కదా! కన్య విధవ కాలేదు. వరుడు విధురుడైనాడు. అంతే భేదము.

ఈ ఉదాహరణములు చాలుననుకొందును. ఫలము ప్రత్యక్షముగా చూపట్టు చున్నది కదా? ఇక సూక్ష్మముగ లగ్నవిషనాడికి సంబంధించిన కొన్ని ఉదాహరణములను పరిశీలింతము గాక.

## లగ్న విషనాడి

(1) ఒకానొక ప్రఖ్యాత సినీమా నటుడు తన కంపెనీవారు సృష్టిచేయుచున్న ఏదో సినీమా కథకు సంబంధించినరంగములో ఛాయాచిత్రగ్రహణముకొరకు నటించుటకై 25-4-1951 నాడు 8-35Am.(I.S.T.) లో ఉత్తమాశ్వమునొకదాని నెక్కి స్వారీ చేయ నారంభించెనట! అప్పటికి లగ్నము మిథునరాశిలో 12°-0' వ భాగములో నుండెను. రోహిణీ నక్షత్రపు విషనాడి ఆరాశిలో 12°-0' 12°-54' వరకు కలదని చదువరు లెరుంగుదురు. ఆకాలములోనే అశ్వారోహణము జరుగుట. విషముకాలములో అశ్వారోహణము చేయరాదని పెద్దలనిరి.

"సాహస, మకాలచర్యాం,
మృగయాం, హయవాహనం, త్యజే ద్భూపః"

కారణమేమో కాని, అకస్మికముగా ఆయశ్వము రౌతు ఆజ్ఞను ధిక్కరించి, మోడిచేసి, స్వైరవిహార మారంభించి, కొన్ని క్షణములలోనే, అతనిని దబ్బున క్రిందపడద్రోసి పోయినది. ప్రబలములగు గాయములతో వైద్యశాల చేర్చబడి త్వరలోనే అతడు కాలధర్మము నందెనట!

(2) మిథునరాశిలో 20 వ భాగ ఉదయించుచుండగా, ఒకానొక విద్యావతియగు కన్యకు 20-4-1942 నాడు 9-20 Am. (I. S. T.) లో వివాహ మహోత్సవము జరిగినది. మృగశీర్షా నక్షత్రపు విషనాడి(19°-26' నుండి 20°-22' వరకు)లగ్నములో నుండగా ఆ వివాహము ముడిబడుట. వివాహానంతరము అచిరకాలమందె అతి స్వల్పకారణముతో భార్యాభర్తలకు మనోవైషమ్యములు ఏర్పడి, ఆ త్రికాడగు భర్త వేరొక యువతిని వెంటనే పెండ్లియాడి, "నీగతి నీవు చూచుకొ"మ్మని ప్రథమభార్యను పరిత్యాగము చేసినాడు. "దేశో విశాలః" అని యున్నదికదా?

(3) మదరాసునగరపు విమానాశ్రయమునుండి 13-4-1952 నాడు 8-0 Am. (I. S. T.) లో ఆకాశయానము నారంభించిన డెక్కన్ ఎయిర్ వేస్ కంపెనీవారి విమాన మొక్కటి ఢిల్లీనగర ప్రాంతమున ఆనాడే 7-46 Pm. (I. S. T.) లో కూలిపోయినది. ఆ విమానమునందుండిన ఎనమండుగురు ఈ ప్రమాదమునకు ఆహుతి అయిరి. ఆ విమానము పైకిఎగిరిన క్షణములో మిథునరాశిలో 12°-40' పూర్వదిక్కున లగ్నములో ఉదయమగుచుండినది. రోహిణీనక్షత్రపు విషనాడి, మిథునరాశిలో 12°-3' నుండి 12°-56' వరకు ఉండుటచే, విషనాడీ కాలములోనే ప్రయాణారంభము. ఫలము తోడనే చూపట్టినది.

(4) విద్యావతియగు తరుణి యొకతె ఉత్తమ విద్యావంతుడు, అనురూపుడు నగు వరుని వరించి 16-5-1951 నాడు చేపట్టినది. ఆనాడు 11-50 Am (I S T)లో ఈ శుభకార్యము జరుగుట. ఆవేళలో సింహరాశిలో 17°వ భాగ లగ్నములో నుండినది. దుష్టమగు ఆశ్లేషానక్షత్రమందలి విషనాడీ ప్రదేశము సింహరాశిలో 16°-56' నుండి 17°-50' వరకు వ్యాప్తిలో నుండినది. అగుటచే, విషకాలములో వివాహము జరుగుట. కొన్నిదినములు కాపురము చేసీచేయక పూర్వమే, ఆ వధూవరులు పరస్పర ప్రవర్తనములను సందేహించి, ఒకరినొకరు విశ్వసించక విడిపోయినారు. అంతటితో వారి వివాహమునకు స్వస్తి. వారి జీవితము అడవిని కాచిన వెన్నెల అయినది.

(5) 1944 డిశెంబరునెల 28 వ తేదీనాడు 7-25 PM (IST) లో "అష్టావక్రుడు" వనదగిన ఒక శిశువు జనించినాడు. ప్రతి అంగమూ వికృతమే; మాటలురావు; నడవలేదు. ఇతడు పుట్టినపుడు సింహరాశి 0°-58'లో లగ్నముగా నుండినది. పుష్యమీనక్షు

త్రపు విషనాడి (0°-58' నుండి 1°-47' వరకు) లో చేరిన ప్రదేశమది.

ఈ శిశు జననమునకు ఆధానకాలమును గుణించినచో, ఆధానకాలములో చంద్రుడు ఆ విషనాడీ భాగములోనే యుండెనని ఏర్పడగలదు. ఆ శిశువు యొక్క సర్వాంగములు విషపూరితములై వక్రత్వము నొందిన వేమో?

(6) బంగారు బొమ్మవంటి ఒకానొక ముగ్ధ విద్యావంతుడై అభివృద్ధికి రాదగియున్న యువకు నొకని వివాహమైనది. 1951 ఫిబ్రవరి 14 వ తేదీనాడు రాత్రి 1-0Am(IST)లో ఈశుభముహూర్తముజరిగెను. అనూరాధా నక్షత్రపు విషనాడీ ప్రదేశము (వృశ్చికరాశిలో 28°-43' నుండి 29°-37')నకు చెందిన 29° వ భాగ లగ్నములో నుండగా పడిన ముడి ఇది. వివాహమైన కొలది దినములకే, నిష్కారణముగా, వంచకుల మోసమునకు లోనై, మూర్ఖుడగు భర్త అమాయకురాలగు ఆ చిన్న దాని శీలమును శంకించి, పూర్వాపరములను విచారించక, ఆమెను పరిత్యజించెను. ఆశ లడుగంటి, ఆముగ్ధ ఆత్మహత్య చేసుకొనుటకై ప్రయత్నించగా, సమయమునకు ఎవరో కనుగొని కాపాడినారు. నిరంతర దుఃఖముతో ఆ చిన్నది దినములుచుండుటే ఫలము. ముందు మాట దైవమెరుగును.

(7) లక్షాధీశ్వరుడైన వ్యాపారియొకడు తన కర్మాగారము నిర్మించబడుచుండిన స్థలము 'తనిఖీ' చేయు నిమిత్తమై మోటారుకారులో 3-8-1948 నాడు ఉదయమున సింహరాశి 30° వ భాగ లగ్నముగుచుండగా ప్రయాణ మారంభించినాడు. మఖా నక్షత్రపు విషనాడికి (సింహరాశి 29°-47'నుండి కన్యలో 0°-40' వరకు) సంబంధించినది ఆ లగ్నభాగ. మూడుగంటల కాలములోనే శత్రువు లతనిని పట్టి చిత్రవధ చేసిరి.

(8) విదుషీమణియగు నొకానొక సుందరి ఉన్నత విద్యావంతుడగు వరుని పెండ్లియాడినది. 19-2-1944 నాడు 8-25 A. M. (I.S.T.) లో ఈ వివాహమంగళము జరిగెను. లగ్నము నిరయన పుష్కరాంశలో నిర్ధరించినారు మౌహూర్తికులు. కాని, ఉత్తరాభాద్రానక్షత్రపు విషనాడి మేషరాశిలో 1°-42' మొదలుకొని 2°-35' వరకు ఉండగా, దానిలోనే మేషము 2° వ భాగలో, లగ్నము. ఫలితమేమనగా, కొంతకాలము తరువాత, ఆ గృహిణి తన ఇల్లువాకిలి వదలి చల్లగా ఒకనాటిరాత్రి పొరుగిల్లు చేరుకొని ఆ యింటి యజమానుని ఆశ్రయభాగ్యమును సంపాదించుకొని, కంచంత కాపురమునకు నువ్వులు నీరు విడిచినది. అగతికుడై బ్రతిమాలుకొన్న అభాగ్యపు భర్తకు తిరస్కారము తప్ప వేరు ఫలము లభించలేదు. విషనాడి వాసన ఇట్లు పరిణమించెను.

(9) కీర్తిశేషుడగు సర్దార్ పటేల్ మహాశయుడు జయపూర్‌లో జరుగనున్న ఏదో రాజకీయ సమారంభమునకై ఢిల్లీ నుండి ప్రత్యేక విమానములో 29-3-1949 నాడు 5-30 P.M. (IST)లో బయలుదేరెననియు, వెంటనే విమానమందలి యంత్రసామగ్రి ఏదో చెడిన కారణమున ప్రమాదమును తప్పించుటకొరకు అతికష్టముతో విమానచోదకు డావిమానమును విషమప్రదేశములో దింపవలసివచ్చెననియు, పత్రికలద్వారా వింటిమి. భగవత్కృపచే సర్దారు అప్పటికి ప్రమాదమును తప్పించుకోగలుగుట, ముఖ్యముగా, హైదరాబాదు హిందువుల అదృష్టము. విమానము ప్రయాణ మారంభించినపుడు కన్యలో 24° వ భాగ లగ్నములో నుండెనని చదువరులు కనుగొనగలరు. ఉత్తరాభాద్రానక్షత్రపు విషనాడీ ప్రదేశమది. (23°-47' మొదలు 24°-40' వరకు).

(10) సింహరాశిలోని 17° వ భాగ లగ్నములో ఉదయమగుచుండగా, 1-6-1913 నాడు 10-27 A.M. (IST) లో ఒకానొక గొప్పఇంట వారి కన్యావరులకు అతివైభవముగా పరిణయమహోత్సవము నడిచినది. సింహరాశిలో 16°-27' మొదలుకొని 17°-20' వరకు దుష్టమగు ఆశ్లేషానక్షత్రపు విషనాడి యుండెనని మౌహూర్తిక మహాశయులు గమనించలేరు. దైవ దుర్విపాకము కారణముగా వివాహకాలమందలి లగ్నము ఆ విషనాడికే చిక్కినది. ఆ కన్యకకు కన్యాత్వమయినా తీరకమునుపే ఆ బాలవరుడు కీర్తిశేషుడైనాడు.

(11) ఇటీవల, 26-1-1957 నాడు, యమళశిశు జననమొకటి కలిగినది. ఆనాడు 10-45 AM (IST) ప్రాంతమున ఒక పురుష శిశువును ప్రసవించిన కుటుంబిని 1-5 P.M. (IST) లో మరల ఒక స్త్రీ శిశువును కనినది. రేవతీ నక్షత్రపు విషనాడికి చెందిన మేషరాశి

లోని 17° వ భాగలో పుట్టిన పురుష శిశువు కొన్ని దినములలో బాలారిష్టముల పాలయినాడు.

(12) ఎయిర్ ఇండియావారి డకోటా విమాన మొకటి 'పాలం' విమానాశ్రయము నుండి 8-5 1953 నాడు రాత్రి 1-13 A.M. (IST) లో ఆకాశ యానము నారంభించినది. అప్పుడు కుంభరాశిలోని 19° వ భాగ లగ్నములో ఉదయించుచుండెను. ఈ భాగ ధనిష్ఠానక్షత్రపు విషనాడీ ప్రదేశమునకు (18°-44') నుండి 19°-37' వరకు) చెందినది. కొన్ని నిమిషములలోనే, (1-25 A.M. లో) ఆ విమానము నేలకూలి నశించినదని విన్నాము. ఆయిదుగురు విమాన చోదకులలో కూడ ఆవిమానమందున్న దురదృష్టశాలులందరు పరలోక ప్రయాణము సాగించారట!

(13) కుంభరాశిలో 6° వ భాగ లగ్నముండగా, 27-2-1950 నాడు 4 50 A M. (IST) ఒక లావణ్యరాశియగు తరుణికి వివాహము జరిగినది. నిరయన మకర రాశిలో పుష్కరాంశలో ముహూర్తమట. ఆ న్యోన్యానురూపులకు ఆ వధూవరులకు స్వయంవరరూపమయిన పరిణయమది. కాని, శ్రవణ నక్షత్రపు విషనాడి కుంభములో 5°-20' నుండి 6°-13' దాకా వ్యాపించియుండుటచే ఈ లగ్నభాగకు విషదోషము పట్టినది. వివాహము అయిన కొన్నినాళ్లకే భర్త ఉత్సాహము చల్లబడి పోయినది. సాధుశీలయగు ఆ వధువు నతడు నిరాదరించి వదిలిపెట్టి, మార్గాంతరములలో తన సౌఖ్యమును తాను చూచుకొనుచున్నాడు. ఆ తరుణి తన జీవనోపాయమును వెదుకుకొనుటకై ఇప్పుడు పాటుపడుచున్నది.

(14) ముక్కుపచ్చలారని ఒకానొక బాలికకు 14-6-1947 లో 8-0 AM (IST) కాలమందు వివాహము జరిగెను. విద్యావంతుడైన ధీయుని బోలి యుండిన, ఆ చిన్నదాని భర్త మూడునెలల్లో అకస్మాత్తుగ సన్నిపాతజ్వరముతో మృత్యువువాత బడెను. ఆ బాలిక శోచనీయస్థితి వర్ణింపనలవికానిది. వివాహకాలములో లగ్నము కర్కాటక రాశిలోని 20½° భాగలో నుండినది. నిరయన మిథునరాశిలో వర్గోత్తమాంశ అని ఈ లగ్నము ఏర్పరచబడినది. కాని, పునర్వసూ నక్షత్రపు విషనాడి కటక రాశిలో 19°-45' మొదలు 20°-50' వరకు ఉండుననుట మాహూర్తికుల గమనమునకు రాలేదు. వారికేమి కాని, ఆ విషనాడీ ఫలమును ఆబాలిక అనుభవించినది.

(15) సాధుశీలుడగు ఒక విద్యావంతునికి ఒకానొక ఉన్నతోద్యోగి తనకూతురు నిచ్చి 21-8-1942లో వైభవముతో వివాహము చేసినాడు. 8-0 AM (IST) ప్రాంతములో మేషరాశి 2½° భాగ లగ్నంలో నుండగా కన్యాదానము కట్నములతో, కానుకలతో, చేయ బడినది. ఉత్తరాభాద్రా నక్షత్రములోని విషనాడిలోనే ఈలగ్నముండెనని పాఠకమహాశయులు గుర్తించియుందురు. కాపురమునకు వచ్చిన శాస్త్రము చేసి, ఆ పెండ్లికూతురు ఉన్నతవిద్య శోధింతునని చెప్పి, అమాయకుడగు భర్తను ఎట్లో సమ్మతిపరచి పుట్టిన ఇల్లు చేరుకొని వ్యాసంగధోరణిలో పడినది. కాని, నాలుగైదు సంవత్సరములు కళాశాలలో చదివి పట్టభద్రురాలైనతరువాత, ఆమెకు ఈ ప్రాతభర్త రుచించలేదు. అతనితో కాపురము సాగించుట కామె నిరాకరించి అచటనే నిలిచినది. కొన్ని ఏండ్లు కొండంత ఆశతో, "నను రక్షింపదలంచునో, తలపదో, నాభాగ్యమెట్లున్నదో?" అని, కాచికాచి, హతాశుడై భర్త వేరే వివాహము చేసుకొన్నాడు.

ఇంతచాలును. మాహూర్తికులు నిరాదరించిన లగ్నవిషనాడీకాలము మహాదుష్టమయినదేయని పై దృష్టాంతములు చూపుచున్నవనుట పాఠకమహాశయులు గుర్తించగలరు.

విషనాడీ పట్టికమును * గమనించినచో, ప్రతి రాశిలో రెండో, మూడో ప్రత్యేకభాగలు విషనాడికి సంబంధించినవని తేటపడగలదు. ఆభాగలలో లగ్నముండగా శుభకార్యములు జరుపుట అమంగళకరమని కనుగొంటిమి. ఇట్లుండగా, ఉదయము 10 గంటలనుండి 12 గంటలలోగా మిథునలగ్నమును పద్ధతిలో, ఏనక్షత్ర సూచకునితోనో, ముహూర్తము నిర్ధరించుకొనుటయు, ఆ రెండుగంటలకాలములో ఏక్షణమైనా శుభమైనదేనని భావించి తీరినపుడు శుభకార్యములు జరుపుటయు, ఎంత ప్రమాదహేతువులో వేరుగా విన్నవించుట

---

* విజయ—ఆషాఢ—భారతిలో 76 వ పుట చూడుడు.

# వర్జ్యకాలము

అనవసరము. మన అశ్రద్ధవలనకాని, అజాగరూకతవలన కాని, ఆంశిలో విషనాడీభాగ నిద్రైనా శుభకార్యము జరుపుకాలములో లగ్నములోనికి రావచ్చునుకదా? ఏకర్మను నెరుగని వధూవరులపట్ల ఇది ఘోరమయిన అన్యాయము.

లగ్నమనగా, ఒకక్షణకాలమే. జ్యోతిష్యాల ముగా చెప్పినచో, భచక్రములో ఒకభాగ లగ్నమందుండేకల రమారమి నాల్గునిమిషముల కాలమని భావించవచ్చునేమో? అంతేకాని, గంట, రెండుగంటల కాలమును లగ్నమనుట అసంగతము, అశాస్త్రీయము, అనర్థకరము. శుభముహూర్తము నిర్ణయించుకొను మహత్తర బాధ్యత పెండ్లిపెద్దలది. వారీవిషయము గమనించి, ముమూక్షుగా తగిన మాహూర్తికుల నాశ్రయించి, నిర్దుష్టమగు శుభలగ్నమును వారు నిర్ణయించి ఇచ్చునట్లుగా, శ్రద్ధవహించ వలసియున్నది. వేలకొలది ద్రవ్యమును వివాహాదులలో దంభమునకో, వైభవమునకో వ్యయపరచువారు శుభ ముహూర్త నిర్ణయమునకొరకు స్వల్ప వ్యయప్రయాస లకు ప్రాలుమాలుటలో అర్థములేదు. "కాసుకు లోగి కంబురీగలతో కుట్టించుకొన్నట్లు" అను సామెత అన్వయించును.

ఒక్కమాట. అరవవారి సంప్రదాయమునుకాని, రాహుకాలముపై శ్రద్ధనుకాని, హేళనము చేయుటకై నేనిది వ్రాయలేదని మనవి. రాహుకాలముకంటె ఎన్నిమోరెట్లు ప్రబలమై, మహాదోషముగా మహర్షులచే పరిగణింపబడిన విషనాడీవర్జ్యకాలమును విరదరించుట శ్రేయస్కరము కాదని ఆంధ్ర మహాజనులకు విన్నవించుటకొరకే నా యీ ప్రయత్నము. సహృదయులు మన్నింతురని ఆశ.

ఇన్ని గణితపు చిక్కులుగల వర్జ్యకాలముకంటే సర్వసులభముగా ఆబాలగోపాలము జ్ఞప్తిలోనుంచుకొనుటకు వీలుగానున్న రాహుకాలము చూచుకొనుట ఉత్తమము కదా? అనువారుందురేమో? ఇది అవిచారకృతమగు అభిప్రాయము. ఏ నెలలో నయినా, ఏ దేశములో నుండినా, రాహుకాలపు గంటలు ఒకేరీతిగా నుండుననుట గొప్ప పొరబాటు. బొంబాయిలో నుండినా, బుద్ధగయలో నుండినా, భానువారమునాడు 4-30 PM నుండి 6-0 PM (IST) వరకు రాహుకాలముగా భావించుట దాక్షిణాత్యులకు అలవాటు. ఇంతకంటే అభాసము వేరొకటియుండదు. ఏ గ్రామములోనున్నవారు ఆ గ్రామమునకు సూర్యోదయ సూర్యాస్తమయములను సాధించుకొని, అహః ప్రమాణమును 8 యామార్థములుగా విభజించి, తదనుగుణముగా రాహుకాలమును గణించవలసి యుండును. సామాన్యముగా, ఈపని చేయువారు లేరు. కనుక, వాస్తవముగా ఉన్నప్పుడు లేదని, లేనప్పుడు ఉన్నదని భావించి, రాహుకాలములో పనులు జరుపుటయో, రాహుకాలము లేనప్పుడు పనులు మానుటయో సంభవించుచున్నది. ఇది అనర్థకరమైన అవ్యవస్థ.

ఈ క్రింది ఉదాహరణము చూడుడు: 29 12-1957 వ తేదీకి బొంబాయిలో, బుద్ధగయలో, రాహుకాలము ఎట్లుండునో, వాడుక పద్ధతి రాహుకాలముతో పోల్చి వ్యత్యాసమును గమనింతము: ఆనాడు భానువారము

| | బొంబాయి. | బుద్ధగయ. |
|---|---|---|
| అక్షాంశ | 18-54 ఉ. | 25-24 ఉ. |
| రేఖాంశకాలము | 4-51-12 | 5-40-0 |
| | పూర్వము | పూర్వము |
| స్థానిక సూర్యోదయకాలము | 6-32 Am | 6-46 Am |
| ,, అస్తమయ ,, | 5-32 Pm | 5-17 Pm |
| అహఃప్రమాణము | 11-0 | 10-31 |
| యామార్థము | 1-22½ | 1-11 |
| 7 యామార్థములు | 9-37½ | 9-13 |
| రాహుకాలారంభము (L. m. T) | 4-9½ Pm | 3-59 Pm |
| రేఖాంశపోగా | 4-51 | 5-40 |
| గ్రీనిచ్ మధ్యమకాలము | 11-18½ Am | 10-19 Am |
| స్టాండర్డు | 5-30 | 5-30 |
| రాహుకాలారంభము (I. S. T.) | 4-48½ Pm | 3-49 Pm |
| యామార్థము | 1-22½ | 1-19 |
| రాహుకాలాంతము (I. S. T.) | 6-11 Pm | 5-8 Pm |

ఇంతకంటే సులభముగా విషనాడీ కాలమును సాధించవచ్చునుగదా?

"గతానుగతికోలోకః"

# అనుబంధము

## వారములలో దుష్టకాలములు

[ఇవి పగటికాలములు]

| వారము | | 'రాహు' కాలము | వార 'త్యాజ్య' కాలము | 'గుళిక' కాలము | 'యమ కంటక' కాలము | 'అర్ధ ప్రహార' కాలము |
|---|---|---|---|---|---|---|
| | | గం. ని. | గం. ని. | గం. ని. | గం. ని. | గం. ని. |
| భాను | మొదలు | 4-30 | 2- 0 | 3- 0 | 12- 0 | 10-30 |
| | వరకు | 6- 0 | 3-36 | 4-30 | 1-30 | 12- 0 |
| సోమ | మొదలు | 7-30 | 6-48 | 1-30 | 10-30 | 3- 0 |
| | వరకు | 9- 0 | 8-24 | 3- 0 | 12- 0 | 9-30 |
| మంగళ | మొదలు | 3- 0 | 10-48 | 12- 0 | 9- 0 | 7-30 |
| | వరకు | 4-30 | 12-24 | 1-30 | 10-30 | 9- 0 |
| బుధ | మొదలు | 12- 0 | 10- 0 | 10-30 | 7-30 | 12- 0 |
| | వరకు | 1-30 | 11-36 | 12- 0 | 9- 0 | 1-30 |
| గురు | మొదలు | 1-30 | 8-40 | 9- 0 | 6- 0 | 4-30 |
| | వరకు | 3- 0 | 10-24 | 10-30 | 7-30 | 6- 0 |
| శుక్ర | మొదలు | 10-30 | 8- 0 | 7-30 | 3- 0 | 9- 0 |
| | వరకు | 12- 0 | 9-36 | 9- 0 | 4-30 | 10-30 |
| శని | మొదలు | 9- 0 | 12- 0 | 6- 0 | 1-30 | 1-30 |
| | వరకు | 10-30 | 1-36 | 7-30 | 3- 0 | 3- 0 |

సూచన:—(1) 'అర్ధప్రహారము'లో మొదటి 48 నిమిషములు, 'యమ కంటకము'లో నడుమ 48 నిమిషములు, 'గుళిక' కాలములో అంతమందు 48 నిమిషములు, మాత్రము వర్జ్యము.

(2) ఉదయము 6 గంటలకు సూర్యోదయము, సాయంకాలము 6 గంటలకు అస్తమానము, జరుగు నాటి వ్యవస్థ ఇది. ఇతర దినములకు సూర్యోదయకాలమును, అహస్సును, గమనించి త్రైరాశిక ముతో కాలములను సవరించుకోవలయును.

# అడిగిరాని వరాలు

**శ్రీ మధురాంతకం రాజారాం**

సత్రం అరుగుమీద పడుకున్న రమణయ్య వులిక్కిపడి లేచి కూచుంటూ "అరరే, బాగా తెల్లవారిపోయి నట్టుందే" అనుకున్నాడు. పల్లెటూళ్ళలోనైతే అప్పటికి బాగా భల్లుమని తెల్లవారినట్టే లెక్క. పట్టణాల్లో దారి వేరు. ఇక్కడ వేకువ జామున నిద్రాదేవత చిద్విలాసం మరొక మోతాదు మితిమీరుతుందేమో నని పిస్తుంది. నౌకరీ చేస్తూ ముప్ఫైయేళ్ళుగా రమణయ్య స్థిరపడిపోయిన రామాపురం స్వరూపంలోగూడా ఇప్పుడిప్పుడు సినిమా థియేటర్లు, రైసుమిల్లు, వేళకు సరిగ్గా 'భోజనం రెడీ' అంటూ బోర్డు తగిలించుకునే, హోటళ్ళులాంటి, పట్టణం తాలూకు హంగులు, వేరూను కొనిపోయిన మాట నిజమే! కానీ అక్కడ యింకా ప్రాతస్సమయం కోడి కూతకూ, పక్షుల కలరవాలకు, పైరు పచ్చలపైనుంచి చల్లగా మెల్లగా సాగివచ్చే కమ్మ తెమ్మెరకూ నోచుకుంటూనే వుంది. కోడి కూతకుబదులు రెండునిమిషాలపాటు చెవుల్లో చేరి గీపెట్టిన సైరను మోతతో రమణయ్య కలత నిద్ర, నిద్రలో కంటున్న కల, కలలో కలవరాలు అన్నీ ఒక్కసారిగా చెదిరిపోయాయి. అతను అరుగుపైన లేచి కూచునే సరికి ఎదురింటి గుమ్మంముందు రోడ్డులో సైకిలు నిలబెట్టి కుర్రాడొకడు 'పాల్ పాల్' అంటూ బెల్ మోగించేస్తున్నాడు. భుజాన పేడబుట్టతో ఆడమనిషి ఒకావిడ ప్రక్కయింటి గుమ్మంముందు "అమ్మో, అమ్మోయ్, తలుపు తలుపు" అంటూ కవాటాన్ని దబదబ బాదేస్తున్నది.

'నా జీవిత మంతా ఏమిటి? సత్యంతో నేను చేసిన సాధన లేగదా' అంటాడు మహాత్ముడు. రమణయ్య బ్రతుకంతా ఏమిటి? అది నమ్మకాల నే మిట్టపల్లాల బాటలో క్రిందికి దొర్లి, పైకి ప్రాకుతూ నత్తిగుల్లలా గమనం సాగిస్తున్న రెండెద్దులబండి. ఆ నమ్మకాల్లో ముప్పాతిక మువ్వీసం మూఢనమ్మకాలే కావచ్చు. కాని ఆశ నిరాశల పడుగు పేకే మానవ జీవితమని నిర్వచించుకుంటే, రమణయ్యకు ఆశల్ని, నిరాశల్ని సరఫరా చేసినవి ఈ మూఢనమ్మకాలే! రమణయ్య సామాన్య మానవుడు. అతడి ఆశలూ, నిరాశలూ, గొప్పగా అంచనా వేయదగ్గవి కావు. ఉదయం లేవగానే భార్య ముఖం కనిపిస్తుంది. అది రమణయ్యకు ఆనందహేతువు. ఆరోజు తన తలపైన సిరి నృత్యం చేస్తుందని అతడి నమ్మకం. లేదా చెవులకు అమృతసేచనంలా ఓ శుభ వార్త ఏపైపునుంచయినా రావచ్చు. కానీ రమణయ్యకు ఒళ్ళు విరుచుకుని నిద్రలేచి నప్పుడల్లా భార్యముఖమే కన్పిస్తుందని గ్యారంటీ ఏముంది? పొయిలోనుంచి లేచి తోకాడించుకుంటూ నడవలోకి పారిపోతున్న గండు పిల్లి, పెరట్లో జామచెట్టు కొమ్మపైన కాఁ కాఁ అంటూ కొలువు దీరిన ఒంటరికాకి లాంటి క్షుద్ర ప్రాణులుగూడా తమ దర్శనంతో అడపాదడపా రమణయ్యను అనుగ్రహిస్తూ వచ్చాయి. నిర్భాగ్యుడు, రమణయ్య తన ఏభైనాలుగేళ్ళ జీవితం పొడుగునా దుశ్శకున బాధితుడు! అవి ఎదురైన రోజున అతడు గుండెను కాస్త అరిచేతిలోకి తీసుకుని గుప్పిట్లో గట్టిగా దాచుకునేవాడు! తన ప్రవర్తన సరిగ్గా లేదని డిస్ట్రిక్టుబోర్డు ఆఫీసునుంచి పోస్టింగు ఆర్డరు వచ్చేస్తుందేమో! ఉత్త పుణ్యానికి తనపైన ఆదినుంచీ పగబూనివున్న ఆచారి హెడ్మాస్టరుగారితో ఛేకే అయి లేని పోని నేరాలు మోపుతాడేమో! ఆఫీసురూము కెదురుగా నేరేడు కొమ్మకు వ్రేలాడుతున్న యినుపతుండు తను గంట కొడుతున్నప్పుడు తెగి తలపైన కూలిపోతుందేమో! ఏమో, ఎవరు చెప్పగలరు? ఈ లోకంలో అవాంతరాలకేనా కొదువ?

అప్పుడప్పుడే విచ్చిపోతున్న మసకచీకటిలో ప్రక్కయింటి తలుపును బాదేస్తున్న ఆడమనిషి ముఖం కనిపించగానే రమణయ్య గుండెల్లో రాయిపడి నట్టయింది. ఆవిడనుదుట కుంకుమ లేదు. కొంపదీసి వితంతువు కాదు గదా! కాదు. అయివుండదు. పనిమనిషి

కదా, సైరన్ మ్రోగకముందే మొగుడి కౌగిలి విడిపించుకుని ఆదరా బాదరా యిలా పరుగెత్తి వచ్చివుంటుంది. క్రితం రాత్రి పడుకోబోతూ నమలిన తాంబూలంతో ఎరుపెక్కిన ఆ పెదవులు, ఆ చెదరిన ముంగురులు, అన్నింటికన్నా ముఖ్యం—కొప్పులోనుంచి తొంగి చూస్తున్న వాలుగైదునలిగిన మల్లెపువ్వులు ఆవిషయాన్ని చెప్పకనే చెబుతున్నాయి. రవణయ్య చివుక్కున లేచి నిల్చుని రోడ్డు పైకినడిచాడు.

ఆక్షణంలో అతడికి ఏనుగంతబలమూ, ఏనుగెక్కినంత సంబరమూ కలిగాయి!

రోడ్డుపైన నడుస్తూ రవణయ్య తనకు రాత్రి ఎప్పుడు నిద్రపట్టిందా అన్న ఆలోచనలో పడ్డాడు. ఆరాత్రికిక నిద్రలేదనుకున్న తర్వాత, తాలూకాఫీసులో టాంగుటాంగున గంట రెండుసార్లు మ్రోగిన తర్వాత ఎప్పుడో, ఎలాగో వచ్చేసింది నిద్ర! అన్నట్టు ఆ నిద్రలో ఏవో కలలు గూడా వచ్చినట్టున్నాయి ఓహో! అవి వేకువ జామున వచ్చిన కలలు!

వేకువజామున కన్నకలలు తప్పకుండా పాటెంపు కొస్తాయన్నది రవణయ్యకున్న వెయ్యి నమ్మకాల్లో ఒక్కటి!

రవణయ్య నిట్టూర్పు విడిచాడు. మనిషికి అరవై యేళ్ళు దగ్గిరిస్తే 'అరులో మరులో' అన్నారు. ఇటీవల తనకు మతి మరుపు ఎక్కువైపోతోంది. లేకపోతే ఆ బండెడుకలల్లో మచ్చుకు ఒక్కటైనా జ్ఞప్తికి రాకూడదా! రవణయ్య మనోఫలకం మీద కలలకు సంబంధించిన స్మృతులన్నీ మటుమాయమై ఊరుకున్నాయి. లేదంటే లీలగా నలుగురైదుగురు వ్యక్తులు తనకలల్లో తారసిల్లాడినట్టు మాత్రం అతడూహించుకో గలిగాడు—ఆనలుగురైదుగురిలోనూ ముఖ్యుడు సూరిగాడు! తనకుమారుడి నింకా సూరిగాడుగానే భావిస్తున్నందుకు రవణయ్య కించపడ్డాడు వాడు సూరిగాడు కాదు. సూర్యనారాయణ. ఈ సంగతి లోకానికి తెలిసి వచ్చేరోజు యిక ఎంతో దూరంలో లేదు!

రవణయ్య పెదవులపైన ఓనవ్వు—తూర్పుకొండ పైన విరిసిపోతున్న అరుణరాగం లాంటి లేనవ్వు పరవళ్ళు త్రొక్కుతూ అలా అలా గుంటలు పడ్డ దవడల మీదకు ప్రాకిపోయింది.

మరుక్షణాన రవణయ్య ఆలోచనలన్నీ వెంకట సుబ్బయ్యగారి వైపుకు ఉచ్చులు తెంచుకున్నాయి రవణయ్య కలల్లో సంచారం సలిపిన నలుగురైదుగురిలో ఈ వెంకటసుబ్బయ్యగారు కూడా ఒకరు. కానీ రవణయ్యకు సూరిగాడెంత సన్నిహితుడో, ఎంత ఆత్మీయుడో వెంకటసుబ్బయ్యగారంత దూరస్థులు. కాని వెంకటసుబ్బయ్యగారితో తనకు చెప్పుకో తగ్గ పరిచయముందని రవణయ్య అనుకుంటాడు. అలా అనుకోడానికి గల కారణాలను నెమరు వేసుకోడమంటే రవణయ్యకు చాలాయిష్టం! నాలుగేళ్ళకు ముందు యిదే డిస్ట్రిక్టుబోర్డు ప్రెసిడెంటు హోదాలో వెంకటసుబ్బయ్యగారు రామాపురం విచ్చేసినప్పుడు తను లేతకొబ్బరికాయలు కొట్టి చెంబులిండా ఆయనకు ఎలనీళ్ళు సమర్పించుకున్నాడు. మండుటెండలో ఆ మూడుమైళ్ళ కారుప్రయాణము, ప్రయాణానంతరం హఠాత్తుగా వచ్చిన గుండెపోటు, అబ్బా, అవన్నీ ఆయన మరచిపోయిన పక్షంలో, అప్పుడు తనుచేసిన సపర్యలు సైతం ఆయనకు జ్ఞప్తిలోవుండక పోవు.

అప్పటికి రవణయ్య వెంకటసుబ్బయ్యగారి బంగళాదగ్గిరికి వచ్చేశాడు ఇనపకమ్మలగేటు, మూసింది మూసినట్టేవుంది. రవణయ్య గేటుకానుకుని మూడంతస్తులమేడవైపు చూడసాగాడు. ఈ మేడలో వెంకటసుబ్బయ్యగారు ఎక్కడో, ఏ గదిలోనో పడుకుని నిద్రపోతుంటారు. మేడకు నాలుగువైపులా చెట్లు, చెట్లకుచుట్టూ ప్రహారీగోడ, గోడప్రక్కన తారురోడ్డు రోడ్డుకవతల విశాల పట్నం! ఎంతసేపు చూచినా మేడలూ మిద్దెలూ, దుకాణాలు గిడ్డంగులూ, పాకలు ఫ్యాక్టరీలు! ఈ పట్టణానికి దూరంగా ఎక్కడో సూర్యుడుదయిస్తాడు. అందుచేతనే కాబోలు పట్నాల్లో ఆలస్యంగా తెల్లవారుతుంది. వెంకటసుబ్బయ్యగారు నిద్రలేవడానికి కూడా ఆలస్యం, కావచ్చు.

రవణయ్య పక్కబార్లోవున్న కొళాయి దగరకు వెళ్ళి, క్రిందపడివున్న యిటుక ముక్కను తీసుకుని వేళ్ళతో నలిపి ఆ పొడితో తన అలవాటు ప్రకారం దంతధావనం ముగించాడు ఆతర్వాత మెల్లగా గేటు తెరుచుకుని లోపల ప్రవేశించి వెంకటసుబ్బయ్య గారెప్పుడు లేస్తారో-లేవరో అనుకుంటూ భవనానికి దూరంగా ఓచెట్టుక్రింద కూర్చున్నాడు.

రవణయ్య చెట్టుక్రింద కూర్చున్నప్పుడు గంట ఆరున్నర. ఏడుగంటల తర్వాత, ఒక్కొక్కకన్నే

తెరుస్తున్న సహస్రాక్షుడికి మల్లే భవనంలో కిటికీలు ఒకదానివెంబడి ఒకటి తెరచుకోసాగాయి. రేడియో జోలికి ఎవరో పోయినట్టున్నారు. నిశ్చల తపోనిష్ఠలో వున్న మహర్షితోనా చెలగాటం! కోపంతో ఒళ్లు మరచిన మహర్షి శాపవాక్యంలా సంగీతం యిల్లంతటా మారుమ్రోగి పోతోంది. ఇటు ఈవైపున రోడ్డులో 'బొంయ్ బొంయ్' మని కుయ్యికుతూ బస్సులూ, లారీలు గాలిని దూసుకుపోతున్నాయి. ప్రక్కవీధిలో ఫ్యాక్టరీ పొగగొట్టం తాలూకు వేడి నిట్టూర్పులు గూడా ప్రారంభమై పోయాయి. 'అబ్బ! వెంకటసుబ్బయ్య గారు నిద్రలేవడానికి యింత తతంగం జరగాలేమో' అనుకున్నాడు రవణయ్య!

గంట ఎనిమిదైంది. గేటు తెరుచుకుని కాకీ దుస్తుల్లో స్థూలకాయాన్ని బంధించుకున్న పొట్టిమనిషి ఒకడు రవణయ్యను చూచీ చూడనట్టు భవనంవైపు విసవిస నడచిపోయాడు. అతడు గేటుదగ్గర కనిపించగానే రవణయ్య చెట్టుకొనుకున్నవాడు, లేచి నిటారుగా కూర్చున్నాడు. ఇతడు మేడలోకి వస్తున్నాడు. తిరిగి వచ్చినప్పుడు ఇతడి నడిగితే వెంకట సుబ్బయ్యగారు నిద్రలేచారో లేదో తెలుస్తుంది. కానీ యితగాడు త్వరగా తిరిగి వస్తాడని నమ్మక మేమిటి?... కానీ రవణయ్య అనుకున్నట్టు ఆ కాకీ దుస్తుల హ్రస్వ కాయుడు భవనంలో ప్రవేశించలేదు. వెనుకవైపుకు వెళ్లి రంయ్‌మని ఓ కారును తెచ్చి సౌధ ప్రాంగణంలో నిలబెట్టి, రెండుసార్లు హారన్ మ్రోగించి క్రిందికి దూకేశాడు.

రవణయ్య లేచి నిల్చున్నాడు. వెంకట సుబ్బయ్య గారు నిద్రలేచేంతవరకూ తను ఈ చెట్టుక్రింద కూచుని కునికిపాట్లు పడ్డంకన్నా, ఈ డ్రయివరునెందుకు మాట్లాడించ గూడదు! ఒక్కొక్కప్పుడు గొప్పవాళ్లి యిళ్లల్లో పనిచేసే వంట మనుషులు, కారు డ్రయివర్ల లాంటి సామాన్యులవల్ల గూడా కార్యాలు సానుకూల మౌతాయి!

సమిధలాంటి పొగచుట్టను పళ్లమధ్య యిరికించి హోమకార్యంతత్పరుడౌతున్న కారుడ్రయివరు రవణయ్యను పైకి క్రిందికీ ఓసారి పరీక్షించి రెండుసార్లు వెళ్లిపొమ్మనటు చేయినిసరి, చివరకు "ఏమిటి, ఎవరి కోసం, ఏవూరు" అంటూ అతడిపైకి మూడు ప్రశ్నలను సంధించి వదలిపెట్టాడు.

"మాది రామాపురం బాబూ!" వినయం ఉట్టి పడేలా ప్రత్యుత్తర మిచ్చాడు రవణయ్య. ముప్ఫయి నాలుగేళ్ల సర్వీసులో ఏడెనిమిది మంది హెడ్మాస్టర్ల క్రింద పనిచేసిన రవణయ్యకు వినయంగా గాక మరోక రకంగా మాట్లాడ్డం చేతగాదు.

"ఐతే, రామాపురం వాళ్లందరూ యిలా ప్రెసిడెంటుగారి యింటిచుట్టూ గిరికీలు కొట్టవచ్చు నేమిటి?"

"అదికాదు బాబూ! ఉద్యోగంకోసం అప్లి కేషను పెట్టుకున్నామూ..."

"అప్లికేషను పెట్టుకున్నావా! ఉద్యోగానికి! నువ్వు!—బలే బాగుంది, బాగుంది!" కారు డ్రయివరు నవ్వేశాడు. అది అచ్చంగా నవ్వుకాదు. రవణయ్య ముందరగున్న ప్రాణి ఏనుగకాదు. అయివుంటే దాన్ని సులభంగా ఘీంకారమని పేర్కొని వుండవచ్చు!

"ఉద్యోగం నాకుకాదు బాబూ! మాఅబ్బాయికి."

కానీ రవణయ్య తన కుమారుడికి సైతం ఉద్యోగాన్ని అర్థించడంలో కారుడ్రయివరుకు సామంజస్యం గోచరించ లేదు!

"ఎవరికైతే నేమయ్యా! ప్రెసిడెంటుగారు వుద్యోగాల నేమైనా పిప్పరమెంట్లలా జేబులో వేసుకుని తిరుగుతున్నారా, మారాం చేసినవాడి కల్లా ఒక టిచ్చి, పొమ్మనడానికి! పో, పో ఆరునెలల తర్వాత ఓసారి కనబడు. జూన్‌లో కొత్తగా అటెండెన్లూ, ప్యూనులూ కావలసివస్తారు"

రవణయ్యకు కారు డ్రయివరు పైన హఠాత్తుగా జాలి కలిగింది! "ఓయీ! కారు డ్రయివరూ! నీదెప్పుడూ క్రింది చూపేగదా! ఉన్నట్టుండి నీకీరోజున పైచూపు రమ్మంటే ఎక్కడినుంచి వస్తుంది? నీ బుద్ధికి నా కొడుకు ప్యూనుగా, అటెండరుగా కనిపిస్తున్నాడా?"— రవణయ్య అప్రయత్నంగా నవ్వేశాడు.

"ఏమిటది? వెళ్ళిపొమ్మన్నా" అంటూ కారు డ్రయివరు విసుగుతో ముందుకు కదలి వరుసగా నాలుగు సార్లు హారన్ మ్రోగించేశాడు.

"ఇదిగో సింహాద్రి! ఏమిటా గోల? తీరా మారా కాఫీ నీళ్ళయినా నోట్లో పోసుకోవాలా పనిలేదా!

ప్రెసిడెంటు గారైతే మటుకూ, ఆయనకూ అన్నపానాదులు అవసరమే!"

రవణయ్యకు మొదట మాటలు మాత్రం వినిపించాయి. ఆతరువాత మెట్లు దిగుతూదిగుతూవున్న, వెంకటసుబ్బయ్యగారూ, ఆయన్ను వెంబడిస్తున్న గౌరవనీయ వైతాళికుడొకడూ కనిపించారు.

"ఏమిటో ఈ ప్రెసిడెంటు గిరీ! ఇదొక విశ్వామిత్ర సృష్టిలేవోయ్ రామనాథం! కలెక్టరీలు, గవర్నరీలు ఆలాటివన్నీ సాక్షాత్తు బ్రహ్మగారిసృష్టి. అవేమో మనకు రావు. ఇవేమో మనల్ని వదలవు"

"అంటే జీతం బత్తెంలేని కొలువులన్నమాట" రామనాథం బిగ్గరగా నవ్వేశాడు. చిత్రమేమిటంటే రామనాథం మాట్లాడుతుంటే హేళనచేసినట్టే వుంటుంది. కానీ ఆహేళనలో దబ్బకు లోపల యిక్షుఖండంలా, అంగులో దాగివున్న తీయటి ద్రవంలా స్తోత్రపాఠం అంతర్గర్భితమై వుంటుంది.

"ఎక్కవోయ్ రామనాథం! దూరం లేదులే. ట్రావెలర్స్ బంగళా దాకా వెళ్ళి వచ్చేద్దాం" అంటూ వెంకటసుబ్బయ్యగారు కారులో కూర్చున్నారు.

ఆయన చూపు కానేటట్టు భయభక్తులతో ఒదుగుళ్ళు పోతూ నిల్చుని వున్న రవణయ్య చేతులు జోడించి "దండాలు బాబూ!" అన్నాడు.

"ఎవరూ?" అన్నారు వెంకటసుబ్బయ్యగారు. ఆ అనుమానం మాత్రం కారు డ్రయివరుకన్నా సరళంగానే అన్నారు.

"నేనా బాబూ! రామాపురం మిడిల్‌స్కూలు ప్యూన్ని."

"ఓహో నువ్వేకదూ! ఆరోజున..."

రవణయ్య ఆనందానికి పట్టపగ్గాలేకపోయాయి. ఆ ఆనందాతిరేకంలో అతను "అవును బాబూ నేనే. మరచిపోయారు కారు" అన్నాడు.

"ఎలా మరచిపోగలను! జన్మకి మరచిపోలేను! ఇలా రావోయ్ రామనాథం! ఇతగాడి మూలంగా నేను రెండు నెలలు కాయలా పడిలేచాను" అన్నారు వెంకటసుబ్బయ్యగారు.

"అలాగా" అంటూ ప్రెసిడెంటు గారంతటివారిని రెండు నెలలు మంచంపైన పడుకోబెట్టిన నేపాళ మాంత్రికుడు ఒక్కసారి చూడదగినవాడే అనుకున్నట్టు రామనాథం కారు ఈవలగా వచ్చాడు.

"అయ్యో, నేనేం చేశాను బాబూ?" భయంతో వేళ్ళు నలుముకుంటూ అన్నాడు రవణయ్య.

"అదే చెబుతా విను రామనాథం! మండు వేసవి. ఎండదుమ్ము. అప్పుడు సింహాద్రి లేడులే—.రామదాసున్నాడు. అతగాడు స్టీరింగు చక్రం దగ్గర కూర్చుంటే యింకేముంది? ఋతుపర్ణుడికి నలుడు రథం తోలినట్టే! ఆరామాపురం చేరేసరికి రోడ్డుపైన దుమ్మంతా నాపాలే అయిపోయింది. మంచినీళ్ళు చేదమని నాలుగు బిందెలు తలమీద పోసేసుకున్నాను. హెడ్మాస్టరు నాలుగు సార్లు దగ్గరికి వచ్చి 'వంట చేయిస్తున్నానండీ' అన్నాడు. కానీ ఏదీ! ఎంతకూ అవంటేనో కళ్ళబడదే! ఆవంటా, దేవతా వస్త్రాలు రెండూ ఒకటయిపోయాయి. కడుపులో కొక్కులు త్రవ్వేస్తున్నాయి. ఆఖరుకు శోష తగిలిందనుకో"

"అమ్మయ్యో! అప్పుడేమైందేమైంది.?" సజీవంగా వున్న ప్రెసిడెంటుగారే తనకా కథ చెబుతున్నారని రామనాథానికి తెలియదేమో! లేకుంటే అంత ఉత్కంఠ బొత్తిగా అనవసరం.

"అప్పుడీ పుణ్యాత్ముడు కనిపించాడు" వెంకటసుబ్బయ్యగారు కథ చెప్పుకుంటూ పోతున్నారు. బాబూ! ఎపనీరుకాయలు తెమ్మంటారా అన్నాడు. ప్రాణం లేచివచ్చింది. తెమ్మన్నాను. అప్పటికే వేడి తగిలివుందేమో, ఎపనీరు పుచ్చుకోవడంతో ఒళ్ళంతా విషం ఎక్కిపోయింది. సాయంత్రం అదేరోడ్డులో, అదే వాహనంలో పోయినంతదూరం మళ్ళీ తిరిగి రావటం జరిగిందా, యింకేముంది? ఎంతకావాలో అంతా అయింది. సాయంత్రానికి జలుబు. అర్ధరాత్రికి చలిజ్వరం, మరునాడు తెల్లవారేసరికి డాక్టరు మందులు, సూదులు, పథ్యాలు..."

"ఇదంతా ఏలా వుందంటే..." వెంకటసుబ్బయ్యగారి గీతకు రామనాథం తన భాష్యాన్ని ప్రారంభించేశాడు. "నాకు భక్తులుగా నూరుజన్మలు కావాలా, శత్రువులుగా మూడుజన్మలు కావాలా అన్నాడట విష్ణుదేవుడు! అలా మీతో అపకారంచేయనైనా చేశాడుగానీ, అందుమూలంగా యితగాడు మీకింకా జ్ఞాపకముండిపోయాడు!"

# అడిగిరాని వరాలు

"ఇది మరీబాగుంది! మానవుడు తల్లడిల్లిపోతున్నాడుగదా అని అతడేదో తన చేతనయిందిచేస్తే, అది అపకారమా? మన గ్రహచారమను, ఒప్పుకుంటాను" అని వెంకటసుబ్బయ్యగారు రమణయ్యవైపు తిరిగి "ఇప్పుడేంపనిమీద వచ్చినట్టు?" అన్నారు.

"చెబుతానుబాబూ, మా అబ్బాయి ఒకడున్నాడు. వాడు మొన్ననే..."

"ఉండుండు"—వెంకటసుబ్బయ్యగారిసన్నిధిలో ఎదుటివాడి వాక్యాలు కోల్ గాసు బస్సులు. అవి విధి నిర్ణయాన్ననుసరించి గమ్యస్థానం చేరనూవచ్చు, చేరకనూపోవచ్చు. రమణయ్యకడ్డతగిలి ఆయన "అన్నట్టు రామాపురం స్కూలుకు క్రొత్తహెడ్మాస్టరు వచ్చేశాడుగదూ?" అన్నారు.

"రానూవచ్చాడు, పోనూపోయాడు బాబూ! రెండునెలల మెడికల్లీవులో" అని, కాసేపు గుటకలు మ్రింగి అవకాశం దాటిపోతుందేమోనన్న కంగారుతో రమణయ్య "మావాడి సంగతి బాబూ! వాడు మొన్ననే యల్. టి. పాసయ్యాడు. దరఖాస్తు వ్రాసుకుని నెలరోజులయింది. మిమ్మల్నొకసారి చూచి పోదామని వచ్చాను" అన్నాడు.

వెంకటసుబ్బయ్యగారు తృప్తిపడి రామనాథం ముఖంలోకి చూచారు.

రామనాథం ముఖంలో ఆశ్చర్యం సుళ్లు తిరుగుతోంది.

"చూచావటోయ్ రామనాథం! ఇతడి కొడుకు యల్. టి. ప్యాసయ్యాట్ట! తండ్రి డిస్ట్రిక్టుబోర్డు సర్వీసులో ప్యూను. కొడుకు యల్. టి. టీచరు. చూచావా తరతరానికీ తేడా!"

"నిజమే, నిజమే" అంటూ ముక్తాయించి రామనాథం రమణయ్యకేసి తిరిగి "ఇక నువు వెళ్ళవయ్యా! ఉదయం నక్క మొగంచూచి లేచినట్టున్నావు. ఒక తిక్కమల్లిగే ఆయన మీఅబ్బాయిని అదే రామాపురం స్కూల్లోనే హెడ్మాస్టరుగా వేసేయగలరు" అన్నాడు.

"లేకపోతే ఏమిటోయ్! ఈ పందికొక్కులేమైనా పాతికాణాచిని వదిలిపెట్టే రకమా! నలుగుర్ని వేశాము. నలుగురూ లీవు దాఖలుచేసి యింట్లో కూచున్నారు. ఈసారి ఏరికోరి ఓ కుర్రాడినే వేసేద్దామనుకుంటున్నాను" అన్నారు వెంకటసుబ్బయ్యగారు.

"తమదయ, తమదయ" అన్నాడు రమణయ్య.

తన శల్యసారథ్యం ఘోరమైన అపజయానికి గురైనందువల్ల కాబోలు, రమణయ్యను కొఱకొఱ చూస్తూ కోపాన్నంతా కారుపైకి మళ్ళించాడు సారథి, సింహాద్రి!

* * *

సుష్టుగా అన్నం తిన్నతర్వాత, పచ్చివక్కా, లేత తమలపాకు, రవ్వసున్నం, పొలఘాటుపొగాకు వీటి కలయికతో సిద్ధించిన మత్తులో రమణయ్య ఊహలు రామాపురంబస్సు పరుగెత్తుతున్న ఉరవడితో శ్రుతికలిపాయో, లేక పందెం వేశాయో చెప్పడంకష్టం. ఏది తలముంచు కోరికగా కనిపిస్తూ పాతికేళ్లుగా తనను ఊరించిందో, అది సఫలమయ్యే సూచనలు గోచరమైనప్పుడు మానవుడికి అంత ఉద్వేగం అంత సంభ్రమం కలగడంలో ఆశ్చర్యంలేదు. సూరిగాడి చదువు యింద్రజాలంలా జరిగిందికాదు. స్కాలర్ షిప్పులూ, అవీ దొరికినమాట నిజమే. కానీ తనూ భార్యాబిడ్డలు యిక్కడ పచ్చిమంచినీళ్లు త్రాగి పస్తులు పడుకుంటేనే, అక్కడ సూరిగాడు 'టీ'లు త్రాగి పరీక్షలకు చదువగలిగాడు. నలుగురు బిడ్డలతల్లి మంగమ్మ కట్టుకున్న చీరలో మాసికలు పెరిగినకొద్దీ, అణాకు టికాణాలేక తనకు జేబుగడ్డం పెరిగినకొద్దీ అక్కడ మంగమ్మ తాలిమాలు ఓస్త, తన కళ్ళల్లో వెలుగు, చదువులో ఒక్కొక్క మెట్టే పైకి రాగలిగాడు. వాడు, తన సూరిగాడు! కండల్ని పీల్చి పిప్పిజేసి, ఎముకల్ని నుగ్గునూచజేసి ఈ లోకం తన వయసును దోపిడీచేస్తే చేసింది. ఇది తన సూరిగాణ్ణి ఏం చేయగలుగుతుంది? బెల్ నొక్కగానే ప్రత్యక్షమై, కన్ను విసరగానే పరుగెత్తి, పొరబాటు చేయకపోయినా తిట్లుతిని, హెడ్మాస్టరుదగ్గరనుంచీ ఆడపిల్లలకు అల్లికపని నేర్పించే పంతులమ్మదాకా అందరికీ లోకువై హీనుడుగా, దీనుడుగా బ్రతకడానికి తన సూరిగాడు ప్యూనుకాదు. కాబోడు. ఇంతకన్నా తనకు కావలిసిందేముంది?

"లేకేం? ఉంది!" రమణయ్య ఆలోచనా స్రవంతిలో యివొక సుడిగుండం. తన శ్రమ ఒక మంచి మాటకు నోచుకోలేదు. తన సేవ యింత కృతజ్ఞతకు నోచుకోలేదు. ఎన్ని వార్షికోత్సవాలు, ఎన్ని మీటింగులు, ఎన్ని నాటకాలు! తను గోరీదగ్గర గుంటనక్కలా ఆ ఆఫీసు రూము దగ్గర పడిగాపులుపడుతుండగా

ప్రేయర్ హాలు గవతల వీళ్ళకు ఉపన్యాసాలా? వీళ్లకు నాటకాలా? వీళ్ళకు పూలదండలా? తను అడగదలచుకున్నాడు. ఏభైయేళ్ళ పాఠశాలకట్టడంపైన జండా కొయ్యదగ్గర నిలబడి ఊరువూరంతా వినపడేటట్టు ఈ రోజు కాకపోతే నేం, రేపయినా అడిగితీరుతాడు: పురజనులారా! మీరు కూచోడానికి తెల్లవారింది మొదలు ప్రొద్దు వాటారేదాకా బెంచీలుమోసి తల బట్టగట్టిపోయిం దెవడికి? ఓయీ ప్రెసిడెంట్! నీ మెడలో పూలదండకు బండలుపగిలే మండుటెండలో రెండుమైళ్లు పగుకత్తి కాళ్ళు మాడ్చుకున్న దెవడు? అయ్యా ఆచారీ! వాడది చేశాడు. వీడిది చేశాడు. అందరికీ వందనాలు అంటూ ప్రతి మీటింగుచివరా వల్లించావే! నిజంగా చెమటోడ్చి పచ్చిసున్నమైన వాడెవడో కనిపించలేదా నీకు? ఓయీ శంకర్రావ్! నాకూ తల్లిదండ్రులు పెట్టిన పేరొకటుందని నీకు తెలియదూ? నువ్వు నన్ను 'ఒరేయ్, ఒరేయ్' అనా పిలవడం?

రమణయ్య తలపులు గనుక ఆచారిపైన, శంకర్రావుపైన కేంద్రీకృతమైతే మళ్ళీ ఒకమూనాన అక్కడినుంచీ కదలవు.

అన్నట్టు ఆరోజు తెల్లవారుజామున రమణయ్య కలల్లో విహరించిన నలుగురైదుగురిలో ఈ ఆచారి, శంకర్రావులుగూడా వున్నారు!

ఆచారి సన్నగా పసిరికపాములా వుంటాడు. కానీ పసిరికపాము కరవదంటారు. ఆచారి పరుషవాక్కులతో కరవగలడు. రూక్షవీక్షణాలతో పొడవగలడు. హుంకారాలతో రంపపుకోత కోయగలడు.

ఆచారి ఎనిమిదిన్నరకల్లా పాఠశాలకు విజయం చేస్తాడు. ఎందరు టీచర్లు స్కూలుకు రావడంలేదు? కానీ ఆచారిరావడం అదొక రాజఠీవి! తన తిట్లు, హుంకారాలే తనకు బరాబరులు పలుకుతుండగా, నాడు నాకే బహుపరాక్ అన్నట్టు తల వెనక్కు, కాళ్ళు ముందుకు వేస్తూ అతడు స్కూల్లో ప్రవేశిస్తుంటే టీచర్లు అత్తివాటు కోడళ్ళు, కుర్రాళ్ళు కుక్కిన పేనులు!

టీచర్స్ రూములో ఆచారిది అప్రతిహతమైన పలుకుబడి! అతడు కుర్చీలో వుండగా సహోపాధ్యాయులు కిముక్కని నోరుతెరవరు. తప్పిదారి ఆ కవి బాగా వ్రాశాడనీ, ఒకానొక బొమ్మ బాగుందనీ, ఫలానా సినిమాపాటలో మలుపు మధురంగా వుందనీ, నువ్వన్నావంటే అంతటితో నీకు కీడు మూడినట్టే! ఆమాట నువ్వన్నావుగనుక ఆచారి దృష్టిలో ఆ కవి వ్రాసింది చెత్త. ఆ బొమ్మ అసహ్యం. ఆ పాట అథ్వాన్నం. అదృష్టవశాత్తు ఆయా కళాకారుల పూర్వజన్మ సుకృతంకొద్దీ ఆచారి దృష్టిలో ఎవరి కృషిఅయినా గుర్తింపుకు రావచ్చు. కానీ అలా ఒకవిషయాన్ని ప్రశంసించే అధికారం, విమర్శించే పరిజ్ఞానం మాత్రం నీకు లేనేలేవు. లాభంలేదు. ఆచారితో వాదించి లాభంలేదు! ఆచారి ఎదుటివాడి అభిప్రాయాల పాలిటికి అలీఘర్ తాళం. దాన్ని తెరిచే తాళంచెవి భువిలో లేదు!

ఆశ్చర్యమేమిటంటే, యింతటివాడు ఆచారి హెడ్మాస్టరని పేరుబెట్టి ఒక కట్టుకంబాన్ని చూపిస్తే దానిఎదుట అవనత శిరస్కుడై, అంజలిబద్ధుడై నిలచిపోతాడు. ఆచారి నిర్ణయరీత్యా, అసంఖ్యాక మానవ జాతిలో ప్రప్రథముడు ప్రధానోపాధ్యాయుడు. చిట్టచివరివాడు పాఠశాల బంట్రోతు!

స్కూలు స్టాఫులో ఆచారిని మంచిచేసుకోవడానికి ప్రయత్నించి విఫలులైపోయిన దైవోపహతుల్లో రమణయ్య ఒకడు. రమణయ్యకు దీపావళి దీపావళి కాదు. సంక్రాంతి సంక్రాంతి కాదు. ఆచారి కోపానలం తనపైకి ప్రసరించనిరోజు రమణయ్యకు దీపావళి. ఆచారి హెడ్మాస్టరు దగ్గర తన అప్రయోజకత్వాన్ని వివరించనిరోజు రమణయ్యకు సంక్రాంతి. ఆచారి తనను కూచోనివ్వడు. నిలుచోనివ్వడు. నిశ్చింతగా నిద్రపోనివ్వడు. తనెప్పుడో ఈ స్కూలుకు ఋణపడ్డాడు. ఆ ఋణాన్ని చక్రవడ్డీతో వసూలుచేస్తున్న నక్షత్రకుడు ఆచారి!

'మనుషులు రావచ్చు. పోవచ్చు. కానీ నేను నిరంతరం ప్రవహిస్తూవుంటాను' అన్నదట ఒక సెలయేరు! ఆవిధంగా పాఠశాలను అంటిపెట్టుకున్న వారిలో ఆచారితర్వాత చెప్పుకోదగ్గవ్యక్తి శంకర్రావు. శంకర్రావు ఆచారికి ఛాయామాత్రుడుగా నటిస్తాడు. కానీ నిజానికి శంకర్రావుకో ప్రత్యేక వ్యక్తిత్వముంది. డబ్బు ఆదా చేయడం అతడి జీవితలక్ష్యం. ఏ అదనులో ఎక్కడెక్కడ ఏఏ వస్తువులు దొరుకుతాయో శంకర్రావుకు తెలిసినట్టు మరొకరికి తెలియదు. శంకర్రావు కళ్ళద్దాలను మరచిపోయి స్కూలుకు రాగలడు!

టైమ్‌టేబిల్ మరిచిపోయి క్లాసుకుపోకుండా టీచర్స్ రూములో కూచోగలడు! కాని ప్రతి ఆదివారం రోజునా రవణయ్యకొక పారుగూరి ప్రయాణాన్ని నిర్ధారించడంలో మాత్రం అతడు అప్రమత్తుడు!

శంకర్రావుభార్య జిహ్వాచాపల్యం రవణయ్యను రామాపురంనుంచి అయిదుమైళ్ళలోవున్న రెడ్డిగారి నిమ్మతోటకు ఎన్నిసార్లు నడిపించిందో ఎవరికెరుక? రవణయ్య అనే భారవహన యంత్రంమీదుగా ఎన్ని టన్నుల వంటచెఱకు, ఎన్నిబారువుల చింతపండు శంకర్రావుయిల్లు చేరుకున్నాయో ఎవరికి తెలుసు?

ప్రొద్దు గ్రుంకేసరికి రామాపురంలో మిడిల్ స్కూలు కెదురుగా బస్సుఆగింది. రవణయ్య బస్సు దిగి మెల్లగా యింటిదారి పట్టాడు. బుడ్డిదీపం దగ్గర కూచుని ఏదోపుస్తకం చదువుకుంటున్న సూర్య నారాయణ రవణయ్య లోపలికిరాగానే "కామాక్షీ! నాన్నొచ్చారు. నీళ్ళివ్వు" అని చెల్లెల్ని కేక వేశాడు.

కామాక్షి చేతిలోనుంచి నీళ్ళగ్లాసును తీసుకుంటూ రవణయ్య ఓయ్యాంగాలిస్తున్న భార్యవైపు తిరిగి "మనం వెళ్ళినపని కాయో, పండో చెప్పరా" అన్నాడు.

"కాయెందుకౌతుంది? పండేఔతుంది" అంది మంగమ్మ.

"నువ్వేమంటావురా సూరీ!" అన్నాడు రవణయ్య.

సూర్యనారాయణ నవ్వుతూ అన్నాడు. "అమ్మ మాట ఎప్పుడు పొల్లుపోయిందినాన్నా? నేను ప్రతిసారి కాలేజికి వెళ్ళినప్పుడూ పరీక్షవుతావులే, వెళ్ళిరా నాయనా అనేది. ఆ మాట అక్షరాలా జరిగింది. ఇప్పుడూ అంతే!"

* * *

అయిదోరోజు ఉదయం పదిగంటలకు మామూలు ప్రకారం రామాపురం మిడిల్‌స్కూల్లో ఫస్టుబెల్ మ్రోగింది. 'హెడ్మాస్టరు ఇన్‌చార్జి'గా వున్న ఆచారి ప్రార్థనానంతరం విద్యార్థులకు సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని గురించి నాలుగు మంచిమాటలు ఉపదేశించి ఆఫీసురూముకు తిరిగివస్తూ, వరండాలో నిల్చున్న రవణయ్యను చూచి "టపా వచ్చిందా?" అని ప్రశ్నించాడు.

"ఇప్పుడే వచ్చింది బాబూ! టేబిలు పైన వుంచాను" అన్నాడు రవణయ్య.

ఆ తరువాత ఏం జరిగిందో రవణయ్యకు తెలియదు. ఆఫీసు రూములో ప్రవేశించిన అయిదు నిమిషాలకు ఆచారి "శంకర్రావ్, శంకర్రావ్" అంటూ ఓ గావుకేక పెట్టేశాడు.

అటు టీచర్స్ రూములోనుంచి శంకర్రావు, యిటు వరండాలోనుంచి రవణయ్య ఆఫీసు రూములో అడుగుపెట్టేసరికి పరిస్థితి ప్రమాదకరంగావుంది. ఆచారి ముఖంలో నెత్తురుచుక్క లేదు. అది భయమో, విస్మయమో, మరొకటో గానీ అతడు నిలువునా కంపించి పోతున్నాడు.

"ఏమిటి? ఏం జరిగింది" అంటూ శంకర్రావు టేబిలుపైన పడివున్న కాగితాన్ని పైకెదిసి ఒకసారి చివరిదాకా చదివేశాడు. క్షణంలో అతడి ముఖకవళికలు సైతం మారిపోయాయి. నిటారుగా నిలచోలేక అతడు మొదట టేబిలుపైకివంగి, ఆ తరువాత దబాలున కుర్చీలో కూలబడిపోయాడు.

అంతే! ఆ రోజు మధ్యాహ్నంవరకూ ఆచారి, శంకర్రావు లిద్దరూ చేతలుడిగిన విగ్రహాలు! కత్తులూ కటార్లు చేతబట్టుకుని డాక్టరు మంచంప్రక్కన నిలబడి వుండగా, అపాయకరమైన ఆపరేషనుకోసం మత్తులో పడివున్న రోగులు!

రవణయ్య యథాప్రకారం ప్రతి పీరియడ్ చివరా గంటకొట్టాడు. తోటలో చెట్లకన్నింటికీ నీళ్లు చేదిపోశాడు. మధ్యాహ్నం కుర్రాళ్లలోబాటు ఆదరాబాదరా తినా యింటికి బయల్దేరాడు.

కానీ రవణయ్యకు యింటిలో తనాశించినంత ఆనందకరమైన వాతావరణం ద్యోతకం కాలేదు. అతడికోసం వాకిటిదగ్గరే కాచుకునివున్న సూర్యనారాయణ జేబులోనుంచి ఓ కవరు పైకితీసి "ఇదంతా ఏమిటి నాన్నా! ఎక్కడో చీకూచింతా లేకుండా అసిస్టెంటుగా పనిచేయకుండాపోయి ఈ బాదరబందీ అంతా దేనికి చెప్పు" అన్నాడు.

ఏం చెప్పాలో తోచక రవణయ్య కుమారుడి మొల తెలపటాయిస్తుండగానే లోపలినుంచి మంగమ్మ అందుకుంది.

"తల్లి కడుపులోనుంచే ఎవరూ నేర్చుక రారే దులే నాయనా! పాడంగా పాడంగా పాట అదే

వస్తుంది. పోనీ నీకు తెలిసినంతవరకూ చెయ్యి. కొట్టి కొఱతేస్తారేమిటి? తెలీందానికి మీ నాన్న అక్కడే వున్నాడుగా!"

"నీకు తెలియదే అమ్మా! నువ్వూరుకో" అన్నాడు. చిరాగ్గా సూర్యనారాయణ.

తండ్రీ కొడుకూ భోజనాలకు కూచున్నారు. మంగమ్మ కంచాలుపెట్టి అన్నం వడ్డిస్తోంది.

అన్నం తినబోతూ సూర్యనారాయణ తల పైకెత్తి "నాకు తెలుసు నాన్నా! ఇదంతా నువ్వు చేసిన పనే" అన్నాడు.

రమణయ్య నేరస్థుడికిమల్లే తలవంచుకుని కంచం ఖాళీచేయడానికి ఉపక్రమించాడు.

ఉట్టిలోనుంచి మజ్జిగ తీసుకుని మంగమ్మ రమణయ్యకు కాస్త దగ్గరగా కూచుంటూ "ఐతే ఏమయ్యా! ఇన్నిరోజులూ మధ్యాన్నాల్లో నువ్వొక్కడివే వచ్చి కాలేదా, యింకా అన్నంకాలేదా అంటూ ఎగిరెగిరి పడేవాడివి. ఇక రేపటినుంచీ అబ్బా, కొడుకూ యిద్దరూ కలిసి వచ్చి నన్ను రాపుకతింటారన్నమాట?" అంది.

"ఒసే వెర్రిమొహమా!" అని రమణయ్య ఓ గ్లాసుడు నీళ్లు గుక్కపట్టి తాగేశాడు. "నీకు నేనూ, అబ్బాయి ఒకటిగానే కనిపిస్తున్నామేమిటి? వాడికేం! వాడు కావలిస్తే ఓ సైకిలు కొనుక్కోగలడు. లేదా వేళకింత అన్నం ఎవరి చేతనైనా..."

"నాన్నా!" ఉక్కిరి బిక్కిరైపోతూ బిగ్గరగా అరిచేశాడు సూర్యనారాయణ.

"ఎందుకురా బాబు అంతకోపం! హెడ్మాస్టరింటికీ, స్కూలుకీ అన్నం మోసి మీనాన్న కాళ్ళు వాచిపోయాయి. చేతి కెదిగిన పిల్ల యింట్లో వంట చేసుకుంటుంది. నా కింతకంటే పనేముంది గనుక! నీకు నే నన్నం తెస్తాన్లే. కొడుక్కి తల్లి అన్నం తెచ్చి పెట్టడం తప్పేమికాదు."

"ఐతే నీకొడుకు హెడ్మాస్టరీ చేస్తున్నాడని నువ్వు యింటికీ స్కూలుకూ అన్నంమోస్తావా అమ్మా?" అన్నాడు దీనంగా సూర్యనారాయణ.

మంగమ్మ చేతుల్ని ముందుకుసాచి "ఈ చేతులు ఏ హెడ్మాస్టరింట్లో చాకిరీ చేయలేదురా నాయనా? చూడు బొబ్బ లెక్కనిచోటుండేమో! ఇక నీకుచేస్తేనా నేనరిగిపోయేది!" అంది.

సూర్యనారాయణ కంచం అవతలకి తోసి, పెరట్లోకివెళ్లి చెయికడుక్కున్నాడు.

* * *

మరునాడు ఉదయంనుంచీ సాయంత్రం వరకూ రమణయ్యకు తీరిగ్గానే గడచిపోయింది. సూర్యనారాయణ ఉదయం పదిగంటలకు ఛార్జీ పుచ్చుకున్నాడు. పదకొండుగంటలప్పుడు ఓ మెమో వ్రాసి జీతం చెల్లించడానికని ఆఫీసురూము దగ్గరికివచ్చిన కుర్రాడిచేతి కిచ్చి టీచర్లకు చూపి సంతకాలు తీసుకరమ్మన్నాడు. ఇంతకాలంగా తను చేస్తున్నపనిని, ఈరోజు మరొకడెందుకు చేయాలో రమణయ్య కర్థం కాలేదు. కుర్రాడికద్దుతగిలి, మెమోను తీసుకుని రమణయ్య తనే స్కూలు పైకి బయల్దేరాడు. భగీరథుణ్ణి వెన్నంటిన గంగాప్రవాహంలా ఆరోజు రమణయ్య నడచినంత మేరకూ నిశ్శబ్దమే తాండవించింది. మెమోను టేబిల్ పైకి విసరి అతడు క్లాసురూములో నిల్చున్న ఒకటి, ఒకటిన్నర నిమిషంపాటూ విద్యార్థులు విద్యార్థులుకారు, ఉపాధ్యాయుడు ఉపాధ్యాయుడు కాడు, ప్రేక్షకులకు చిరపరిచితమైన నాటకంలో అలవాటుగా సేవకుడి పాత్రధరించే నటుడు, ఉన్నట్టుండి రంగంపైన రాజుగా ప్రత్యక్షమైతే ఆ పరిస్థితి కొంత ఎబ్బెట్టుగా వుండక తప్పదు. నిన్నటివరకూ వీడు సేవకవేషధారే కదా అన్న చులకనభావమూ, ఆ క్షణంలో అతడు ప్రదర్శిస్తున్న రాజఠీవి పట్ల అసహనమూ ప్రేక్షకులకు కలిగి తీరుతుంది. కానీ అది నాటకం కావడంవల్ల బూటకమనీ, నిజానికి ఆ నటుడు సేవకుడికంటే రాజుకంటే భిన్నుడయిన వేరొక వ్యక్తి అన్న స్పృహ ప్రేక్షకులకు అప్పటికో, మరికొంత సేపటికో కలుగకపోదు. కానీ రమణయ్య విషయం అలాటిది కాదు. జగన్నాటక రంగంలో అతడిది బంట్రోతుపాత్ర. జన్మతహా రమణయ్య అమాయకుడు, నిర్ధనుడు. అందువల్ల పరాభవాలకు సన్నిహితుడు. పరాభవాలకు ప్రతీకారం నెరపదలచుకుంటే రమణయ్య ముమ్మందుగా లాటరీలో ఓ లక్షరూపాయలు గెలవగలగాలి. కానీ రమణయ్యకు లాటరీపైన నమ్మకంలేదు. ఐనా అతడు ఒక విచిత్రమైన లాటరీలో పాల్గొన్నాడు. సంపాదనలో తినీ తినకా సగానికి పైగా మిగిల్చి, ఆ డబ్బును కుర్రాడి చదువుపైన వెచ్చించడం లాటరీగాక మరేమిటి? వాడు చదువుతాడని ఏం నమ్మకం? తీరా పరీక్షలో పల్టీకొట్టి దేశంపైన వెళ్ళిపోతే? అదృష్టవశాత్తూ రమణయ్య ఈ

లాటరీలో గెలిచాడు.! అందువల్ల అతడి స్థానంలో మార్పుకలగనిమాట నిజమే! కాని ఆ స్థానానికి బలం చేకూరిందనిమాత్రం ఒప్పుకోక తప్పదు.

రవణయ్య ఆఫీసురూముదగ్గరికి వచ్చేసరికి సూర్య నారాయణ కుర్చీలో లేడు. మెమోను టేబిలుపైన వుంచి రవణయ్య గడియారంవైపు చూచాడు. రెండు ముల్లూ పన్నెండుదగ్గర కలుసుకుంటున్నాయి. అంటే మూడో పీరియడు ఆఖరుకావడానికింకా పదిహేను నిమిషాలున్నాయన్నమాట! రవణయ్య బుర్రలో ఓ ఆలోచన మెరపులా మెరిసింది. ఇంతకాలం తను పీరియడ్ల ననుసరించి బెల్ కొట్టాడు. ఇకమీదట అలా కాదు! ఇంక తన ననుసరించే పీరియడ్లు జరుగుతాయి!.. అతడు చరచరా బయటికి వచ్చి మూడుసార్లు బెల్ మ్రోగించేశాడు!

నాలుగో పీరియడ్ ప్రారంభం కాగానే రవణయ్య తోటలోపలికి వెళ్ళి ఓమూలగా చెట్టుక్రింద పైపంచ పరుచుకున్నాడు. ముఖాలు వెలవెలబోతుండగా గదుల్లోనుంచి బయటికి వస్తున్న టీచర్లను చూస్తుంటే అతడికి నవ్వాగిందికాదు. అప్పుడే ఏమయింది వీళ్ళ పని? ముందుంది ముసళ్ళపండగ! ముప్పతిప్పలుబెట్టి వీళ్లని మూడు చెరువుల నీళ్లు త్రాగించకపోతే తనపేరు రవణయ్య కాదు!

విరియబూసిన దేవగన్నేరు పువ్వులపైన్నుంచి తోటలో గాలి చల్లగా, మత్తుగా వీస్తోంది. రవణయ్య చిటికె వేస్తూ ఆవులించి కళ్ళుమూసుకున్నాడు. మరి కొంతసేపటికి అతడికి నిద్ర గూడా పట్టివుండేదే! కానీ యింతలో వెదురుతడిక తెరచుకున్నట్టు అలికిడి విన రావడంతో రవణయ్య కళ్లు తెరిచాడు. వచ్చేడివాడు ఆచారి!

ఆచారి క్లాసురూమును, టీచర్సురూమును వదలిపెట్టి అప్పుడప్పుడూ తోటలో ఎందుకు ప్రవేశిస్తాడో రవణయ్యకు బాగా తెలుసు. ఆచారి నాలుగైదు రోజులపాటు తిండీతీర్థం లేకపోయినా వుండిపోగలడు గాని గంటకొక్కసారి చుక్కాడుపొగను సేవించకపోతే మాత్రం బ్రతుకలేడు. అవిఘ్నంగా ధూమేశ్వరీ ఉపాసకుల్లో ఆచారి పరమనైష్ఠికుడు.

ఆచారిని చూడగానే రవణయ్యబుర్రలో రెండోసారిగా మళ్ళీ ఓ మెరుపు మెరిసింది. ఆ మెరుపుకు వెనుక మేఘానికి మూలం ఏడెనిమిదేళ్లక్రితం జరిగిన సంఘటన: ఓరోజు సాయంత్రం తను బజారుకు వెళ్ళి ఆచారికి అకౌంటువున్న అంగట్లోనుంచి ఓ బీడీకట్ట తీసుకొచ్చాడు. అప్పటికి తనకు రొమ్ముపడిశం పట్టి నాలుగురోజులయింది. తను చేసిన నేరమల్లా ఒక్క బీడీ యిస్తారా బాబూ అని అడగటమే! ఆచారి అగ్గి పోయాడు. తనకు అంతరాలు తెలియవని ఆడిపోశాడు. అంతటితో వూరుకున్నాడయమే! ఫిర్యాదు హెడ్మాస్టరుదాకా తీసుకెళ్లాడు. ఆ హెడ్మాస్టరుకు ఆచారి మాట వేదవాక్యం! ఆచారి తనపట్ల కినుక ప్రదర్శించడమే తరువాయి, ఆ హెడ్మాస్టరు తన నీ పాయిలో పెట్టి, ఆ పాయిలో తీయడమే తన దినకృత్యంగా పెట్టుకున్నాడు.

దేవగన్నేరు చెట్టుక్రింద పడుకున్న రవణయ్య చివాలున లేచి కూచున్నాడు. ఆచారికి వినపడేటట్టు గొంతు సవరించుకుని 'మేష్టారూ' అన్నాడు.

పిలుపు వినిపించగానే ఆచారి ఉలిక్కిపడ్డాడు. అతడి కెందుకో భయంకలిగింది. అతడు అక్కడినుంచి చల్లగా జారుకుందామనికూడా తలపోశాడు.

"మిమ్మల్నే మేష్టారూ! ఇలా రండి వెళ్లి పోదురు గాని"

ఆచారి అప్రయత్నంగా రవణయ్యను సమీపించాడు.

రవణయ్య జేబులోనుంచి ఓ బీడీకట్ట పైకి తీసి, అందులోనుంచి ఓ బీడీ మాత్రం తీసుకుని "తీసుకోండి మేష్టారూ" అంటూ చేయి చాచాడు.

ఆచారి ఆశ్చర్యంతో నోరు తెరిచేశాడు.

"బీడీ మేష్టారూ! గడియారం మార్కు ది" రవణయ్య వర్ణింపసాగాడు "గుంటూరు పొగాకుగదా, ఒంటికి చాలా మంచిది. మొన్నమొన్ననే బజారుకు వచ్చింది. మీరూ వినేవుంటారు. జండాలు చేతబట్టుకుని కుర్రాళ్ళిద్దరు వీథులవెంబడి అరుస్తుంటారు: గోపాలం! - ఏంసార్ - ఎక్కడికోయ్ - బజారుకండీ- ఎందుకోసం-బీడీకోసం-ఏంబీడీ-గడియారంమార్కు ..."

ఆచారి శరీరంపైన లేస్నూ, జెర్రులూ ప్రాకుతున్నాయి. మరొకరికయితే రవణయ్య ప్రవర్తనకు అప్పటికప్పుడుఅర్థంగోచరించివుండేదో కాదో చెప్పడం కష్టం! ఆచారి సూక్ష్మగ్రాహి. అసలు కారణమేదో,

అతడిట్టే పసిగట్టేశాడు. ఐనా యిదేం ప్రతీకారం! కాకమరేమిటి? ఇతను రవణయ్యేనా? కాదు. సూది గుచ్చినందుకు కోప్పడి దర్జీవాడిపైన బురదనీళ్లు క్రుమ్మరించిన ఏనుగ వీడు! ఈ ఏనుగ తొండం పైకెత్తి, మీదికి దూకితే తనేం చేయగలడు? ఆచారి అడుగు వెనక్కు తీశాడు. నిమిషంలో తడిక దాటుకుని దూరంగా వెళ్ళిపోయాడు.

నాలుగో పీరియడు పూర్తికావస్తోంది. న్యాయాధిపతిమ్రోల తన నిర్దోషిత్వాన్ని సహేతుకంగా సమర్థించుకోలేని నేరస్థుడికి మల్లే, సెకండుఫారం 'సి' సెక్షనులో నలభైమంది కుర్రాళ్ల ఎదుట శంకర్రావు వ్యాసానికీ వలయపరిధికీ గల నిష్పత్తిని విశదీకరించలేక సతమతమై పోతున్నాడు. వివిధ పాఠ్యభాగాలతో బుర్ర వేడెక్కిపోయిన తర్వాత, ఎప్పుడెప్పుడు యింటికిపోయి కంచాలపైన కలియబడుదామా అని కాచుకుని కూర్చున్న విద్యార్థులకు లెక్కలు బోధించవలసి రావడం ఉపాధ్యాయుడికి శిక్షలాంటిది. ఈ శిక్ష టైమ్ టేబిల్ తయారవుతున్న రోజుల్లో శంకర్రావు ఆచారికి పదిరూపాయలు అప్పివ్వడంలో తామసించినందుకు సద్యఃఫలితం! శంకర్రావు లోలోపల ఆచారిని తిట్టుకుంటూ, బెల్ కోసం చెవులు రిక్కించుకుని కుర్చీలో స్తబ్ధుడై కూచున్నాడు.

కానీ ఒంటిగంటకు సరిగ్గా గంట మ్రోగలేదు. శంకర్రావు ఓర్పును పరీక్షించడానికి నిశ్చయించుకున్నట్టువంటిదై అతడి చేతిగడియారంలో పెద్దముల్లు పన్నెండుదగ్గర బయలుదేరి ఒకటి రెండు మూడు నాలుగు మజిలీలను దాటుకుంటూ ముందుకు వెళ్ళిపోతోంది.

దిక్కులు తోచక శంకర్రావు ఏడుపు మొహం పెట్టి కుర్చీలో అలాగే కూలబడివుండగా, ప్రక్క గదిలోనుంచి ఓ సహోపాధ్యాయుడు బయటికి వచ్చి "శంకర్రావుగారూ! ఓమాట" అన్నాడు.

"ఏమిటే-ఏమిటే" అంటూ శంకర్రావు వరండాలోకి పరుగుదీశాడు.

"ఈ రోజు గంట మ్రోగదు" సహోపాధ్యాయుడు శంకర్రావు చెవులోరహస్యం ప్రకటించేశాడు.

"ఏం! ఎందుకని?"

"రవణయ్య తోటలో చెట్టుక్రింద గాఢనిద్రా పరవశుడైవున్నాడు."

"హతోస్మి, హతోస్మి" అనుకున్నాడు శంకర్రావు. అనుకున్న అయిదు నిమిషాలకు స్కూలు ప్యూపిల్స్ లీడరు ధర్మమా అని గంట మ్రోగింది.

కుర్రాళ్లు విహంగాల్లా తుర్రుగున పారిపోయారు. టీచర్స్ రూముకు వెళ్లి, అక్కడ హెడ్మాస్టరు కళ్లపడడానికి మనస్కరించక శంకర్రావు తన చేతిసంచిని కూర్చున్న గదిలోకే తెప్పించుకున్నాడు. ఇంటికీ స్కూలుకూ ఒక మైలుదూరం వుండడంచేత మధ్యాహ్నానికి అవసరమైన ఉపాహారం సంచిలో వుంచి తెచ్చుకోవడం శంకర్రావు వాడుక. ఆ చేతి సంచీ శంకర్రావు పాలిటికి గారడీవాడి బుట్ట! అందులోనుంచి ఖాద్య పదార్థం లాంటి దేదయినా బయటపడవచ్చు. శంకర్రావు ఆత్రంగా సంచిలో చేయిపెట్టి చూచాడు. అతడి నాలుక పెదవులు మధురరసాస్వాదనకు తొట్రుబాటు పడ్డాయి అవి మల్ గూబా మామిడిపళ్ళు!

శంకర్రావు జేబులోనుంచి పేనాకత్తి పైకి తీశాడు. ఆప్యాయంగా పళ్లను స్పృశిస్తూ మొదట జీడిమాత్రం కోసపారవేశాడు. ఆ తర్వాత చాకచక్యంగా పైపొట్టు తీసి వేయడానికి ఉపక్రమించాడు. మెల్లగా గదితలుపులు తెరుచుకున్నాయి.

రవణయ్య గదిలో ప్రవేశించాడు.

రవణయ్యను చూస్తూ శంకర్రావు తెల్లబోయాడు.

రవణయ్య సరాసరి టేబిల్ దగ్గరికి వచ్చి రెండు చేతుల్లోనూ రెండు మామిడిపళ్ళు తీసుకుని శంకర్రావుకు ఎట్టఎదుట డస్కులో కూచున్నాడు.

కదిలితే పైనపడుతుండేమో నన్న భయంతో ఆకలిగొన్న వ్యాఘ్రంముందు చేతులుడిగి నిల్చున్న నిరాయుధుడైపోయాడు శంకర్రావు! అతడలా మిడిగ్రుడ్లతో ఓక్కరించి చూస్తుండగానే రవణయ్య చేతుల్లో టెంకలు మినహాగా పళ్ళు మటుమాయమై పోయాయి.

ద్వారంగుండా టెంకల్ని బయటికి విసరి రవణయ్య పైకిలేస్తూ "తిండిపోతు రెండు మామిడిపళ్లతో సరిపెట్టుకోగలడా మేష్టారూ! వాడి కాకలి ఎక్కువగదూ!" అన్నాడు.

కశాఘాతం తిన్నట్టు శంకర్రావు ముఖం పాలిపోయింది.

"మీరూ, మీఆవిడా కూడబలుక్కుని నాకు తిండిపోతని పేరుబెట్టి నాలుగేళ్లయిందా మేష్టారూ! గంపెడు అరటిపళ్ళలో రెండంటే రెండుపళ్లు తినటమే గదా నాతప్పు! అప్పటినుంచీ నాలుగణాలిచ్చి సంతకు పంపినప్పుడల్లా నే నేదో మింగి వూరుకుంటానని కదూ మీఅనుమానం? నిజమే. నేను తిండిపోతుని. నాకు రెండుపళ్ళు చాలవు ఆమిగిలిన పళ్లనుగూడా అలాగే వుంచండి ఓ లోటా నీళ్ళుతాగి యిప్పుడే వస్తాను."

రవణయ్య చరచరా బయటికి వెళ్లిపోయాడు.

* * *

ఆరోజు రాత్రి ఎనిమిది గంటలవరకు రవణయ్య పూరిపాకలో జరిగిన చిన్న సంఘటనతో ఈకథ సమాప్తమవుతుంది.

అన్నంతిని ఆరుబయట కూర్చున్న రవణయ్య భార్యను పిలిచి "చూశావా, నీకొడు కేం చేశాడో" అన్నాడు.

"ఏం చేశాడు?" నింపాదిగా ప్రశ్నించింది మంగమ్మ.

"సెలవు దరఖాస్తులో నాచేతసంతకం పెట్టించుకున్నాడు."

"మంచిపని చేశాడు. నువ్వింతకాలం చేసిన పొడిగం చాల్లే."

"ఊహూ. నావల్ల కాదు. ఇంటిదగ్గర నన్ను గోళ్ళుగిల్లుకుంటూ కూచోమంటా వేమిటి?" గద్దించాడు రవణయ్య.

"ఇంటిదగ్గర కూచోవద్దు. స్కూలుకెళ్లి తోటలో చల్లగా పడుకో. బా...గుంటుంది" అంటూ రాగం తీసింది మంగమ్మ.

"ఏమిటేమిటి!" రవణయ్య భార్యదగ్గరగా జరుగుతూ కంగారుగా ప్రశ్నించాడు. "వాడేమైనా చెప్పాడా నీతో?"

"అంతా చెప్పాడు. ఐనా నువ్వు స్కూలు జరుగుతుండగానే నిద్రపోయేవ! ఇదేం ఆగబోగమబ్బా!" మంగమ్మ ముక్కుమీద వేలేసుకుని ఆశ్చర్యం వ్యక్తం చేసింది.

"ఓ శేవ్ ఆగాగు! వాడు హెడ్మాస్టరు. నువ్వు వాడి తల్లివి. మీరిద్దరూ చేరి నాపైన సవారీ చెయ్యదలచుకున్నారల్లేవుంది! ఊహూ, అదేం జరగదు. అందుకే నేను సెలవుపెట్టేశాను తెలుసా?"

'ఇంతకుముందు తనచేత కొడుకు సెలవు పెట్టించాడన్నాడు. ఇప్పుడు తనే సెలవు పెట్టా నంటున్నాడు. ఇతగాడి మాటలెప్పుడూ ఇంతేగదా!' విసుక్కుంటూ లోపలికి వెళ్లిపోయింది మంగమ్మ.

# జన్ బౌద్ధము

శ్రీ వాసిరెడ్డి పార్థసారధి

హొనలులూ విశ్వవిద్యాలయంవారు ప్రాచ్య పాశ్చాత్య తాత్త్వికశాఖలు (Philosophy of East and West) అనే పత్రికను ప్రచురించు తుండేవారు. ఇది త్రైమాసిక వేదాంత పత్రిక. దీన్లో అంతర్జాతీయంగా తాత్త్వికరంగంలో మహామహులైన వారు తూర్పు పడమటిదేశాల తాత్త్వికసంప్రదాయాలను గురించి వ్రాసేవారు. జన్ బౌద్ధాన్ని గురించి చర్చించు తుండేవారు. జన్ బౌద్ధం ఆధునిక శాస్త్ర శోధనలకు నిలవకలిగినదని రుజువుచేశారు. డి. టి. సుజికి (D. T. Suzuki) జపాన్ జన్‌మహాసభాధ్యక్షుడు. ఈయన ఆంగ్లంలో జన్‌బౌద్ధాన్ని గురించి విపులంగా వ్రాశాడు. జపాన్ కళాశాలలో ఆచార్యపదవిలో వున్నాడు. జన్‌బౌద్ధానికి నేడు ప్రమాణపురుషుడు. జన్‌వ్యాసములను (Essays on Zen) 3 సంపుటములుగా వ్రాశాడు. వాటిలో జన్‌బౌద్ధాన్ని గురించి విపులంగా వ్రాశాడు. ఈయన జన్‌మీద ఇంకా అనేక గ్రంథములను వ్రాశాడు. ఆంగ్లేయులు, ఫ్రెంచివారు జన్‌బౌద్ధాన్ని గురించి అనేక గ్రంథములను ఆంగ్లములోను, ఫ్రెంచి భాషలోను వ్రాశారు. హంఫ్రీ క్రిస్టమస్ Humphrey Christmas ఆంగ్లపండితుడు. జన్‌బౌద్ధం శాస్త్రీయమైన సిద్ధాంతమని వేనోళ్ల శ్లాఘించాడు. ఇతను జపాన్‌వెళ్లి, జన్ మతములోచేరి, దీనిని స్వయంగాసాధన చేశాడు. ఇతను (Zen Buddism) జన్‌బౌద్ధం అను గ్రంథము వ్రాశాడు. జన్ నేటి శాస్త్ర చర్చకు అగ గలదని రుజువుచేశాడు. పాశ్చాత్యులు జీవితమును, సంసారమును వదలి వెళ్ళుటకు ఇష్టపడరు. జన్ సిద్ధాంతంలో సంసారమును వదలి సన్యాసమును పుచ్చుకోనవసరంలేదు. జన్ రసమయదృష్టి కలది. కడుపుబ్బ నవ్వుతూ, హాస్యమయజీవితం నెరపుతూ ఈ సాధన చేయవచ్చు. ఇంత రసదృష్టిగల తాత్త్విక సాధన లోకంలో ఇది ఒక్కటే.

చీనావారిలో టాంగ్ చక్రవర్తుల యుగం స్వర్ణయుగం. జపాన్‌లో 14 వ శతాబ్దంనుంచీ స్వర్ణయుగం. ఈ బంగారు పంటలు పండించినది జన్‌బౌద్ధం. చీనావారు చిత్ర రచనలలో కొద్దిగీతలలో గొప్ప అందమును చూపిస్తారు. జపానువారు కొద్దిమాటల పద్యంలో గొప్ప అర్థం, మాధుర్యం, ఇముడ్చుతారు. గృహాలంకరణలలోను దేహాలంకరణలలోను వారు విశిష్టమైన అందమును చేకూర్చారు. అధ్యాత్మికంగాకూడ ఉన్నతిని పొందారు. దీనికంతకూ ముఖ్యకారణం జన్ సంప్రదాయం. చీనావారు జపాన్‌వారు మన సోదరులు. భారతదేశంలో పుట్టిన బౌద్ధములో భాగస్థులు. మన పొరుగువారు. వీరు మహాయానశాఖీయులు. మహాయానమును నాగార్జునాచార్యులు ప్రపంచించారు. దీన్లో అనేక గ్రంథములను వ్రాశారు. ఈ గ్రంథరాజములన్నీ జన్‌బౌద్ధానికి మూల ప్రమాణాలు. నాగార్జునాచార్యులు తెలుగుబిడ్డ. వీరి విద్యలు మనదేశంలో రూపం లేకుండా పోయినవి. ఇవి చీనా, జపాన్, కొరియా, టిబెటు దేశాలలో బంగారు పంట పండించినవి. తెలుగువారము జన్‌బౌద్ధ సంప్రదాయాన్ని గురించి తెలిసికొనుట ముఖ్యము.

బౌద్ధమతం కొంతకాలం గడచినతర్వాత రెండు శాఖలుగా చీలింది. మహాయానశాఖ ఒకటి, హీనయానశాఖ రెండవది. మహాయానము ఉత్తర ఆసియాలోను, హీనయానము దక్షిణ ఆసియాలోనూ వృద్ధిపొందినవి. మహాయానములో జన్‌శాఖ ప్రధానమైనది.

రెండువేల సంవత్సరముల క్రిందటే, బౌద్ధము చీనాలో ప్రవేశించినది. కాని ఆరవ శతాబ్దము దాకా ఇది వృద్ధి కాలేదు. బౌద్ధమతంలో బ్రహ్మచర్యము సన్యాసము భిక్షాటన ముఖ్యం. చీనావారు హేతువాదులు, బలీయమైన మానవత్వం కలవారు. చీనావారిని తూర్పు ఆంగ్లేయులంటారు. చీనావారు, వారు కష్టించి, ఆర్జించి, జీవించవలెననీ, తమ పెద్దతనంలో

# జన్ బౌద్ధము

తమను పోషించుటకు సంతానం కావలెనని, వంశ వృక్షము శాశ్వతంగా వుండవలెనని కోరుకుంటారు. బ్రహ్మచర్యము, భిక్షాటనం వారికి రుచించలేదు. కనుక వారి పద్ధతులకు అనుకూలంగా బౌద్ధమును మార్చుకున్నారు. ఇట్టి మార్పే జన్‌బౌద్ధము. ప్రొఫెసర్ డి. టి. సుజికి, బౌద్ధమతం మీద చైనీయుల తిరుగుబాటే జన్‌బౌద్ధం అన్నాడు.

'జన్'కు మూలశబ్దం 'ధ్యాన్'. ధ్యాన్‌కు 'చ-అన్' చీనా అపభ్రంశము. 'చఅన్'కు 'జన్' జపాన్ అపభ్రంశము. దీనికి మూలపురుషుడు బుద్ధభగవానుడు. 'జన్'ను చీనాలో ప్రవేశపెట్టినవాడు బోధిధర్మ. బౌద్ధమతమునకు భారతభూమిలో 28 మంది ప్రధాన గురువులున్నారు. బుద్ధభగవానుడు వీరిలో ప్రథముడు. బోధిధర్మ చివరివాడు. నాగార్జునాచార్యులు, అశ్వఘోషుడు, వసుబంధు ఈకోటిలోనివారే. చీనావారికి 28 మంది ప్రధాన గురువులున్నారు. ఇందులో బోధిధర్మ మొదటివాడు. ఇతను దక్షిణ భారతదేశవాసి. కంచికాపురస్థుడు. ఆరవశతాబ్దంలో పల్లవులు ఇక్కడ రాజ్యం చేశారు. అప్పుడు ఆంధ్రులకు రాజధాని కంచి. బోధిధర్మ బోధలు తెలుగువారి తత్వముల వలె వున్నవి. ఇతను తెలుగుబిడ్డేనని నా నమ్మకము. ఇతను గొప్ప ఇంట పుట్టాడు. అప్పుడు ప్రజ్ఞతార అను బౌద్ధ పండితుడున్నాడు కంచిలో. ప్రజ్ఞతారవద్ద బోధిధర్మ నలుబది సంవత్సరములు బౌద్ధమతంలో శిక్షణ పొందాడు. ప్రజ్ఞతార నిర్వాణం చెందగానే బోధిధర్మ చీనాకు ప్రయాణం కట్టాడు. క్రీస్తు శకము 520 సంవత్సరములో చీనాలో ప్రవేశించాడు. అప్పుడు చీనా రాజధాని నాన్‌కింగు. 'వు' అనే చక్రవర్తి రాజ్యం చేస్తున్నాడు. బౌద్ధమతంలో గొప్ప ప్రజ్ఞాధురంధరుడు భారతభూమినుండి చీనా వచ్చాడని విన్నాడు. బోధిధర్మను నాన్‌కింగుకు పిలువనంపించుకుని సత్కరించాడు. తాను అనేక బౌద్ధమఠములను కట్టించానని, బౌద్ధమత గ్రంథములను చీనా భాషలోనికి తర్జుమాచేయించానని గొప్పగా చెప్పుకున్నాడు. కాని బోధిధర్మ చప్పరించాడు. అయితే బౌద్ధమత ముఖ్యధర్మం ఏమిటని చక్రవర్తి ప్రశ్నించాడు. శూన్యమని జవాబు చెప్పాడు. ఈజవాబే జన్ సాధనకు పునాదిరాయి. బోధిధర్మ ఎంత గూఢార్థంగా, వికటంగా చెప్పాడో, జన్‌కూడా అట్లా తయారైంది. జవాబు చీనావారికి ఒక విశ్వసందేశమైంది. దీనితో బోధిధర్మ ప్రథమగురువైనాడు. ఇతనివాక్కు ఎంత వికటంగా, గూఢార్థంగా వుంటుందో, ఇతనూ అట్లాగే వుండేవాడు. ఇతనికి కొద్దిగడ్డం వుండేది. సంస్కారం లేనివానివలె, పిచ్చివానివలె వుండేవాడు. ఇతను మాట్లాడేదిలేదు మాట్లాడితే, రాయి తీసుకుని విసిరినట్లుండేది. రూపంలో విలక్షణతవుండేది. ఇతని రూపం చిత్రకారులలో ఒకవిశిష్టమైన సంప్రదాయానికి ఆధారమైంది. ఇతనిని అనేకవిధాల, చిత్రిస్తుంటారు. ఏదో గూఢార్థము, సందేశము కనపిస్తుంటవి ఆ చిత్రాలలో. రూపంవలె ఇతనిజీవితంకూడా నిగూఢమైనదే. చక్రవర్తిదర్శనం తర్వాత, ఇతను పల్లెపట్టులకు వెళ్లాడు. షాలిన్ అనే మఠంలో తొమ్మిదివర్షములు సమాధినిష్ఠలో వున్నాడు. అప్పుడు ఒక కన్‌ఫ్యూషియన్ విద్యార్థి జ్ఞానార్థియై ఇతనివద్దకు వచ్చాడు. ఇతనిపేరు షెన్‌క్వాంగ్. కాని బోధిధర్మ ఇతనికి దర్శనమే ఇవ్వలేదు. ఈ విద్యార్థి ఆ మఠంముందు ఏడుపగళ్ళు ఏడు రాత్రులూ, మంచులో నానుతూ నిరీక్షించాడు. అప్పటికీ ఏజవాబూ రాలేదు. తన ఆకాంక్ష తెలుపుటకుగాను, ఇతను ఒక చేతిని నరికి బోధిధర్మునికి పంపాడు. ఈ మూల్యం గురుదర్శనం లభింపచేసింది. బోధిధర్మ దేనికిట్లు చేసితివని అడిగాడు. తనకు మనశ్శాంతి లేకుండా వున్నదనీ, శాంతి లభించునట్లు చేయమని ప్రాధేయపడ్డాడు. ముందు నీమనస్సును నాకు చూపించు, తర్వాత దానిని శాంతింపచేస్తానన్నాడు గురువు. ఇంత తనను బాధపెట్టే మనస్సును, తాను చూపించలేనన్నాడు. అందుకు గురువు తృప్తిచెందాడు. శిష్యునికి శాంతి లభించింది. ఇంతపరీక్షకు నెగ్గిన విద్యార్థి, జన్‌శాఖకు రెండవ ప్రధాన గురువైనాడు. అప్పుడు ఇతనికి హ్యూ-కే-కో అని పేరువచ్చినది. ఇతనికి బోధిధర్మ, లంకావతార సూత్రముల నిచ్చాడు. ఈ సూత్రములు జన్‌కు ప్రమాణములైనవి. ఇతని జీవిత మెట్టిదో, జీవితంనుంచి ఆయన నిర్గమనం కూడా అట్టిదే. ఈ మఠంనుండి ఆయన ఎవరికీ కనుపించకుండా హఠాత్తుగా వెళ్లాడు. ఈయన వృద్ధాప్యంలో వుండగా ఒకపాదుకను నెత్తిన వుంచుకుని, పడమటి ద్వారంగుండా ఎక్కడికో వెళ్లటం కొందరు చూచారు. అంతే లోకానికి ఈయనదర్శనం. వారే చీనా జపాన్ ప్రజల జ్ఞానతార, వారి ముఖ్య ప్రధానగురువు, మూడవగురువు సెంగుట్సాన్. నాల్గవగురువు టావోసిన్.

ఈయన క్రీ. శ. 580 నుండి 651 వరకూ జీవించాడు. ఈయన కాలంలో జన్ రెండుశాఖలుగా చీలింది జన్‌సిద్ధికి కోన్ (Koan) అను సాధనలున్నవి. ఇవి హేతువాదమునకు అందని చిత్రమైన సూత్రములు. ఈ కోన్‌సాధనల విషయమైవచ్చిన అభిప్రాయభేదములే, రెండుశాఖలు ఏర్పడటానికి కారణం.

వివేకానందులవారు ప్రపంచమంతా పిచ్చాసుపత్రి అని అన్నారు. బౌద్ధులు ప్రపంచమొక ఆసుపత్రి అంటారు. ఇందులో రోగులకు, కోరికలనే జబ్బులు వచ్చినవి. కోరిక ఒక మంటవంటిది. ఇది మానవుని నిలువునా తగులబెట్టుతూ వుంటుంది. ఇందువల్ల మానవునికి సుఖశాంతులు వుండవు. శాంతి పొందవలెనంటే కోరికలనే మంటలను ఆర్పివేయాలి. కోరికలు ఇంద్రియములకు పుట్టిన శిశువులు. పంచేంద్రియములవల్లనే సుఖమున్నదని మానవుడు భ్రమపడుతున్నాడు. కాని ఈ ఇంద్రియములు తమను మోసం చేస్తున్నవని జ్ఞానులు కనిపెట్టారు. ఇంద్రియములు కళ్లద్దముల వంటివి. నల్లటి కళ్లద్దములను పెట్టుకు చూచిన ప్రపంచమంతా నల్లగా కనుపిస్తుంది. ఎర్రద్దాలు పెట్టుకుంటే ఎర్రగా కనుపిస్తుంది. ఈ అద్దాలను తొలగించినగాని అసలురూపం కనుపించదు. ఇట్లే ఇంద్రియములు సత్యమును మరుగుపరుస్తున్నవి. ఈ ఇంద్రియాలవల్ల తెలియు జ్ఞానము సరియైనదికాదు. ఇదికాక వేరొక అవ్యక్తజ్ఞాన మున్నదని ఆధునిక శాస్త్రవేత్తలు కూడా నమ్ముతున్నారు. దీనినే సత్యమని, సచ్చిదానందమని, పరబ్రహ్మమని, బుద్ధత్వమని అంటారు. ఈ సత్యముతో సంబంధము పెట్టుకొనుటకు ఇంద్రియములు, కోరికలు అడ్డములుగా వున్నవి. వీటిని తొలగించి, పరబ్రహ్మముతో సంబంధము పెట్టుకొనుటే జన్. జన్‌సిద్ధియే నిర్వికల్ప సమాధి. ప్రపంచములోని అన్ని మతముల లక్ష్యము ఒకటే. కాని అందుకు దారులు భిన్నములు. ఇటువంటి దారులలో జన్ ఒక విశిష్టమైనదారి అవ్యక్తమునకు ఇదొక నిచ్చెన. ఒక సేతువు. ఇవతలి వడ్డునుండి అవతలి(పరము)వడ్డుకు ఇదొక గంతు. పరమనేది, అంచులులేని అఖాతము. ఇందులో దూకునప్పుడు వేరు రక్షణ లుండవు. ఒక్క మనస్సను గాలిగొడుగు (పేరాషూటు) మాత్రం కొంత కాపాడుతుంది. ఇదీ, ఆ దూకులో సరీగా విప్పుకుని సాధకునకు రక్షణ నివ్వాలి. లేనియడల సాధకుని మనశ్శరీరములు భగ్నమౌతవి. గమ్యస్థానం మనస్సున కందనిది. అందువల్లే దీనిని అవ్యక్తమంటారు. ఉపనిషత్తులలో కూడా బ్రహ్మము ఎట్టిదనే ప్రశ్నకు జవాబురాదు. జవాబు నిచ్చిన ఋషుల అతను తెలియనివాడే. ఇట్టిదే జన్ కూడా. జన్ ఇట్టిదని చెప్పుటకు భాష లేదు. కాని చంద్రుని వ్రేలితో చూపించునట్లు ఒకమాటలో చెప్పవచ్చు. అవ్యక్తమైనది కనుక వర్ణించుటకు గ్రంథములు చాలవు. చీనాలో 'టా' (Tao) ను గురించి ఒక సామెత వున్నది. 'మాటలతో చెప్పబడు 'టా', నిత్యమైన టా కాదు' టా, జన్‌కు అధిదేవత. కనుక జన్‌ను గురించి భాష లేదు. మౌనమే అది. దీనిని గురించి చీనాలో ఒక పద్యం వున్నది.

'అది కదులుతూ వుంటుంది, గ్రహించుట కది ఆగదు,
చూద్దామంటే కనుపించదు,
విందామంటే వినిపించదు,
కాని వాడుకొనుటకు, అది తరగని నిధి.'

జపాన్‌లో ఒక పద్యపు చివరి చరణం ఇట్లా వుంది.

'చేతిలో ఖడ్గం లేదు. మనోనిద్రయే ఖడ్గము'.

ఈ మనోనిద్రయే జన్.

ఇదే భారతీయుల అమనస్కయోగము. జన్ బౌద్ధం జీవితంనుండి పారిపొమ్మనదు. అది జీవితంలో ప్రవేశిస్తుంది. కాని మనస్సుతో సంబంధం పెట్టుకోక, అవ్యక్తముతో సంబంధం పెట్టుకో ప్రయత్నిస్తుంది. దానిచేతిలో సాధకుడొక పనిముట్టుమాత్రమే. ఇదే భగవద్గీత బోధించు నిష్కామ కర్మయోగము. గాంధీ మహాత్ముడు అసలైన జన్ సాధకుడు. కాని సాధనల విషయంలో చీనా జపాన్‌వారు విశిష్టసాధన లుపయోగించారు. వీటిని కోన్ (Koan)సూత్రములు అంటారు. కోన్‌లు 1700 వున్నవి. సాధకుడు అన్నిటినీ సాధన చేయ పనిలేదు. సాధకునిబట్టి వుంటవి. సాధకుల శిక్షణకు జన్‌మఠము లుంటవి. ఇక్కడ జన్‌సాధనలలో ఆరితేరిన మహామహులుంటారు-వీరిని, రోషీ అంటారు చీనావారు. గురువులని అర్థము. వీరు సాధకులకు శిక్షణ నిస్తుంటారు. సమయానుకూలంగా సలహాలిస్తుంటారు. సహాయపడుతుంటారు.

కోన్ లక్ష్యము, మనస్సును భగ్నపరుచుట. లేదా, భగ్నావరణస్థితిని కలుగజేయుట. కారణము

# జన్ బౌద్ధము

మనస్సుకు ఆధారము కారణం. ఈ ఆధారంతో మనస్సు నడుస్తుంటుంది. ఈ కార్యకారణరూపమైన ఆలోచనలు పనిచేయకుండా చేస్తవి కోన్ సాధనలు. కోన్ ఇట్లా వుంటవి: 'సన్నని మూతిగల సీసాలో ఒక కోడివున్నది. కోడి చావకుండా సీసాలో నుండి బైటికి రావాలి. సీసా చెడకూడదు. కోడి బైటికి వస్తుంది' దీనిని సాధకులు మననం చేస్తారు. అలావచ్చినట్లు మనస్సుకు నచ్చచెప్పుకుంటారు! కార్య కారణ జ్ఞానాన్ని పట్టుకు ప్రేలాడుతున్న మనస్సును, అవతలకు నెట్టుటే ఈ సాధనల లోగల ప్రయత్నము. ఇటువంటి వాటినే గురువులు సాధకులకు చెప్పుతారు. ఆకాశపు చివర ఎక్కడ, కాలము ఆరంభము ఎక్కడ అని అంటారు. ఆలోచించిన కొలదీ, సమాధానము దొరకదు. మనస్సును బంధ పారింపుట ముఖ్యము. అందుకు ఇలాటి ప్రశ్నలడిగి ఆలోచించ మంటారు. సాధకుడు అవసరమైనప్పుడెప్పుడైనా గురువును ప్రశ్నించవచ్చు. జవాబు ఆ సాధకుని మనోలక్షణమును బట్టి వుంటుంది. అడిగిన దానికి కారణం చెప్పక పోగా ఇంకా అగమ్యం చేస్తాడు, గురువు అగ్నిలో ఆజ్యంపోసినట్లు చేస్తాడు. ఒక్కొక్కసారి జవాబు మెరుపువలె వుంటుంది. కొందరు దీని వల్ల సిద్ధిపొందవచ్చు. ఏ ఆలోచనా లేకపోవటం, సరిపోతుందా అని ఒకసారి శిష్యుడు గురువును ప్రశ్నించాడు. దానిని కూడా పారవేయమన్నాడు గురువు. దీనిభావం గ్రహించిన శిష్యునికి సిద్ధి కలిగింది. కొందరి ప్రశ్నలకు ఫెడీమని దెబ్బకొట్టటం కూడా వున్నది. జన్ ఎటువంటి దంటే చేతిలో కర్ర మాపుతారు. కర్రతో కొట్టుతారు. సాధకుడు తెలివిగలవాడైతే అర్థం గ్రహిస్తాడు. చేతికర్రకు జీవం లేదు. కాని అది నడుస్తుంది. దానిని పట్టినవాని చేతిలో, అదొక పనిముట్టు, ఇట్టిదే జన్. జన్ అవ్యక్తమునకు పనిముట్టు వంటిది. నడుచుటే మనవిధి. ఇట్లు అంతరార్థములతో వుంటవి. జపాన్‌వారు జన్ యుద్ధక్రీడవంటిదిగా భావిస్తారు. యుద్ధంలో కత్తి పైనబడబోవునప్పుడు, ఆలోచనల వల్ల లాభంలేదు-తనూ కత్తివిసరాలి. లేనియెడల పైకత్తి అతని శిరస్సును ఛేదిస్తుంది. యుద్ధవీరునకు జయాపజయముల కోరికలుండకూడదు. ఇట్టివాడు జయించలేడు. జీవించుట మరణించుట రెండూ వక్కటే సాధకునకు. ఆలోచనలు లేకుండా యుద్ధం చేయుటే వీరుని విధ్యుక్తము. జన్ కూడా ఇట్లే జన్‌లో స్వార్థము, అహము ముఖ్యశత్రువులు. వీటిని విసర్జించాలి.

జన్ అద్దము వంటిది. అద్దము దానివద్దకు వచ్చిన వాటి నన్నిటినీ స్వీకరిస్తుంది. కాని దేనిని అది వుంచుకోదు. ఇట్టిదే జన్‌కూడా. జీవితంలో ఎదురైన దానిని స్వీకరిస్తుంది. కాని, అది తనదిగా ఎంచదు. దీనినే భారతీయులు తామరాకుమీద నీటిబొట్టువలె వుండాలంటారు. దీనిని అర్థంచేసుకుంటే, జన్ సాధన చాలావరకు బోధపడినట్లే, జన్‌సాధకులు ఏ ప్రమాణములను స్వీకరించపనిలేదు. వారికి పూర్తిస్వాతంత్ర్యముంటుంది. ఇష్టంలేనియెడల జన్ మందిరములను వదిలి వెళ్ళవచ్చు. సాధనను ఎక్కడైనా చేయవచ్చు. కాని గురువు అవసరము. గురువు ఎంత అవసరమని భారతీయులు భావిస్తారో చీనా జపాన్‌వారుకూడా అంత అవసరమనీ భావిస్తారు. జన్ కత్తిమీద సామువంటిది. కనుక చాలా అపాయకరమైనది. గురువు సలహా చాలా సహాయపడుతుంది. లేనియెడల, మంత్రసాని లేని, ప్రసవించు స్త్రీవలె వుంటుంది, సాధకునిస్థితి. జన్ సాధకులు నిత్యం కొంతకాలము ధ్యానం చేస్తుంటారు. మంత్ర, సూత్ర పఠనచేస్తుంటారు. పొలములలో వ్యవసాయముచేస్తుంటారు. నాగలి దున్నుతారు, కోతలు కోస్తారు, నూర్పిడులు నూరుస్తారు. మఠంలో ఊడ్పులు మొదలు అలంకరణవరకూ చేస్తారు. మంత్ర పఠన, ధ్యానాదులు ఎంత పవిత్రములో, దున్నుట, కోతగోయుట, నూర్పిడి నూర్చుట అంత పవిత్రములు. ఒకటి ఎక్కువా లేదు. ఇంకొకటి తక్కువా లేదు. జన్‌కు అన్నిపనులు పవిత్రములే. జన్‌కు యుద్ధంలో ఖడ్గమూ, మఠములో జపమాల సమానములు. 'అవ్యక్తము' మన చేతిలో పనిముట్టుగా భావించాలి. నమ్మాలి, అట్లు జీవించాలి. మఠములలో వీరికి శరీర మనో పరిశ్రమలను ఇస్తుంటారు. ఈ సాధనలలో సాధకునియందున్న అపరిశుద్ధమైన మనస్సు నిర్గమిస్తుంది. పరిశుద్ధమైనమనస్సు ఆ స్థానంలో ప్రవేశిస్తుంది. ఈ సమయం చాలా అపాయకరమైనది.

ఇంద్రియములు చాలా బలవంతములైనవి. ఇవి సాధకునకు త్వరగా, సులభంగా, స్వాధీనము కావు. వీటిని బోనుపెట్టి పెద్దపులిని పట్టుకున్నట్లు, సాధకుడు పట్టుకోవాలి. స్వేచ్ఛగా తిరుగుతున్న పెద్దపులి, బోనులో వుండ నిచ్చగించదు. అది బోనునంతటినీ, తనబలం వుపయోగించి, విరగతీసిపారవేయవలెనని ప్రయత్నిస్తుంది. ఇట్లే బోనులో చిక్కిన ఇంద్రియాలు సాధ

కునిమీద అతిగా విజృంభించి, ఊపివేయును. అట్టి సమయంలో సాధకునికి కూడు నీళ్లు వుండవు. నిద్ర అసలే వుండదు. ఇది సాధనలో చాలా క్లిష్టమైన కాలము. ఈ పరిస్థితులను గురువు కనిపెట్టుతూ వుంటాడు. అతను కొన్ని మార్గములను చెప్పి పరిస్థితినుండి దాటిస్తాడు. సాధకుడు గర్భిణీస్త్రీవంటివాడు. గురువు మంత్రసాని వంటివాడు. ఆ మంత్రసానివలె గురువు సహాయం చేస్తాడు. ఈ స్థితినిదాటిన తర్వాత అతనికి దివ్యజ్ఞానము కలుగును. దీనిని బౌద్ధులు బుద్ధత్వం అంటారు. అట్టి జ్ఞానము కల్గినవారిని 'తథాగతుడు' అని అంటారు. జన్ పరిభాషలో ఈజ్ఞానమును 'శటోరీ' అంటారు. శటోరీ జన్‌కు కొలత బద్దవంటిది. అతని సిద్ధి ఎంతవరకో ఇది చెప్పుతుంది. శటోరీ ఒక మెరుపువలెవస్తుంది. ఇది రెండుసెకండు లుండవచ్చు. ఇంకా ఎక్కువకాలంగూడా వుండవచ్చు. ఎక్కువకాలం వుండుటకు నిత్యసాధన కావాలి. శటోరీ మెరుపు మెరిసి మాయమైనట్లు అవుతుంది. ఈ సామ్యమే భాగవతంలో గోపికలకు కృష్ణభగవానుని గూర్చి చెప్పబడ్డది. భగవానుడు దర్శనమిచ్చి మాయమైపోతాడు. భగవానుని చూచిన కన్నులు ఇతరములను చూడ వొల్లవు. గోపికలు భగవానుని వెతకుటకు బయలుదేరుతారు. ఈస్థితినిగురించి పోతన్నగారు, నల్లనివాడు పద్మ నయనంబులవాడు కృపారసంబుపై జల్లెడువాడు... మల్లియలార మీ పొదలమాటున లేడుగదమ్మ చెప్పరే అని వ్రాశారు. ఆ పరంజ్యోతి పునర్దర్శనమునకై, చెట్లు, చేమలూ, వెదికారు గోపికలు. విలపించారు. బాధపడ్డారు. అట్టిది, ఆ దివ్యమంగళవిగ్రహము. ఇట్లే శటోరీ ఆకస్మికమైనది. అది వస్తుందని తెలియదు. సాధకునికి ఇష్టం వచ్చినప్పు డదిరాదు. దాని కిష్టము వచ్చినప్పుడది మెరపువలే వస్తుంది. ఇది ఆకస్మికంగా వస్తుందికనుక దీనిని ఆకస్మికవిద్య అంటారు. దీనిని ఒక్కసారి అనుభవించినవారు వదలలేరు. గోపికలు కృష్ణభగవానుని వెంటాడిన స్థితిలో సాధకులుంటారు. శటోరీ కొలత బద్దవంటిదని చెప్పాను. శటోరీ పూర్తిగా కలిగినప్పుడే పరిపూర్ణ జ్ఞానం కలుగును. లేనియెడల తెలిసీ తెలియనట్లుంటుంది. శటోరీ కలుగగానే అతను అవ్యక్తజ్ఞానము, ఆనందమూ పొందుతాడు. రసమయ జీవనం వస్తుంది. ఇతను అందరివలె శాసనబద్ధుడై జీవించుతాడు. కాని ఇతనిది, దివ్యజీవనము. రసమయ జీవనము. బుద్ధిసూక్ష్మత ఏర్పడుతుంది. శటోరీ మెరుపు వలె వచ్చినప్పుడు అతనికి తేజోవంతములైన అభిప్రాయములు కలుగుతవి. ఇవి మెరుపువలె అతని మనో వీధిలో మెరుస్తవి. కాని వీటికి తగిన సన్నివేశము లుండాలి కొందరకు. వాల్మీకులవారు క్రౌంచపక్షి ఆక్రందనం విన్నాడు. ఆ ఆవేదనవల్ల వాల్మీకులవారి అంతరంగంలో ఏదో మెరిసింది. అదివాగ్రూపంగా వచ్చింది. అదే శ్లోకమైంది. వాల్మీకులవారు ఆదికవి యైనారు. ఇట్లు అనేక సమయాలలో ప్రపంచ రహస్యములు మానవుల అంతరంగమున మెరసి అద్భుత పరచినవి. ఎందరు కాయలు చెట్టునుండి క్రిందకు రాలుట చూడలేదు. న్యూటన్ యాపిల్ పండు రాలుట చూచినాడు. అది అతనిమనస్సులో ఒక దివ్య సందేశ మునకు కారణమైనది. శటోరీ ఇట్లే వస్తుంది. దీనిని పొందినవారు అనేక చిత్రములను రచించారు. కవిత్వ మును చెప్పారు. వీరివాక్కు దివ్యవాక్కు. వీరిజీవితం అంతర్వాణి ప్రకారం జరుగుతుంది. టాంగ్ యుగంలో చీనావారు అనేక అద్భుత చిత్రములను చిత్రించారు. ఇవి ఒక విశిష్టస్థానమును సంపాదించుకున్నవి. కొద్ది గీతలలో చక్కని చిత్రమును గీస్తారు. అందులో ఏదో సందేశముంటుంది, ఎంతో అర్థముంటుంది. దివ్యత్వం వుంటుంది. మహాయానము ప్రజ్ఞ, కరుణ అను రెండు పాదములమీద నిలచింది. చిత్రకారులు కరుణను సమంత భద్రునిగాను, ప్రజ్ఞను మంజుశ్రీగానూ చిత్రిస్తారు. పూర్ణజ్ఞానమైన బుద్ధత్వమును బుద్ధునిగా చిత్రిస్తారు. సమంతభద్రుని ఏనుగుమీదను, మంజుశ్రీని సింహం మీదను, వీరిద్దరిమధ్య బుద్ధభగవానుని పద్మంమీద చిత్రిస్తారు. చిత్రకారులు ఈ చిత్రమును అనేకరకాల అద్భుతంగా చిత్రిస్తారు. బోధిధర్ముని చిత్రించని చిత్రకారు డుండడేమో, ఇతను పిచ్చివానివలెవున్నా అతనిలో దివ్యత్వం కనుపిస్తుంది. సందేశం వినుపిస్తుంది.

శటోరీ పొందినవారు జపాన్‌లో విశిష్టమైన కవిత్వం చెప్పుతారు. కొద్దిమాటలలో, గొప్ప అర్థం వుంటుంది. ఇవి రెండురకాలు. మొదటి మూడుపాదము లలో వుంటుంది. మొదటి పాదంలో 5, తర్వాత 7, తర్వాత 5 మాటలుంటవి. మొత్తము 17 మాటలు. ఈ పద్యములను హొక్కు, లేక హైకూ అంటారు. రెండవ రకములో 5 పాదాలుంటవి. మొదటి చరణంలో 5, తర్వాత 7, 5, 7, 7 పదములుండి మొత్తము 31 పదము లౌతవి. వీటిని టంకాలని, ఉటాలని అంటారు. జపాను శ్రమణకుడు, కవాగుచీ, టిబెటులో, వెండికొండలను

చూచినప్పుడు, వీటిని చెప్పాడు. జపాన్ వారికి ఇవి మహాప్రీతికరములు. వేమన్నగారి పద్యములవలె వుంటవి. ఈ పద్యములుగాని, చిత్రములుగాని అవ్యక్తమునుండి మెరిసిన మెరుపులు. వీటిని వేగంగా చిత్రిస్తారు. ఇందులో తప్పులుండవు. దిద్ద పనిలేదు. దివ్యవాక్కువలె వుంటవి. ఇవి ఆలోచనలనుండి వచ్చినవి కావు. సచ్చిదానందమునుండి వచ్చినవి.

సటోరిపొందిన తర్వాత గురువులుగా ఉండుటకు కొన్ని సాధనలు చేస్తారు. వీరు ఏకాంతంగా అడవులకు పర్వతాలకు వెళ్ళివుంటారు. మానవానీకము మధ్య మార్కెట్టులోనూ వుంటారు. ఇట్టి సాధనలైన తర్వాత వారికి పెద్దలు గురుత్వం ఇస్తారు. అప్పుడే వీరిని జన్ మందిరములలో చేర్చుకుంటారు 'రోషి' గా.

జన్‌కు కొన్ని సూత్రగ్రంథము లున్నవి. ఇందులో ప్రజ్ఞాపారమితలోని హృదయసూత్రము ముఖ్యమైనది. ఇది ఒక్కటే మంత్రము. దీనిని సాధకులు జపిస్తూ వుంటారు. ఈ మంత్రము కూడా విశిష్టమైనదే.

“గతే, గతే, పరగతే, పరసంగతే బోధిస్వాహా” దీని అర్థమిది. 'బుద్ధి వెళ్ళింది, వెళ్ళింది, అవతలివస్తువు (పరముకు) వెళ్లింది, అవతలి వస్తువ నిలిచింది, అనగా మనస్సనే ఇవతలివస్తునుండి, పరము నే, ఆ మనస్సుకు తెలియని, అవతలివస్తుకు బుద్ధి వెళ్ళిందని అక్కడ నిలిచిందని దీని అర్థము.

దీనిని ధ్యానిస్తుంటారు మహాయానశాఖీయులంతా. కాని చీనావారు సాధకులకు దీని అర్థమును ముందు చెప్పరు. తర్వాత రికి అర్థమవుతుంది. హుయ్యనిత్సాంగు భారతభూమికి బయలుదేరినప్పుడొక దివ్యవాక్కు వినిపించింది. కష్టములూ, అపాయములూ వచ్చినప్పుడు, ఈ మంత్రమును జపించమని ఆ వాక్కు చెప్పింది. అట్లే కష్టకాలములలో ఈ మంత్రమును హుయ్యనిత్సాంగు జపించి, ఇంటికి క్షేమంగా చేరాడు. ప్రజ్ఞాపారమితమను సూత్రము లున్నవి. ఇవి, జన్‌ను గురించి విశదంగా చెప్పతవి. ప్రజ్ఞ+పర+మిత. ప్రజ్ఞ అను అవతలివస్తుకు చేరుట ఈ గ్రంథనామముయొక్క అర్థము. జన్ గురించి గంథవ్యూహము వే గ్రంథమున్నది. గంథవ్యూహమనగా పుష్పాలంకరణ. ప్రజ్ఞాపారమిత గంథవ్యూహములకు నాగార్జునాచార్యులు భాష్యం వ్రాశాడు. ఈ భాష్యమును, అచింత్య విమోక్షు అంటారు. మనసుకు అందని మోక్షమని దీని అర్థము. 42 పరిచ్ఛేదములను సూత్రములుకూడా జన్ గురించినవే. రెండువేల సంవత్సరములనాడు చీనాలో ప్రథమంగా తర్జుమా చేయబడ్డ బౌద్ధసూత్రములివి. 6వ శతాబ్దములో, బుద్ధభద్రుడను నతడు, అవతంసశాఖా సూత్రములను ప్రవేశపెట్టాడు. ఇది జన్ శాస్త్రగ్రంథము. లంకావతారసూత్రములు, వజ్ర సూత్రములు కూడా జన్‌కు సంబంధించినవే. చీనా ఋషులు కూడా కొన్నిసూత్రములను చెప్పారు. వైలాంగ్ సూత్రము లిట్టివి.

జన్ మూలపురుషుడు బోధి ధర్మ. ఇతను ఇచ్చిన జన్ గ్రంథము లంకావతార సూత్రములు. చీనావారు వీటిని విశేషంగా పఠిస్తుంటారు. జన్ 6వ ప్రధాన గురువు హుయ్యనెంగ్. ఇతను వజ్రసూత్రములను వినటంతోనే బుద్ధత్వం పొందాడు. గంధవ్యూహములో పరలోకములనుగురించి చెప్పబడినది. ఇవి తేజోమయ లోకములు. ఈ లోకములను గంధవ్యూహము ధర్మధాతువులని అంటుంది. సాధకుడు అహంను నశింపచేయనిదే సిద్ధి కలుగదు. అహం నశింపగానే, ధర్మధాతువులో చేరుతాడు సాధకుడు. ధర్మధాతువు సమష్టి కుటుంబము వంటది. వ్యక్తిత్వము వుంచుకుంటూ సమష్టిలో చేరుతాడు. ఒక అద్దముముందు కొన్ని దీపాలున్నవి. ఈ దీపములు అద్దంలో వకచోట కనుపిస్తవి. కాని అవి వేరుగానే వున్నవి. ఇట్టే ధర్మధాతువు. వ్యక్తిత్వం వున్నా సమష్టిలో లీనమౌతాడు. ఇక్కడ ఒకరి శ్రేయస్సు అందరిదీ. ఇందుచేతనే సమస్తజీవుల శాంతిని మహాయానులు కోరుతారు. ఈ లోకములో అంతా వెలుగే. నీడ అనేది వుండదు. ఈ తేజస్సువైరోచన బుద్ధునినుండి ప్రసరిస్తుంది. మహాయానులు బుద్ధత్వముకొరకు కోరిక పుట్టుట, బోధిచిత్తమంటారు. జ్ఞానమునకై ఎవరికి చిత్తము కలుగునో వారే బోధిచిత్తులు. సాధనలో అనేక మెట్లున్నవి. బుద్ధత్వంపొందక పూర్వపు స్థితిని, బోధిసత్వమంటారు. ఈ స్థితిని పొందినవారిని బోధిసత్వులంటారు. బోధిసత్వులనగా జ్ఞానసత్వం గలవారని అర్థము. ధర్మధాతువులో 600 మంది బోధిసత్వులున్నారు. వీరు ప్రపంచంలోని బాధామయజీవు లందరికి, అదృశ్యంగా సహాయం చేస్తుంటారు. మహాయానులు కరుణ ప్రజ్ఞలను ముఖ్యప్రమాణములుగా స్వీకరిస్తారు. జీవులలో ఒక్కరైనా బుద్ధత్వం పొందకుండా వుండేయెడల వారి సహాయా

ర్థము, వారు పొందనున్న బుద్ధత్వమును కూడా విసర్జిస్తారు. ప్రతి మహాయాన మతస్థులు ఇందుకై ప్రతిజ్ఞ తీసికుంటారు. ప్రమాణములను ఈవిధంగా స్వీకరిస్తారు. ఇవి నాలుగు.

(1) లెఖ్కలేనన్ని ఎన్ని జీవులున్నా, వారిని రక్షించుటకు ప్రమాణము చేస్తాను

(2) ఎన్ని తీరని కోరికలున్నా, వాటిని నశింప చేయుటకు ప్రమాణము చేస్తాను

(3) ఎన్ని తరగని ధర్మాలున్నా, వాటిని పఠించుటకు ప్రమాణము చేస్తాను

(4) ఎంత అగమ్యంగా వున్నా, బుద్ధత్వమును పొందుటకు ప్రమాణం చేస్తాను"

మానవుడు పరంలో వున్న దేనికో ఇతను నీడ యని మహాయానులు భావిస్తారు. మానవుని దృష్టాదృష్టములు ఈ పరములో వున్న వస్తువునందే వున్నవంటారు. అక్కడ ఏవిధంగా నడిస్తే, ఇక్కడ అవిధంగా జరుగుతుంటుందని అంటారు. ఆ వెలుగుకు మానవుడు నీడయని వారి ఉద్దేశ్యము. దీనిని తెలుసుకోనుటె సాధన.

'కారల్ యూంగ్' నేటి మానసిక శాస్త్రవేత్తలలో గొప్పవాడు. ఇతను శటోరీ పొందినవారిని తాను చూచానని వ్రాశాడు. యూరపు దేశీయులలో నే శటోరీ పొందినవారిని, తాను ఎరుగుదు నన్నాడు. తనయొక్క రోగి ఒకామె శటోరీని పొందినది. ఆమె ఆ అనుభవమునుగురించి ఈ విధంగా వ్రాశాడు. "ప్రశాంతంగా వుండుటవల్ల దేనిని ఆటంకపరచకుండా వుండుటవల్ల ఏకాగ్రతతో వుండుటవల్ల సత్యాన్ని అంగీకరిస్తున్నందువల్ల ఉన్నదున్నట్లు ఉంచుటవల్ల (నేను కోరినట్లుగాక) అవ్యక్తమైన జ్ఞానం కలిగింది. నే నెన్నడూ ఎరుగని అవ్యక్తశక్తులు లభించినవి."

పూర్వకాలంలో కూడా అనేకమంది శటోరీని పొందినవా రున్నారు. పాల్ ఋషి తన చుట్టూ అవ్యక్తమైన కాంతిసముద్రం వున్నట్లు చూచాడు. మహమ్మదులవారు గ్రేబియల్ దర్శనం కలిగిన తర్వాత తేజోమయలోకములను చూచాడు. మహమ్మదులవారు చదువుకో లేదు. కాని జ్ఞానము పొందినవారౌటచే, వారన్న మాటలు పద్యములైనవి. ఇవి కురాన్ గ్రంథమైనవి.

ఆధునికులలో, డాక్టరు బక్కు ఇట్టి అనుభవములను పొందాడు. ఇతను చక్కని మోటారు బండిలో పయనిస్తున్నాడు. అతని చుట్టూ తేజోమయ మేఘం ఆవరించినట్లు కనుపించింది. దీనితో ఆయనకు అవ్యక్తానందము కలిగినది. కొందరు ఏ చక్కని వస్తువునో చూచినప్పుడు, ఇట్టి స్థితిని పొందుతారు. కొందరు విషాదమును చూచినప్పుడు పొందవచ్చు. అని హృదయాన్ని కదలించేవిగా వుండాలి. వాల్మీకులవారు క్రౌంచపక్షి ఆక్రందన వినగానే ఇట్టి స్థితిని పొంది శ్లోకమును నూతనంగా చెప్పి ఆదికవియైనాడు. యడ్వర్డు కార్పెంటరు బుద్ధవిగ్రహాన్ని చూడగా ఇట్టి అనుభవాన్ని పొందాడు. టెనిసన్‌కవి వలిగిన పుష్పమును చూచి ఇట్టి స్థితిని పొంది మధురమైన కవిత్వం చెప్పాడు. స్త్రీ దిగంబరత్వమును, చూచి వేమన్నగారిట్టి అనుభవాన్ని పొందారు. 'జన్‌బాద్ధం' గ్రంథకర్త హంఫ్రీ క్రిస్టమస్, జపానులో జన్ శిక్షణ పొందాడు. ఇట్టి స్థితులను మూడు పర్యాయములు పొందాడు. ఒకసారి (టర్కీబాత్) స్నానంచేసే నీళ్ళతొట్టిలో విశ్రమించగా పొందాడు. తళుక్కున మెరుపు కనిపించింది. ఇది కొన్ని సెకండులే వున్నది. 'బుద్ధిహీనుని వలె దానిని తెలిసికో ప్రయత్నించాను. కాని ఈలోగా అది పోనేపోయింది' అని అన్నాడు. డాక్టరు కన్నెతువాకరు తన రోగియొక్క అనుభవమును ఇట్లు చెప్పాడు. ఒకసారి ఆమె హఠాత్తుగా చప్పట్లు కొట్టటం ఆరంభించి దానితో అరవటం మొదలుపెట్టింది. అదుగో మీరు అర్థంచేసుకోలేరు. మీరు అర్థంచేసుకోలేరు. 'అదిగో విశ్వము, నేను చూచాను. నేను చూచాను. అబ్బా, నాలో ఏమి సుఖము, ఏమి సుఖము. ఏమి ఆనందము.' ఆనందము బైటనుండి వచ్చినదికాదు. అది లోపలే వున్నది.

'మాట్లాడే వాడికి తెలియదు,

తెలిసినవాడు మాట్లాడడు.'—ఇదే జన్.

---

* ప్రొఫెసర్, డి. టి. సుజికి వ్రాసిన Essays on Zen మూడు సంపుటములు, క్రిస్టమస్ హంఫ్రీ వ్రాసిన Zen Budhism, 1956 Mahabodi Annual ఆధారంతో వ్రాశాను.

# పార్టీలు: సత్యసాధన

ఆల్బర్ట్ కామూ



**హంగరీ విప్లవాన్ని సోవియెట్ ఎర్రసైన్యం అణచివేసిన అనంతరం, ఇటాలియన్ పత్రిక, 'టెంపో ప్రెసెంట్' (Tempo Presente), సంపాదకీయ వర్గానికి చెందిన యిద్దరు ప్రతినిధులు, ప్రసిద్ధ ఫ్రెంచి రచయిత అల్‌బర్ట్ కామూను (Albert Camus) కలుసుకుని కొన్ని ప్రశ్నలడిగారు. ఆ ప్రశ్నలనూ, జవాబులను ఇక్కడ పొందుపరుస్తున్నాము.**



ప్రశ్న :

పార్టీలు గాని, ప్రభుత్వాలు గాని, ఇతర యే వ్యవస్థలుగాని, సత్యసాధన పరమ లక్ష్యంగా వ్యవహరించుతాయని విశ్వసించటానికి యింకా ఆస్కారం వున్నదా? గుండెలమీద చెయ్యి వేసుకుని "శాంతి మండలి" అని చెప్పుకోవటానికి ఆస్కారమున్నదని మీరు విశ్వసించుతారా? లేక, అట్లాంటి ధోరణి కేవలం "ఆత్మద్రోహం" చేసుకోవటమే నని విశ్వసించుతారా?

ఈనాడు ప్రపంచంలో సత్యసంరక్షకుడనేవాడు ఎవడైనా వుంటే, ఆ సంరక్షకుడు, అలా అని చెప్పుకునేవాడూ, అలా అని చెప్పుకునే పార్టీ మాత్రం కాదు. ఎవడు అలా ఎంతగా డబ్బా వేసుకుంటూ వుంటాడో, అంత అబద్ధాలకోరనేది చారిత్రకమైన పరమ సత్యం. ఇలా చెప్పేవాడే, చివరికి ఆ సత్యాన్ని హత్యచేసే కసాయివాడుగా తయారవుతాడు. హంగరీలో ఒక 'పెద్ద అబద్ధం' సాగిపోతోంది. ఆ అబద్ధాన్ని ప్రతిఘటించుతూ పెద్ద విప్లవం బయలుదేరింది. అందుచేత ఆ 'అబద్ధాన్ని' ప్రతిఘటించిన విప్లవకారులనందర్నీ చిత్రవధ చేయవలసివచ్చింది. అనంతరం 'వాళ్ళందరూ ఫాసిస్టుల'ని, అంతకంటే మరో పెద్ద అబద్ధం చెప్పి వాళ్ళని అపనిందపాలుజేయటానికి ప్రయత్నించవలసివచ్చింది.

'శాంతిమండలి'కి సంబంధించినంతవరకూ — అణ్వస్త్రాలను బహిష్కరించాలంటూ, హడావిడిచేసి, స్టాక్‌హోమ్ ప్రకటనకు దస్కతులు పోగుజేసిన 'శాంతి కాముకుల'ను ఒక్క ప్రశ్న అడగవలసివుంది.

స్వయంచోదక అణ్వస్త్రాలు ప్రయోగించుతానని, ఇంగ్లండ్, ఫ్రాన్స్, ఇజ్రయల్ దేశాలను బుల్గానిన్ దబాయించాడు. దీనికి వీరేమంటారు? ఈ శాంతికాముకులు ఈ ప్రశ్నను తమకు తాముగా వేసుకోలేక పోతున్నారు. అందుచేత మనం వారిని అడుగవలసివస్తోంది.

సత్యసంధులమని చెప్పుకోవటానికి, నిజానికి, ఈనాడు, ఏ దేశానికీ ఎట్టి హక్కూ లేదు. ప్రాచ్య ఖండంలోని 'తటస్థ' దేశాల సంగతి కూడా అంతేనని మనకు ఇప్పుడు తేలిపోయింది. అరబ్ దేశాలూ (ట్యూనీషియా మినహా), ముఖ్యంగా భారతదేశం—గాంధీగారి భారతదేశం—హంగరీతోపాటు తమ స్వంత ధర్మసూత్రాలపట్ల నెరపుకున్న విశ్వాసఘాతుకంతో, ఆ దేశాలుకూడా మిగతాదేశాల స్థాయికే దిగజారిపోయినై. 'బాండుంగ్ మండలి' దేశాలు, యూరప్ జాతులలో అత్యంత ప్రధానమైన హంగేరియన్ జాతిని బానిసత్వం నుంచీ మృత్యువునుంచీ రక్షించటానికి ప్రయత్నించి.

వుంటే మహత్తరంగా వుండేది. వలసవిధానాలకు వ్యతిరేకంగా పోరాడుతున్న స్వతంత్రులైన యూరపియనుల కృషికి కృతజ్ఞత చూపినట్లయేది. కాని యీ బాండుంగ్ దేశాలు అత్యంత బాల్యదశలోనే శాక్యం నేర్చుకుని వాస్తవిక దృక్పథాన్ని అవలంబించాయి. నిజానికి రాజకీయాలలో చాలా త్వరగా వయసు మీరిపోతారు. అందుచేత ఈ కొత్తరాజ్యాలవారిని యికనుంచీ, వయోజనులుగానే పరిగణించి కేవలం వారి చర్యలనుబట్టి వారి గుణగణాలను పరిగణించుతూ వుండాలిగాని, ఎట్టి సామనస్యంతోనూ, ఎట్టి పక్షపాతదృష్టితోనూ వ్యవహరించవలసిన పనేమీ లేదు. నిజానికి 'హంగేరీ హత్యాకాండ'పట్ల ఆ దేశాలు ప్రదర్శించిన దృక్పథం క్షంతవ్యం కాదు. స్వార్థంతో కూడిన యిట్టి నిరీహ ప్రయోజనశూన్యమైనదని భవిష్యత్తు తేల్చివేస్తుంది. గతంలో పరపీడనవల్ల బాధపడిన కారణంగా వీరికి సంక్రమించిన నైతికబలాన్ని వీరు, ఇట్టే, కొద్ది రోజుల అవధిలో దుర్వ్యయం చేసేసుకున్నారు.

ఇక ఇప్పుడు ప్రపంచజాతులలో వున్నదల్లా రెండే రకాలు—యుద్ధోన్మాదులూ, అత్యంత యుద్ధోన్మాదులు. ఇటీవలి పరిస్థితినిబట్టి చూస్తే, అమెరికా కంటే రష్యాయే ఉత్కృష్ట యుద్ధోన్మాదాన్ని ప్రదర్శించుతోంది. ఏది ఏమైనా, సామ్యవాదం గాని, పెట్టుబడిదారీవిధానం గాని యేదైనా యుద్ధాన్ని సృష్టించగలవనే సత్యాన్ని, ఈనాడు ఒకరు చెప్పకుండానే, మనకు బోధపడుతోంది. యుద్ధానికి కావలసిందల్లా అధికారదాహం—ఈనాడు ఆ దాహం లేని దేశాలు ఏవీ లేవు—ఆయుధబలం లేని కారణంగా గతిలేక పడివున్న దేశాలసంగతి అది వేరు మాట. పాశ్చాత్యఖండంవైపు కేవలం పావురాయిలూ, ప్రాచ్యఖండంవేపు రాబందులూ ఎగురుతున్నట్టు కలలుగంటూ కూర్చునేవారి దృక్పథాన్ని వ్యక్తంచేయటానికి "ధర్మబాహ్యులు" అనేమాట చాలదు. ఇది గ్రుడ్డితనం—బానిస స్వభావం — పశుబలాన్ని అభినందించుతూ కూర్చునే నీతిబాహ్యత.

ప్రశ్న:

అయినప్పటికీ, వాస్తవిక సత్యానికంటే, రాజకీయమైన 'అవసరపరిస్థితికి' ఎక్కువ ప్రాధాన్యత నివ్వాలని మీ అభిప్రాయమా? అలాగయితే, అలాటి అవసర పరిస్థితి యేర్పడినట్లు, నిర్ధారణ చెయ్యటానికి గల ధర్మసూత్ర మేమిటి?

ఈ 'అవసరపరిస్థితు'ల విషయం ఆలోచించేటప్పుడు, దాల్లో, అసలు సత్యమనేది ఏ నిష్పత్తిలో వున్నదో పరిశీలించాలి. అలాటి పరిస్థితి ఏర్పడినప్పుడు దానివల్ల మనం నేర్చుకోవలసిన గుణపాఠాలేవిటి? ఇంతవరకూ అలాంటి పరిస్థితి ఏర్పడుతుందని మనం ఊహించలేకపోవటం ఎందుచేత? ఇంతవరకూ మనం పరమసత్యాలుగా విశ్వసించుతూ వచ్చినవాటిలో ఇప్పుడు తప్పు దిద్దుకోవలసినవేవి. ఈవిధంగా ఆలోచించాలి. అంతేగాని, వాస్తవిక సత్యాన్ని త్రోసిరాజని 'అవసరపరిస్థితి' సింహాసనమెక్కి కూర్చునే పరిస్థితికి మాత్రం అంగీకరించకూడదు. కమ్యూనిస్టులూ వారి అనుయాయులైన బుద్ధిజీవులూ చేస్తున్న పని యిదే. ఈ సాపేక్షవిధానం ఇలాగే సాగుతూపోతే ఇది విజ్ఞానాన్ని హత్యచేసి కార్మికపీడనకు దారితీస్తుంది. ఒక పత్రికగాని, ఒక గ్రంథంగాని, విప్లవధోరణిలో వున్నంతమాత్రాన అది సత్యసాధన చేస్తున్నట్టు లెక్కకాదు. సత్యాన్ని చెప్పటానికి ప్రయత్నించితే విప్లవవంచన కావటానికి దానికి ఆస్కారముంటుంది. సత్యం సాపేక్షమని వాదించటానికి ప్రతి ఒక్కడికీ హక్కు వుంది; కాని అంతమాత్రంచేత 'సత్యం' 'సత్యం' కాకపోదు. ఆకాశం గోధుమవర్ణంలో వున్నప్పుడు, అది నీలవర్ణంగా వున్నదనేవాడు, మాటలకు వ్యభిచారదోషం పట్టించి నిరంకుశత్వానికి రోడ్డు వేస్తున్నాడన్నమాట.

కాదారూ, అతని పోలీసువాళ్లూ, అతని చేతికింది హంతకుల ముఠా—వీళ్లు మినహా—మిగతా హంగరీప్రజలందరూ 'ఫాసిస్టులు' అని ప్రకటించటం, కమ్యూనిస్టు పత్రికకు అత్యవసరపరిస్థితి కావచ్చు. కాని అసలు సత్యం ఏమిటంటే; — జాతీయస్వాతంత్ర్యమూ, వ్యక్తిస్వాతంత్ర్యమూ అభిలషించిన, కార్మిక కర్షకులూ, విజ్ఞానవేత్తలూ కలసి మహత్తరమైన విప్లవం లేవదీసిన సంగతి మనం కళ్లారా చూచాం. నిజం చెప్పాలంటే, ఫాసిస్టులు ఎవరు? ప్రజావిప్లవాన్ని నాశనంచేసిన క్రుశ్చేవ్ ఫాసిస్టు, కాదార్ ఫాసిస్టు. వాళ్ల సోవియట్ అనుయాయులు ఫాసిస్టులు.

## పార్టీలు : సత్యసాధన

హంగరీలో సోవియెట్ జోక్యాన్ని, ఖండించి వస్తే ఖండించి, మళ్లీ మరుక్షణంలోనే, మన (ఫ్రెంచి) 'ప్రోగ్రెసిస్టు యుద్ధవాదులు', కమ్యూనిస్టు సోదరులతో చేతులు కలిపి పనిచేయాలని తమ సమావేశాలలో తీర్మానాలు చేయవలసిన 'అవసరపరిస్థితి' వారికి యేమి కలిగిందో, నేను అవగతం చేసుకోలేక పోతున్నాను. అప్పటికి మన కమ్యూనిస్టు సోదరులు ఇంకా హంగరీ విప్లవకారులను తిట్టిపోస్తూనేవున్నారు. హంగరీలో ఇంకా మనుషులను ఉరితీస్తూనేవున్నారు. (నిన్నగాక మొన్న ఒక 20 ఏళ్ల పడుచును ఉరి తీశారు.) అదేసమయంలో ఒక ఫ్రెంచి కమ్యూనిస్టు— 'అలాటిపరిస్థితే ఫ్రాన్సులోకూడా యేర్పడితే, హంగేరీలో మాదిరిగానే ఫ్రాన్సులోకూడా రష్యా జొరబడి, అలాంటి హత్యాకాండకు దిగే పక్షంలో, నేను అందుకు నిరభ్యంతరంగా అంగీకరించుతాను' అని బహిరంగంగా ప్రకటనచేశాడు. ఈ ప్రకటనతో దాపరికం లేకుండా సర్వం బట్టబయలయిపోయింది. దీనికంతకూ అర్థమేమిటి? ఈ యుద్ధవాదులకూ, ఈ 'ప్రాగ్రెసిస్టుల'కూ తాము ఎన్నడూ చూడని రష్యనులంటే అంత పిచ్చిప్రేమ వుందా? కాదు కాదు! ఫ్రెంచివారిలోనే ఒకవర్గమంటే వారికి ఆరని పగ. అది ఈ రూపంగా పరిణమించుతోంది—జనాన్ని మోసంచేసి హిట్లరుకు ఫ్రాన్సును అప్పగించింది ఆ రెండోవర్గమే. ఫ్రాన్సు అదృశ్యమైపోతే, అది మృత్యువాతబడేస్థితివస్తే—ఈ ఉభయ వర్గాల విద్వేష విషజ్వాలలతోనే నశించి పోతుంది

ప్రశ్న :

సరే! అలాంటి విషమస్థితి యేర్పడినప్పుడు, విజ్ఞానవేత్త అయినవాడు చేయవలసిన పనేమిటి? ఎలాంటి పరిస్థితిలోనైనా తన అభిప్రాయాలేమిటో తనకు తారసిల్లిన ప్రతివాడితో బహిరంగంగా వెల్లడించుతూ వుండటమే అతని కర్తవ్యమా? లేక, పరిస్థితులయొక్క తీవ్రస్వభావాన్ని గమనించి, ఈ దురాగతాన్ని ప్రతిఘటించగల బలమైన రాజకీయ పక్షం ఏమీ లేకపోవటం గురించి, తను చేయకలిగిందేదో చేయటానికి పూనుకోవలసి వుంటుందా?

విజ్ఞానవేత్తఅయినవాడు అతిగా మాట్లాడి కాలాన్ని ధ్వంసంచెయ్యటం ముందు మానివెయ్యాలి; ఒకటి, అలా మాట్లాడి మాట్లాడి అలసట పుట్టి ఆరోగ్యం చెడుతుంది. రెండు—అలా మాట్లాడుతూ వుంటే ఆలోచనా శక్తి నశించుతుంది. చేతనైతే సృజనాత్మకమైన నిర్మాణం ఏదేనా చేయాలి—ఆసృష్టి, వర్తమానకాలంలో చెలరేగిన సమస్యలముందు చుట్టలుచుట్టుకుపోకుండా నిలబడగలిగినదైతే. కాని కొన్ని కొన్ని ప్రత్యేక పరిస్థితులు యేర్పడినప్పుడు, (స్పైన్ యుద్ధం, హిట్లరు హత్యలు, స్టాలిన్ హత్యలు, హంగరీ తిరుగుబాటు—ఇలాంటివి). తను ఏ పక్షానికి చెందివున్నాడో బహిరంగంగా, నిర్మొగమాటంగా, ప్రకటించవలసి వుంటుంది. తెలివితేటలుపయోగించి గోడమీది పిల్లివాటంగా మాట్లాడి తప్పుకు తిరగటానికి ప్రయత్నించి లాభంలేదు. స్వాతంత్ర్య పరిరక్షణ కోసం త్రికరణశుద్ధిగా పోరాడ సిద్ధంగావున్నాననే విషయం విస్పష్టం చెయ్యాలి. వైజ్ఞానికవర్గాలు, కొన్ని కొన్ని సందర్భాలలో—ముఖ్యంగా, ప్రజాస్వాతంత్ర్యమూ, భావస్వాతంత్ర్యమూ సర్వనాశనమైపోతున్నప్పుడు, ఒక సంఘటిత శక్తిగా యేర్పడి కార్యరంగంలోకి దిగవచ్చు. హంగరీ విజ్ఞానవేత్తలు అలాచేసి చూపించారు. ఏది యేమైనా పశ్చిమదేశాలలోని మనవాళ్లకు మార్గదర్శకంగా వుండటానికి, ఒక్క మాటమాత్రం చెబుతాను. మానిఫెస్టో తరవాత, మానిఫెస్టో మీద, అసమ్మతి ప్రకటన తరువాత అసమ్మతి ప్రకటన మీదా, అర్థంపర్థంలేకుండా చేవ్రాళ్లు చేస్తూవుండటం చాలా అసహ్యకరమైన పని. దీనివల్ల మన పలుకుబడి నాశనమౌతుంది, మన అభిప్రాయాలకుండే విలువ మృగ్యమైపోతుంది. మనం అగౌరవంపాలు గావటానికి ఇదే ప్రధానకారణం. ఇలా మనచేత చేయించుతూ వుండటానికి నిరంతరమైన ఒత్తిడి వుంటూనే వుంటుంది. ఇది మనఅందరి అనుభవంలో వున్న సంగతే. దీనికి ఎదురుతిరగటానికి మనకు సాహసం వుండాలి. తరచు ఏకాకిగా కూడా ఇలా ప్రతిఘటించవలసి వస్తుంది.

ఈ అభిప్రాయాలను ముందుంచుకుని, సమైక్య కార్యక్రమానికి దోహదం చేయవచ్చు. కాని మన

వామపక్షవిజ్ఞానవేత్తలు, మనకు అందించబడుతున్న ఆదర్శాలను వాటివెనక చూపబడే హేతువాదాన్ని అత్యంత నిశితంగా పరిశీలన చేయాలి. ఇలా పరిశీలన చెయ్యక ఇప్పటికే అనేకమార్లు తప్పటడుగులు వేశాం. ముందు కూడా అలా జరగవచ్చు. నేటిదాకా మనం మద్దతు చేస్తూ వచ్చిన ఆదర్శాలూ, వాటివెనకవుండే హేతువాదం ఎలాంటివి? వీటిని శల్యపరీక్షగా పునర్విమర్శ చేసుకోవలసి వుంది. వాటిదారుణఫలితా లెలాంటివో, ఇటీవలి చారిత్రిక పరిణామాలలో మనకు స్పష్టంగా కనుపించుతున్నయ్. ఇలా ఆత్మశోధన చేసుకోగలగటం అసిధారా వ్రతంలాంటిది. ఏది యేమైనా, ఈనాడు మితవాద పక్షాలకంటే, వామపక్షాల పలుకుబడి పెరిగిందన్న మాట ఒప్పుకోవాలి. కాని వామపక్షం, వినాశబీజాలతో లుకలుకలాడిపోతోంది. మాటల కైగులో తన్ను తాను బంధించుకుంటున్నది. పదజాలపు ఊబిలో కూరుకుపోయింది. బూజుపట్టిన పాత సిద్ధాంతాలు వల్లె వేస్తూ వుండటంతప్ప, లవలేశ మేమీ సాధించలేక పోతున్నది. వాస్తవిక పరిస్థితులకు అనుగుణంగా శాస వాదికాలను నిర్మించుతున్నానని చెబుతూవుంటుంది, కాని వాస్తవికపరిస్థితులను అందుకునే కార్యక్రమంలో నిరంతర పరాజయం పొందుతూవుంటుంది. వామపక్షం ఇప్పుడు శ్లథబుద్ధి (Schizophrenia) అనే మానసిక వ్యాధితో తీసుకుంటోంది. సునిశితమైన ఆత్మవిమర్శతో చికిత్స చేసుకోవాలి. హృదయాన్ని, బలవత్తరమైన హేతువాదాన్ని ప్రయోగించాలి— ఆత్మాభినివేశం కొంతైనంత తగ్గించుకోవాలి. ఇలాటి ఆత్మవిమర్శన కార్యక్రమంలో చెప్పుకోదగిన అవధికి ముందుకు సాగలేకపోతే, సమైక్య కార్యాచరణ అనేది ఎట్టిదైనా ప్రయోజనరహితం కావటమేగాక, ప్రమాదకరంగా పరిణమించుతుంది. ఈలోగా విజ్ఞానవేత్త బాధ్యత ఏమిటంటే—రాజు దిగంబరిగా వున్నప్పుడు, దిగంబరిగా వున్నాడని చెప్పటం. అంతేకాని, భావావేశంలో అతను ఏవో మహత్తర దివ్యవస్త్రాలు ధరించి వున్నట్టు ఊహాగానం చెయ్యకూడదు.

ఏది యేమైనా, సాధనయోగ్యంగా ఉండగల ఒక వాక్యాన్ని చెప్పదలచాను: భవిష్యత్తులో ఎటి సమైక్య కార్యక్రమంలో పాల్గొనటానికైనా, ఈ దిగువ సూత్రాన్ని అంగీకరించి నడుచుకోవటం ప్రాథమిక ధర్మంగా వుండాలి.

ప్రతిపక్ష నిర్ధూమధామమై, ఏకపక్ష నిరంకుశత్వమై రూపొందే, నియంతృత్వం ఏదైనా తాను నిర్మూలించుతానని చెప్పే అనర్థాలన్నిటికంటే అనర కరమైనది.

సృష్టికర్తయైన పరమాత్మను విశ్వసించుతున్నామంటారు. అలాగే నేనూ ఒక విషయాన్ని పరమ సత్యంగా విశ్వసించుతున్నాను. ఎట్టి వైజ్ఞానిక సృజన రూపొందాలన్నా ఎట్టి సాంఘికవ్యాసంగం రూపొందాలన్నా పరస్పర మతభేదాలను బహిరంగంగా వెల్లడించుకోవటానికి సమగ్రమైన స్వాతంత్ర్యం వుండాలి. సమగ్రమైన స్వాతంత్ర్యం లేనిది ఏ 'కళా' లేదు. ఏ కళైనా తన సంప్రదాయాన్ని తను స్వతంత్రంగా ఏర్పాటు చేసుకుని రూపొందుతుంది. బాహిరమైన జోక్యం ఎప్పుడువస్తే అప్పుడు చస్తుంది. సామ్యవాదమంటే, ఉరికంబాలని అర్థంచెబితే తప్ప, స్వాతంత్ర్యం లేకపోతే సామ్యవాదం కూడా వుండదు.

# రెండు రెళ్ళు

'లసూనా'

పాత్రలు: రాజారావు, రామమూర్తి, కృష్ణశర్మ, డాక్టర్ సత్యమూర్తి, శశికళ, రిజిష్ట్రారు, ఒక జవాను.

## రంగము: 1

* * హాస్టలులో రాజారావు గది. ద్వారాని కెదురుగా గోడమీద రెండు సినీతారల క్యాలెండర్లుంటాయి. ఎడమవైపున క్యాంప్ కాట్ మీద, ఒక బెడ్ షీటు, రెండు దిండ్లు, చిల్లాకొల్లాగా పడిఉంటాయి. గదికి మధ్యగా ఒక టేబిలు, రెండు వైపుల రెండు కుర్చీలు, కొంచెం దూరంలో ఒక వాలుకుర్చీ ఉంటాయి. టేబిలుమీద, చదువుతూ మూసిఉంచిన పుస్తకం, రెండు వార పత్రికలు, సిగరెట్టు డబ్బీ, అగ్గిపెట్టె, ఆష్ ట్రే ఉంటాయి. కుడివైపునున్న షెల్ఫులో పుస్తకాల వరుసలు, నోట్సులు, పై అరలో ఓ బిగ్ బెన్ గడియారం ఉంటాయి. గడియారంలో ఎనిమిదవుతూంటుంది...

రాజారావు: (వాలుకుర్చీలోనుంచి లేస్తూ, నిద్రమత్తు వదిలిపోయేలా గట్టిగా సిగరెట్టు పొగ నోమారు లాగి, పారేసి, టూత్ బ్రష్ చేతిలోకి తీసుకుంటుంటాడు.)

రామమూర్తి: (సన్నగా ఈలవేసుకుంటూ ప్రవేశిస్తూ) హల్లో! గుడ్ మార్నింగ్...రాజా గారిప్పుడే లేచారల్లేవుంది!

రాజా : గుడ్ మార్నింగ్...రాత్రి ఎందుకనో చాలా ప్రొద్దుపోయేవరకు నిద్రపట్టలేదురా ... బ్రదర్!...కూర్చో...

రామ : అవునులే, నిద్రపట్టేరోజులా ఇవి! (కుర్చీలో కూర్చుంటూ) నీవేమో ఆరాధ్య సుందరి నూహించుకుంటూ అర్ధరాత్రిదాకా జాగారాలు చేస్తూ, అపరాహ్ణందాకా కలలు కంటూంటావు...గట్టిగా మూడురోజులన్నా లేవు ఎలక్షన్లు ... అవతల సత్యంగాడు, అన్నం నీళ్ళు మాని అహర్నిశలు ప్రచారం చేసుకుంటూ, ఆ కాస్తా కొట్టేసి కూచుంటాడు ... ఎందుకొచ్చిన సోంబేరితనంరా ఇది!

రాజా : పోనిస్తూ......వెధవ డైరెక్టరు గిరి...వచ్చేదుందా...చచ్చేదుందా...నా గొడవల్లో నే నేడుస్తుంటే!

రామ : అంతమాత్రానికి నామినేషను దాఖలు చేసి మమ్మల్ని రంగంలోకి దింపిం దెందుకురా! నీవే నీళ్ళుగారి కూర్చుంటే, మాకెందుకోయి ఈ వృథాశ్రమ...

రాజా : అది కాదురా...బ్రదర్! నిన్న మా నాన్నగారి దగ్గర్నించి పిడుగులాంటి వార్త వచ్చిందోయ్...మతి తిరిగిపోతోంది...ఈ మధ్య ఆయనకి నా పెళ్ళిగొడవొక్కటే పట్టుకున్నట్లుంది...ఎవళ్ళో అయిదు వేలు కట్నంలో పిల్లనిస్తామన్నారట. పిల్ల ఆయనకు నచ్చిందట...ఇక నా అంగీకారం కోసం కాచుకూచున్నాట్ట!

రామ : అన్నీ కలిసొస్తున్నా యన్నమాట...గుడ్... ఇటు డైరెక్టరు గిరీ...అటు గృహస్థాశ్రమం ...ఇందులో మతిచెడటానికేం ఉందోయ్!

రాజా : మతి...మన్ను...నీ వొకడివి...రామాయణమంతా విని సీతేం గావాలనే ప్రబుద్ధుడివి!

రామ : ఓహో...సారీ! శ్రీవారి ప్రణయకలాపం మాట మరిచాను. మరి చెప్పవేం! (ఆలోచన నభినయించి) మీ నాన్నగారికి రాసెయ్యి... "ఇట నొక యువతీ లలామంబుతో జరుగుతున్న లావాదేవిలో హృదయంబు లిచ్చి పుచ్చుకొన నిర్ణయించితిని...యిక వేరు సంబంధంబు వలద"ని...గొడవే ఉండదుగా.

రాజా : ఏడిసినట్టే ఉంది! నీ సలహా... ఆ కాస్త పని జేశానంటే కానీ రాదోయ్ నాన్నా... ఇంటిదగ్గరనుంచి... ఆ తర్వాత ఆనర్సుకు తిలాంజలి...అబ్బాయిగార్కి అత్తయపాత్ర తోడవుతుందని గదుటోయ్!

రామ : ఓహో... అదా సంగతి... అలా అయితే సెకండియర్ ఎలాగూ అయిపోయింది గదా! ఇంకొక్క సంవత్సరమే గదుటోయ్!... ఎండాకాలపు సెలవుల్లో వచ్చి పిల్లను చూసుకుని, ఆనర్సు పూర్తయ్యాక ఆ కాస్త అభ్యంతరం తీర్చుకోవచ్చని వ్రాసెయ్యి...ఓ ఇంటెరిమ్ రిప్లయి అన్నా పడిఉంటుంది... ఈలోగా మనవ్యవహారం మనం చూసుకోవచ్చు...వీలునుబట్టి ఆలోచించుకోవచ్చు. ఆచరించవచ్చు (రాజారావు చెవులో ఏదో చెపుతాడు) ఏమంటావు?

రాజా : ఆరి పిడుగా! అసాధ్యుడివిరా...పర్మినెంట్ బ్యాక్ బెంచరువైనా భలే వ్యూహాలు పన్నుతావురా...

రామ : మరేమనుకున్నావోయ్ మాంధాతా! బ్రతుకు బాటలలో బహుముఖ ప్రజ్ఞావంతులంతా బ్యాక్ బెంచర్సుగా ఉన్నవారేనోయ్! పెట్టేనా—పోషించేనా—ఈ బ్రతకలేని అభాగ్యుల డిగ్రీలన్నీ...కీన్సు థియరీలు కంఠస్థం జేసినా, ఐన్‌స్టీన్ సిద్ధాంతాలు ఆకళించి నెమరేసినా ఆ పర్సనల్ రిజిష్టరు పుటల్లో అన్నిటికీ తిలాంజలి ఇచ్చుకోవాల్సిందేనా...అందుకే అన్నారు...... తిరక్ష చెషితాడని మగవాడు...అనుభవం... బ్రదర్...అనుభవం...రెండేళ్ల జీవితానుభవానికి, రెండొందల పుస్తకాల విజ్ఞానం కూడా బలాదూర్...

రాజా : వెధవ్యాసుడూ, నువ్వూను...కాని...నాకో అనుమానం వేస్తోందిరా......ఒకవేళ నీ వ్యూహమే సరైందనుకో...

రామ : నాన్సెన్సు...నూటికి నూరుపాళ్లను...

రాజా : అలానే బాబు...మరి ముందీ ఎలక్షన్ గండం దాటి బయటపడాలి...అనుకున్న కార్యక్రమమంతా సవ్యంగా సాగాలి...అటుపైనైనా అసలు వ్యక్తు లూరుకుంటారనే నమ్మకం ఎలారా?

రామ : అక్కడే నాకు విసుగు పుట్టిస్తావు...శకునపక్షి...ఒక అడుగు తర్వాత మరోటి వేస్తావా? అంతిమ ఫలితాన్ని గురించి అప్పుడే అంత ఆవేదన పడితే ఎలా మరి? పురుష ప్రయత్నం ఉండాలిగదా...అటుపైని జయాపజయాలు దైవాధీనం అన్నారు...అయితే నా షరతులు కొన్ని ఉన్నాయి...అంగీకరిస్తావా...మరి!

రాజా : అసలేమిటో బయటపెట్టు......అంగీకారం తర్వాత...

రామ : ఆ పప్పులేం ఉడకవోయ్...భాయీ! ఈ ఘటందగ్గర...అంతగా నన్ను నమ్మలేక పోతే...పోనీ...మధ్య నాకేం...

రాజా : అది కాదురా...నమ్మకాలు...చింతకాయలూను...శక్తికి మించిన వాగ్దానాలు... తర్వాత ప్రతిజ్ఞాభంగాలు...ఎందుకా అని?

రామ : అదేం లేదు బ్రదర్...నన్ను నమ్ము...ఎవరికీ ఎలాంటి ద్రోహం జరుగదు...సరా?... కాకుంటే కొంచెం శ్రమపడాలి...అది నా కొదిలెయ్యరాదూ...

రాజా : కానివ్వరా బాబు...కానివ్వు...కడుపులో కాసిని కాఫీనీళ్లన్నా పడలేదు...నీ షరతులు మంజూర్...

రామ : అలా అయితే...విను...ఒకటి......ఎలక్షనులో మనం నెగ్గేవరకు, మరేం చేసి

చింతలు లేకుండా మాతోబాటు ఘట్టిగా పని చెయ్యాలి...ఇది మన ప్లాన్‌లో ప్రథమాధ్యాయం...నిశ్చింతగా విజయం మన కవుతుంది...అయినా ముందుజాగ్రత మంచిది గదా...రెండు...విజయం మనది అన్న ప్రెమిసెస్ మీద ఆధారపడ్డ రెండో ఘట్టంలో, ఎప్పుడైనా, ఎలాంటిదైనా నీ ప్రేయసి సహాయం కావలసిన స్థితి తప్పకుండా సాధించే భారం నీవు వహించాలి...ఆఫ్ కోర్సు...అమ్మాయితో నేను చెబుతానులే ... మూడు, ... సందర్భోచితంగా నానుండి నీవు వినెడి పలుకులను,మరో చెవికి... ఆఖరికి...అయిన వాళ్లకు గూడ...అందించకుండా ఉంటానన్న హామీ...

రాజా : ఇంతకీ...అసలీ సహాయం ఎందులో? ఎలా? ఎప్పుడు? అన్న సంగతులోయ్...

రామ : బ్రదర్ ! అంత ఆత్రమైతే ఎలారా...అవకాశం వచ్చినప్పుడల్లా అవన్నీ చెబుతానుగా.. ముందు మొదటి మెట్టు దాటనీవోయ్...

రాజా : ఓరి... నీ అసాధ్యం గూల...మళ్లీ ఎంతలో ప్లేటు ఫిరాయింపోయ్...

రామ : నాకు తెలుసుబాబు...ప్లేటు ఫిరాయించే లేకపోతే, ఈ ఫీటులో ఎక్కడో చల్లగా జారిపోతావ్...చివరికి తిరిగి మమ్మల్ని వేధించుకు తింటావు...మనకు తెలీని సరుకయితేగదూ...మూడో రకం మనుష్యులూ, మన స్థైర్యాలూ...!

రాజా : మొదలెట్టావూ...ఉపన్యాసం...ఇక చాలుగాని...రెండు నిమిషాల్లో వచ్చేస్తా...అలా కాఫీనీళ్లుపోసుకుని శర్మగాడింటి కెళదాం పద...రెండు రోజులనించీ వాడి దర్శనమే లేదు ... ఏ దేవగాంధారిలోబడి దివ్యలోకాల్లో విహరిస్తున్నాడో?...

రామ : నిన్న సాయంత్రం గణపతి విలాస్‌లో కనపడి, ఉదయం పోస్టలు కొస్తానన్నాడురా... కానివ్వు మరి...ఈలోగా నీ ముస్తాబు (రాజారావు, టవల్ భుజాన వేసుకుని నిష్క్రమిస్తాడు) (రామమూర్తి టేబిలుమీది తెలుగు వారపత్రిక పుటలు తిప్పుతుంటాడు)

[కృష్ణశర్మ ప్రవేశం]

కృష్ణ : (షుమారు 26 వయస్సు ఎర్రగా, బక్కపల్చగా, లాల్చీ, గ్లాస్కోపంచె ధరించి, నోట్లో వయ్యారంగా సిగరెట్టుతో, ఒక చేతిలో వారపత్రికతో ప్రవేశిస్తాడు) హల్లో...మూర్తీ...కొంచెం లేటయింది...సారీ...(వాలు కుర్చీలో జేరగిలబడుతూ) గుడ్ న్యూస్...వీక్లీలో మన గేయం ఒకటి పడిందోయ్! (పేపరు తీస్తూ, రాగయుక్తంగా చదువుతుంటాడు)

"నీలాల నింగిలో
నీరాగరంజనీ
తూగు టుయ్యాలదేవి..."

రామ : (విసుగ్గా) ఆ!...తేలినట్టే ఉంది మనపని... మునగబోతూ మేం ఏడుస్తుంటే...

కృష్ణ : నాన్సెన్సు ... ఇంతవీక్లింగ్స్ ఏం రా... ఇలాతలంలో ఈ శర్మచేతిలో కలంచిందులు త్రొక్కుతుండగనే ... అంతటి ఉపద్రవమేనిటిరా!

రామ : కాక మరేనిటోయ్...ఒక్కడికీ చీమకుట్టినంతమాత్రం లేదు...అవతల సత్యంగాడి ప్రాపగాండా విన్నావుగాదూ ... ప్రతి రూముకు ఓ అరడజను మార్లన్నా వెళ్లి కాళ్ళావేళ్ళాపడి ప్రార్థిస్తున్నాట్ట... చతుర్విధోపాయాలతో...ఇక్కడ ఒక దార, తీవిగా బారెడు ప్రొద్దెక్కినా ప్రక్క వదలకపోతే, మరోదార మన్నుదిన్నపాములా.. ఓ వేళ ఎంతఅభిమానం, స్నేహం ఉన్న వాళ్లయినా, మర్యాదకైనా వెళ్లి ఓమారు 'మీఓటు, దయతో మాకివ్వాల'ని అనకపోతే ఎవడిస్తాడురా...ఇది ఎవరింట్లో సంబరమని?

శర్మ : ప్చ్...ఇంతేగదా! బ్రదర్...వాల్యూ తెలియని వెర్రబ్బాయిలనుకోకు మనవాళ్లింతా ...అయినవేళా కానివేళా పోయి వాళ్లని హంగామా చేసేకంటే, మంచిసమయంలో ఒక్క హెచ్చరిక చాలోయ్...మనల్ని ఉద్ధరించడానికటోయ్...వాళ్లు మాపే గౌరవం, అభిమానం, కామయ్య, పుల్లయ్య పుత్రుల

మనిగాక, కళాకారులమని...గుర్తించుకో! ...లభిస్తొందోయ్...మనవాడి కళాభిరుచి, అనుభవం, ఆదర్శం అన్నీ పొందుపరచి రెండు గీతాలు కూడా రాశానోయ్... అన్నట్లు...మనవాడు పాంప్లెట్స్ ప్రింటు చేయిస్తాడుగా ఇవ్వాళ...పనిలోపని రెండోవైపున ఆ రెండు గీతాలు తగిలించేస్తే సరి... సమ్మోహనాస్త్రంలా పనిచేయవూ...లేదంటావు...సాయంత్రానికో చిన్న ప్రోగ్రాం ఏర్పాటుచేయి...అవి అలా ఊదేశామంటే, అందరికీ కొంచెం హుషారొస్తుంది!... ఏమంటావు!

రామ : ఇప్పుడు కావల్సింది పని. ఊకదంపుకాదు ...అవతల వాళ్లు చూడు...వాళ్లు జిల్లాల వాళ్లని, నల్గురుస్నేహితుల్ని వెంటేసుకొని, ఆయాజిల్లాలనుంచి వచ్చిన విద్యార్థుల్ని కలుసుకుని, ఒప్పందాలు చేయిస్తున్నాట్ట ...ఊహించుకుంటూ వాడు...వాయించుకుంటూ నువ్వూ తయారయితే ఇక, ఓట్లు వచ్చినట్టే...డెమోక్రసీ బ్రదర్...ఇది మరిచిపోకు ... సంవత్సరానికోసారన్నా, బ్రతిమలాడించుకోకుండానే పట్టుమని ఇస్తారనుకోకోయ్...అందులోను అన్నీ తెలిసిన విద్యార్థి సోదరులు...నావొక్కడే గొడవ ...పని ప్రారంభించామంటే, పొల్లు పోకుండా, సర్వశక్తులు ధారపోసిఅయినా 'భళీ' అనిపించుకోవాలి...

శర్మ : మూర్తీ! మనకు, అంటే, నాకనుకో, అదృష్టం వక్రించి, ఆ ఎలక్షన్ పదవులేవీ లభ్యమవవుగాని, ఆ పరమాత్ముడిచ్చిన 'సిల్వర్ టంగ్' వల్ల, అంతో ఇంతో సోదరుల ఆదరణ ఉందోయ్! అందుకనే గదటోయ్ అంతధైర్యం...ఈ కళాత్మక జగత్తులో రాజాగాడికున్న అనుభవానికి, ఆదర్శాలకు, నా గాంధర్వసుందరిని తోడుచేసి, కళా సరస్వతికి, ఈదఫా కనకాభిషేకాలు జరుపగల మనే మొండిధైర్యం ఉందోయ్...! అయితే మహాపకడ్బందీగా సాగుతోందంటావు అవతలి ప్రాపగాండా...అయినా...ఒట్టిట్రాష్ (ఫిలాసఫర్ మూడ్‌లో) కళా పిపాసువులకు, కట్టడు లేవిటి? జిల్లా లేవిటి? పొలిటికల్ ఫీల్డులో ఎలాగూ వీరవిహారం చేస్తున్నాయి సరే...మన శాఖవాడు, మన కులంవాడు, మన తాలూకావాడు, మన జిల్లావాడు ...ఈ మన, మన ... అభిమానాలన్నీ... సాహిత్య, సాంస్కృతిక రంగాల కింకా ఈ చెదపురుగులు ప్రాకలేదనే విశ్వాసం నాలో సడల లేదోయ్! ఒక వేళ చేరినా అవి ఎక్కువకాలం బ్రతుకవులే!

రామ : ఆ ... అలాగే అనుకుంటూండు ... విశ్వాసాలు, విశ్వాసాల తీరుగానే ఉంటాయి... విషయాలు, విషమిస్తూనే ఉంటాయి!... నోట మాట్లాడుతూ, నొసట వెక్కిరించే రోజులోయ్ ... అయినా నాతో కూడిన వ్యవహారం...మన కృషి మనం చేస్తే, ఫలితం సంగతి తర్వాత...

శర్మ : తథాస్తు ... బ్రదర్ ... తథాస్తు...(లోపలికి వస్తున్న రాజారావును చూసి) పదవోయ్ మరి ...గడప దణ్ణాలకు... గజాననుణ్ణి తల్చుకుంటూ! (రాగయుక్తంగా) శుక్లాంబరధరం విష్ణుం శశి ... (అంటూ లేవబోతుంటాడు).

రాజా : (నవ్వుతూ, అదిరిపడేలా శర్మ వీపున చరుస్తూ) ఏడిశావు ... పద...ఆ సంగీతదర్శకత్వమేదో సంపాదించాక సప్తమంలో మొదలెడుదువుగాని!

[తెర]

## రంగము: 2

* * పార్కులో ఒక వేపున...రకరకాల జంతురూపాల్లో చక్కగా కత్తిరించబడిన పచ్చతీగెల బొమ్మలు అక్కడక్కడ పొడుగాటి బెంచీలు, వాటిమీద ఒకరిద్దరు జంటలు దూరంగా కన్పిస్తుంటారు. పచ్చటి గడ్డిమీద

పసిపాపలు ఆడుకుంటుంటారు. ఫౌంటెన్‌నుంచి ఉవ్వెత్తుగా పైకి లేచి ఒంపుగా, ఒయ్యారంగా వాలిపోయే తెల్లటి నీటిధారలు అందంగా ఉంటాయి. అస్తమయ సూర్యకాంతుల్లో అత్యంత సుందరంగా ఉంటాయి రంగు రంగుల పూలతో పూల మొక్కలు... ఒక బెంచీమీద శశికళ ఏదో పత్రిక పుటలు తిప్పుతూ కూర్చుని ఉంటుంది...)

రాజా : (ప్రవేశిస్తూ) హల్లో...గుడ్ ఈవెనింగ్ శశీ!

శశి : (చిరునవ్వుతో) గుడ్ ఈవెనింగ్...అండ్ కంగ్రాచ్యులేషన్స్...మిస్టర్ డైరెక్టర్...

రాజా : థాంక్స్...హార్టీ థాంక్స్...(బెంచీ మీద కూర్చుంటాడు.)

శశి : చాలు...చాలు ... ఒట్టి విశేషణాలేనా ... గట్టి పార్టీ ఏదైనా...

రాజా : ఎన్ని పార్టీలిచ్చినా...నీవు పడ్డ శ్రమకు ఋణం తీరదు...శశీ...

శశి : బాగుంది...ఈ స్తోత్రపాఠం ఎప్పట్నుంచి?

రాజా : స్తోత్రం కాదు శశీ...సత్యం...నిజంగా, దాదాపు మొత్తంగా మీ మహిళా లోకపు ముప్పై అయిదు ఓట్లు పడకపోతే, కంగ్రాచ్యులేషన్స్‌కు బదులు, కన్‌సొలేషన్స్ చెప్పాలి సొచ్చేది...ఎలాంటి పోటీ!...పదిహేను ఓట్ల మెజారిటీలో బయట బడేసరికి బ్రహ్మప్రళయం అయిందనుకో...ఏం ఉత్సాహంగా పని చెయ్యండే!...మా నాన్నొకడు—ఉన్నన్నాళ్లూ ఊరుకుని, సరిగా సమయానికి నా బుర్ర చెడగొట్టేశాడు...

శశి : (పత్రిక పుటలు తిప్పుతూనే) మధ్యలో మీ నాన్న గొడవ లేమిటి?

రాజా : సారీ...మర్చిపోయాను శశీ...నా పెళ్ళి విషయంగురించి మా నాన్న గారొక ఉత్తరం వ్రాశారు...అయిదు వేల కట్నంట...పిల్ల, సన్నగా, ఎర్రగా, అందంగా ఉందట, ఆయనకు నచ్చిందట...నచ్చిమెచ్చి వెంటనే నా అంగీకారం తెలియజెయ్యమంటూ వ్రాశాడు...

శశి : గుడ్...చెప్పావు కాదేం మరి...అయిదు వేల కట్నంతో అపరంజి బొమ్మలాంటి అతివ లభించడం...ఇక్కడ ఈ ఛాన్సు...అక్కడ ఆ ఛాన్సు...డబుల్ లక్ తగిలిందన్నమాట...మరి ప్రయాణం ఎప్పుడు?

రాజా : బాగుంది...నీ వేళా కోళం...ఆయన కలా జవాబివ్వాలి అని నేను సతమతమవుతుంటే.

శశి : ఉన్నాడుగా మీ విదూషకుడు...అతనేం సలహా ఇవ్వలా...

రాజా : అదీ అయింది...వాడికంతా తమాషా...వ్యవహారం కొన్నాళ్లదాకా వాయిదా వేసే మార్గం చూడమంటాడు...ఈలోగా ఏదో వెలగబెడ్తాడట...నన్ను ఉద్ధరించడానికి...ఏవిట్రా అంటే...ఏవేవో కప్పదాటు సమాధానాలు...ఈలోగా మా నాన్నగారి దగ్గర్నించి రిమైండరు...ఇరుకున పడిపోయింది శశీ మన పరిస్థితి...

శశి : మన అంటే ..ఓహో గౌరవవాచకమా?

రాజా : గౌరవ వాచక మేమిటి...గోడెగడ్డలు. ఉభయ జీవుల సంగతీనూ...సరే గాని శశీ...ఈ సమస్యాపరిష్కారం ఏదన్నా తలపోస్తున్నావా...నిజం చెప్పు...

శశి : ఏ సమస్య...ఏం పరిష్కారం...

రాజా : (నవ్వుతూ, శశి బుగ్గనైపు చేయిపోనిస్తూ) రాజా రాణీలపెళ్లి సమస్యని తెలవనట్టు—గడుగ్గాయివై పోతున్నావు...

శశి : ఓహో...అలా చెప్పరేం సూటిగా...ఆర్నెల్లు చాలంటారు వీరి గుణాలు, వారి కబ్బటానికి...మూడేళ్లు దాటవస్తున్నాయిగా...మరి...

రాజా : సరేగాని...సీరియస్‌గా అడుగుతున్నాను...చెప్పు శశీ...

శశి : అవునుగాని... 'సీరియస్'గా చెబుతున్నాను...అదే అంతుచిక్కడం లేదని...

(కొన్ని క్షణాలాగి) నిజం రాజా...నాకేం పాలుపోవటం లేదు...మా నాన్న పరిస్థితి... తల్లీ తండ్రీ తానేయై పెంచి పెద్దచేశాడు... విద్యాబుద్ధులు నేర్పించాడు...నా కోసం సర్వస్వం అర్పించడానికైనా వెనుదీయడు.. కాని మనవిషయంలో మాత్రం ఆయన కంత పట్టుదల ఏనిటో నా కర్థంగావటం లేదు...ఏం చెయ్యమంటావు చెప్పు...నా రక్తంలోని ప్రతి అణువున ప్రతిబింబిస్తున్న పితృవాత్సల్యం ఓ వైపు...ప్రతి క్షణంలో ప్రతిధ్వనిస్తున్న జీవితకాంక్ష మరోవైపు... త్రిశంకు స్వర్గంలాఉంది నా పరిస్థితి...ఈ బాధలిలా ఎన్నాళ్లనుభవించాలో, ఎలా ఓదరికి చేరాలో తెలియక కొట్టుకుంటున్నాను...

(అనురాగంతో ఆమెకు దగ్గరగా వచ్చి కూర్చుని) తెలుసు శశీ...నాకూ తెలుసు... ఈ అనేకత్తెర బాధలు...అప్పుడుమాత్రం... ఆత్మాభిమానంకూడా లేక, చిన్న పిల్లాడిలా మా నాన్న కాళ్ళమీదబడి, పాతిపట్టింపులు మాని వెళ్ళి మాట్లాడి వస్తాననేదాకా లేవ లేదు...పాపం, ఆయన నామాట కాదన లేక...లోకానికి విరుద్ధంగానే అయినా... పిల్లగలవాళ్ళయింటికి తానుగావెళ్ళి, బ్రతిమాలి, బామాలి; భంగపడివచ్చాడు...ఆ పాతక్రోధాల మాత్సర్యం ఎంతకూ వదిలితే గదూ మీ నాన్నని...నీవూ వినిఉంటావు... అవమానభారంతో తిరిగివచ్చి, నన్ను నాలుగు చివాట్లూ పెట్టాడు, ఇంటికి రాగానే ... అహ...పోనీ ఏదైనా గొప్ప కారణం ఉంటే అదో మాదిరి...ఆస్తులు దోచుకున్నారా!...హత్యలు చేసుకున్నారా! అంటే అదిలేదు...వెనుక ఇళ్ళసరిహద్దు తగాదాలు, మశ్యని, ఇంతగా మనసులు విరిచేయాలా అని...మన దురదృష్టం గాక పోతే!...ఎందుకు వీళ్ళ జీవితానుభవం, చదువు, సంస్కారం ... తగలెట్టనా ... "కోర్టుకీడ్చింది చాలక, కన్నకడుపుకు కోత పెట్టాలని చూస్తున్నావా, పో,పో," అంటూ విదిలించి పారేయాల్సినంతటి అన్యాయం ఏం జరిగిందని ? పదిమందికి చెప్పగల వాడు...చదువుకున్నవాడు ... ఆయన నోటంట ఆమాటలంత తేలిగ్గా వస్తాయని ఎవరైనా అనుకోగలరా ?

శశి : (ఆవేదన వ్యక్తపరుస్తూ) ఎందుకు...రాజా, తల్చుకున్నకొద్దీ హృదయం తరుక్కుపోతుంది...తీరిపోయేమార్గం దొరక్క తికమకలపాలవటం మినహా...అంతేకాదు, ఆయన ధోరణిమాస్తే, నా చదువు పూర్తయేదాకా, నా పెళ్లి విషయం తలపెట్టేలా లేదు...... మరో ఆడదిక్కులేని అభాగ్యజీవితం...... నాకు నేనై పెళ్లివిషయం ఆయన్ని ఎలా అడగాలి ? ఏమని అడగాలి ?...ఈ బాధలన్నీ వినవవుసరం లేకుండానే తొలగిపోయింది చల్లనితల్లి...అవధిలేని ఆశలతో, అంతులేని ఆత్మవ్యథతో, అమ్మపాదాలదగ్గర విలపించని రోజులేదు...అన్నీ నిశ్చలంగా వింటుంది... ఏదారి చూపించదు ... ఏంచెయ్యను...ఈ దిక్కుమాలిన బ్రతుకు బ్రతికేకంటే...... (కళ్లనీళ్లు గిర్రునతిరుగుతాయి—తలప్రక్కకు తిప్పుకుంటుంది.)

రాజా : ఛీ.....అలా దిగాలుపడితే ఎలా (ఆప్యాయంగా,) చూద్దాం...ఏనాటికైనా మంచి రోజులు రాకపోతాయా...ఈఆవేశంలో ఏ అన్యాయానికీ ఒడిగట్టనని ప్రమాణం చెయ్యి......అనుభవించేది రెండు ప్రాణాలన్న సంగతి మరువకు ... ఇలా చూడు (ఆమె తలను తనవైపుకు త్రిప్పుకుంటూ)... వెన్నెలలాంటి నీ వదనంలో విషాదరేఖలు చూడలేను శశీ...ఏదిఏమైనా. సంతోషంగాని, దుఃఖంగాని, ఈ రెండు ప్రాణాలు సమానంగా పంచుకోగలవు శశీ...ప్రమాణపూర్వకంగా...ఈ పచ్చని ప్రకృతి కవిత తోడు...సరేనా...ఊ...ఏదీ, ఒక్క చిరునవ్వు...చల్లని వెన్నెల్లా, మెల్లని మలయ పవనంలా...ఏదీ...ఒక్కసారి......(కపోలము స్పృశించబోతాడు.)

శశి : ఇష్...మరీ చిలిపి వాళ్ళైతున్నారు... జరిమానాలు చెల్లించుకోవాల్సి ఉంటుంది... ఇక్కడ...జాగ్రత!

రాజా : ఓస్...ఇంతేనా ... జన్మకైదీసైనాసరే... నీతోపాటు...

శశి : అన్నట్టు, ఈ సంవత్సరం, మన కాలేజి వార్షికోత్సవాలు లేవేమిటి? అంతా కొత్త దొంతవం గాబోలు!

రాజా : లేకేం ... ఆ భారం నా నెత్తినబడ్డదిగా... కమిటీ మీటింగ్‌లో కార్యక్రమం వెయ్యడం ... ఉపక్రమించడం ... అధికారికంగా మీ నాన్నగారి దర్శనం చేసుకోవాలి, త్వరలోనే...ఫంగ్సు ఏరన్నాఉన్నాయో. లేదో ... రామమూర్తి నిన్న సాయంత్రం నుంచే మొదలెట్టాడు ...... ఏవో వెరైటీ ఎంటర్‌టైన్‌మెంట్స్, ఏకాంకికలు, లైట్ మ్యూజిక్‌లు, ట్విస్టింగ్ డ్యాన్సులు అంటూ...ఓ లిస్టు తయారుచేశాడు...... అన్నట్టు శ్రీ...వారి సహాయ సంపత్తులు కావాలట...ఎంతవరకు లభిస్తాయో! వాడి కెక్కడలేని ఉత్సాహంగాఉంది ... మణి పూసల్లాంటి, ఐటమ్స్ పెట్టాలని...... వెర్రెక్కిందంటే ఒక పట్టాన వదిలే ఘటం గాదు......వాళ్ళ శ్రీమతిచేత భరతనాట్యం కూడా ఒకటిపెట్టిస్తాడట...మరి మా శ్రీ... వారి పాత్రేమిటో! నిజంగా శశి...ఈదఫా స్టేజిఎక్కాల్సి ఉంటుందేమో!తప్పదుసుమీ!

శశి : నీకూ, నీ స్టేజికీ ఓనమస్కారం... నేనేం తార నవక్కర్లేదు గాని...ఇలా ఉండి పోనిద్దురూ!

రాజా : అబ్బే! లాభంలేదు... రామం అప్పుడే పాత్రల్ని ఎన్నుకుని, పోర్షను వ్రాయడం మొదలెట్టి ఉంటాడు, వాడి లక్షణం చూస్తుంటే...నిజంగా శశి ...ఈఎలక్షన్లలో వాడు పడ్డశ్రమ, ఓపిక ... నాకు లేవంటే నమ్ము ... ఏ విషయంలోనైనా తల దూర్చాలేగాని, తీరళ్లా చూచేంత వరకు నిద్రపోని ఘటం ... ఈదఫా సాంస్కృతిక కార్యక్రమాల్లో మణి పూసల్లాంటి ప్రదర్శన లివ్వాలని మహా తాపత్రయ పడుతున్నాడు ... పేరుకు డైరెక్టరు నయినా, ఆ ఓపిక నాకు లేదుగనా అని విచారించాల్సి ఒస్తోంది... నా ప్రత్యర్థి సత్యనారాయణచేత ఓ వేషం వేయించే దాకా వదలడట ... నన్ను వెళ్ళి ఆతని నాహ్వానించమన్నాడు ... ఆతడు అంగీకరిస్తాడా అని నాఅనుమానం నేను వెళ్ళి బుచ్చేసిరికి, ఇంకేం కస్సుమని నామీదికి లేచాడు ... 'ఇవేంకత్తులు కట్టిన కోడి పందాలా' అంటూ...పరేరా బాబూ వెడతా నన్న దాకా వదలండే ... త్వరలోనే రిహార్సలు మొదలెట్టాలట ... పీడోక్కలు విందుల తర్వాత రెండుమూడు రోజుల కార్యక్రమం తయారు జేశాడు...ఇంకోటి ఈ కార్యక్రమాలన్నీ మీ నాన్నగారి అధ్యక్షత క్రింద జరిపించాలని వాడి పట్టుదల... అవుస్లే, ఫస్టక్లాసుకోసం పన్న వ్యూహం పన్నుతున్నట్లుంది ఇప్పటినుంచే మీ సోదరుడు...

శశి : మరే....పాపం...వస్తే వద్దంటారు గాబోలు తిమరు మాత్రం ... ఎవరి దగ్గరా... ఈ కోతలు!

రాజ : అదుగో...అప్పుడే వెనకేసుకొస్తున్నావన్న మాట ... అయినా ... మీ నాన్నగారు! నాకు! ఫస్టుక్లాసు ... ఇవ్వకపోతే...: అంటూ...సంభవిస్తే!... హాతోస్మి...రవి, చంద్రులు గతులుదప్పి, సాగరా లుప్పొంగి, సకల ధారుణి తమస్సు...

శశి : చాలు... చాలు... ఇదేం స్టేజిగాదు...తమ తమస్సులు ఉషస్సులు...ఉట్టినే వృథా జేయకండి ఇప్పుడే ... (చేతిగడియారంవైపు చూసుకుని) ... అరె ... ఏడుదాటి పోయింది... ఇవ్వాళ చివాట్లు తప్పవు, నాన్నగారు క్లబ్బునుంచివచ్చేసి ఉంటే... వెడతామరి... గుడ్‌నైట్ ... (తెర)

## రంగము: 3

* * మామూలు నాటకానికి సరిపడేలా ఒక స్టేజి అమర్చబడి ఉంటుంది... నల్లటి తెరమీద, తెల్లటి అక్షరాలతో 'ఎస్. వి. కళాశాల-వార్షికోత్సవములు' అని వ్రాయబడి ఉంటుంది.

ఒక కంఠం: (తెరలోనుంచి) సోదర విద్యార్థి ప్రేక్షక మహాశయులారా! నిశ్శబ్దంగా ఉండమని ప్రార్థన. అనివార్య కారణాలవల్ల అనుకున్న వేళకు కార్యక్రమం ప్రారంభించటం పడలేదు—క్షమించ ప్రార్థన...మరో రెండు నిమిషాల్లో ప్రారంభమవుతుంది—దిన దిన ప్రవర్ధమానమౌతున్న మన కాలేజీ పదిహేనవ వార్షికోత్సవం జరుపుకుంటున్నామని తమకందరికీ తెలుసు ... (ప్రేక్షకులవైపునుంచి...ఒక కంఠం) తెలిసిన విషయం తమరు తెలవియ్యడం దేనికండీ! (నవ్వులు) (తెరలోనుంచి తిరిగి) ఈ మన కార్యక్రమాలకు అధ్యక్షత వహించడానికి, దయతో అంగీకరించిన మన ప్రిన్సిపాల్ డా॥ సత్యమూర్తిగారికి, కమిటీ తరఫున, విద్యార్థుల తరఫున కృతజ్ఞత లర్పిస్తున్నాం. (ప్రేక్షకుల వైపునుంచి కరతాళధ్వనులు) ... రెండుగంటలనుంచీ ఎంతో ఉత్సాహంగా మీ రందరూ పాల్గొని, మా కార్యక్రమం జయప్రదం చేస్తున్నందుకు కెంతో కృతజ్ఞులం. ఈనాటి కార్యక్రమ సూచిక అందరికీ పంచిపెట్టబడిం దనుకుంటాను...అయినా మరో మారు మనవిచేస్తాను...ఈరోజు "అపోహ" అన్న ఏకాంకిక ప్రదర్శించబడుతుంది... రచన,—శ్రీరామమూర్తి; నేపథ్య సంగీతం-శ్రీ కృష్ణశర్మ; నిర్వహణ-శ్రీ రాజారావు... ఇందు పాల్గొనువారు:—రఘుపతి-శ్రీ రాజారావు; వెంకటేశం - శ్రీ సత్యనారాయణ; జానకి—కుమారి శశికళ; రిజిష్ట్రారు—శ్రీ వరసింహారావు; జవాను—శ్రీ సుబ్బారావు.. (గంట మ్రోగడంతోటే తెర తొలుగుతుంది)

రఘుపతి: (వాలుకుర్చీలో కూర్చుని, పేపరు చదువుతుంటాడు.)

వెంకటేశం: (విసుగ్గా స్టేజిమీద అటునుంచి యిటు పచార్లుచేస్తూ)...వెర్రి ఆదర్శాలు వల్లిస్తూ అందివచ్చిన సంబంధం కాలదన్నుకోవడం మూర్ఖంకాక మరేమిట్రా?...లోక సంస్కారం అంతా మన ఒక్కళ్ళనెత్తినే పడ్డట్టు మహా... ఇదొకసాకు దొరికింది, ఈ కాలపు అప్రాచ్యులకు...చదువు పూర్తయిందాకా వివాహం ఒద్దనిభీష్మించుకోవటం!...పూర్తట.. పూర్తి ...ఎప్పటికి పూర్తి. ఎంతటికని ఆ మహాసాగరంలో... అనిగ్రహం ఆ సాంతం ఉండేదుస్తుందా అంటే అదీలేదు. మధ్యలోనే ఏ మిస్సులగాలి సోకడంతోటే, బూడిదలో పోసిన పన్నీరులా బుస్సున, వంశగౌరవం, పేగు ప్రతిష్ఠలు, పెద్దల సలహాలు మంట గల్పడం...ఏవీ అక్కర్లేదు...ఒక్క ప్రేమ గానం తప్ప...ప్రేమట...ప్రేమ... మాకంతా పెళ్లిళ్లు కాలేదా... పెళ్ళాన్ని, పిల్లల్ని ప్రేమించుకోవడం లేదా...కరినోసటనే ఈ ప్రేమ పొద్దుపొడిచింది గాబోలు...(రఘువైపు చూస్తూ) విన్నేరా! పెంకివేషాలు మాని, సాయంత్రం బండి కన్నా బయలుదేరు. అయ్యయ్యో! ఏం అమర్యాద...ఇది మూడోసారి... పాపం ప్రతిదఫా ఏవో కారణాలు చెప్పడం...పిల్లను చూచి వచ్చేందుకే ఇంత రభసయితే ఎలారా

రఘు : (పరధ్యానంగా ఉన్నట్లు నటిస్తూ) ఆ...... ఏమంటున్నారు?...సాయంత్రం ప్రయాణమా... ఎక్కడికి, ఎందుకు? ఎన్నిమార్లు చెప్పాలండీ నాన్నగారు...నాకు సంబంధించినంతవరకు ఇదివరలోనే చెప్పాను గదా...వాళ్ళిస్తామన్న ఆరువేల కట్నము, నావద్ద ఆరుగంటల్లో హారతి కర్పూరంలా ఆరిపోతుంది... ఇక నాకిష్టంలేని పిల్లను మెడకు తగిలించుకొని ఊరేగుతూ, నే నవస్థ పడటం, ఆ అమ్మాయిని అన్యాయముగా బాధపెట్టడం నాకేం ఇష్టంలేదండి...ఇక

జానకి విషయం... ఆమెకెన్నడో మాట ఇచ్చాను...నా కన్నివిధాలా తగిన సహచారిణి అని నిర్ణయం చేసుకున్నాను. ఇది నా జీవితానికి సంబంధించిన సమస్య గాబట్టి, నాపాటికి నేను నిర్ణయాలు చేసుకున్నాను. ఇందులో మిమ్మల్ని కించపరచే ఉద్దేశ్యం లేదు సరికదా, ఉదార హృదయంతో మమ్మల్ని ఆశీర్వదించమని వేడుకుంటున్నాను...

వెంక : ఏమంటున్నావ్! ఆశీర్వదించాలీ...హారతులెత్తొద్దూ..అప్రాచ్యుడా..వంశమెట్లాటిదో వంగడమెట్లాటిదో, ఏమీ అక్కర్లే...మాట యిచ్చాట్ట...మాట... మా పెళ్ళిళ్ళకంతా మేమేం మాట లిచ్చుకోలేదే... ఇదొకటి నేర్చారూ...ఎర్రగా, బుర్రగా యెవతో కంటబడంగానే, ఆత్మనిగ్రహం లేక, పది రూపాయలు సంపాదిస్తోందంటూ ... పెద్దవాళ్ళ మాట, కన్న తలిదండ్రుల మాటలను కాదనడమే... ఎంత అన్యాయపు కాలము వచ్చిందిరా భగవాన్...ఇక్...(అంటూ, ఓ కుర్చీలో చేరగిలబడి తల పట్టుకుంటాడు)

రఘు : ఎందుకండీ నాన్నగారు అలా ఆవేశపడతారు...(జాలిగా) అసలే ఆరోగ్యం బాగు లేకపోయె...అయినా ఎంతదూరం ఆలోచించినా, మీ అర్థంలేని ఆవేశానికి, ఆవేదనకు నాకేం ఆధారం కన్పించదు... భగవంతు డిచ్చాడు...ఇంత తినడానికి, ఉండటానికి లోటులేదు...ఆ కట్నాల రూపంలో, ఆడపిల్లలుగలవాళ్ళ దగ్గిర్నించి, వాళ్ళ కలిమిలేములపట్ల, ఏమాత్రం కనికరం లేకుండా, ముక్కుపిండి వసూలుచేయాల్సిన అవసరం ఏముందని?...

వెంక : అవునోయ్...నీకేం తెలుస్తుంది ఇప్పుడు... నీ చదువుకు పెట్టినదానిలో ఎన్నోవంతోయ్ వారిచ్చేనుషి. అప్పటికీ ఏదో పోనిద్దురూ ముఖమెరిక గలవాళ్ళే అని ఊరుకున్నాను... లేకుంటే మన తాహతుకు, సరితూకానికి అదే మూలకోయ్!...అయితే మాత్రం వాళ్ళు కట్నమిచ్చి పిల్లనిస్తామంటుంటే నీ రభసేమిటి మధ్య...

రఘు : ఆ...ఇస్తారు... ఇవ్వక తప్పుతుందామరి తల తాకట్టుపెట్టిఅయినా ... తమలాటి ఉదారహృదయు లాశిస్తున్నప్పుడు...కాని కొంచెమో గొప్పో వాళ్ళ కుటుంబ విషయాలు నాకూ తెలుసు గనుకనే అంటున్నా ... తరతరాలుగా అనుభవిస్తున్న ఆ రెండెకరాలు, రామశెట్టికి దఖలు పరిస్తేనే గదా, పెద్దపిల్ల రాజ్యం మెళ్లో మూడుముళ్లు పడింది...పోనీ మళ్లీ ఆయనజీవితంలో తిరిగి సంపాదిస్తానని కలనైనా అనుకోగలరూ... మళ్లీ ఏ తల్లోనో. మెళ్ళోవో నోదిత్తేనేగా, ఈ ఆరువేలు సమకూడేది...అవునండి... ఇవన్నీ మీకు చెప్పలేదంటారు...ఆడపిల్లత గన్నతండ్రి, అభిమానం ఉన్నవా డెవడూ చెయ్యడాపని... ఆ ఆసరా దొరకబట్టేగదూ మన ప్రయోజకత్వమంతా!

వెంక : అయితే ఇంతకూ నీవనేదేవిట్రా...నీకిష్టం లేకపోతే కట్నం తీసుకోవడం మానుకో... ఉట్టిలాంఛనాలు, వివాహఖర్చులు భరించితే సరి...అయినా కందకులేని దురద... నా కెందుకు...పిల్లదాన్ని చూచి రావడానికేం?

రఘు : (నిట్టూరుస్తూ) అమ్మయ్య! ఒక్క కన్సెషన్ ఇచ్చారన్నమాట... ధన్యోస్మి...ఇక రెండో విషయం పిల్లసంగతి...ముఖ్యంగా నాకు సంబంధించింది. అవునా. నాన్నగారు ఏం?...నా అభిప్రాయ మేమిటో ఇదివరలో ఎన్నోసార్లు చెప్పానుగదండీ! మళ్లీ ఏం చెప్పాలి?"

వెంక : ఆ...నువ్వు చెప్పడం, నేను వినడం... ఏమిటోయ్ నీముఖం...వెర్రి కూతలూ, నీవూ...

రఘు : (విసుగ్గా) వెర్రివో...మొర్రివో...నేను చెప్పవలసిందేదో ఇదివరకే చెప్పాను... జానకిని తప్ప మరొకరిని వివాహంచేసుకొనే ఉద్దేశ్యం లేదని...

వెంక : నీ మంకుపట్టు ఒదలవన్న మాట... ఆ శక్తి నీకెక్కడ దాపురించిందీ అని (ఒక చిటికెను పొడుం తీసుకుని పీలుస్తూ)...ఉద్యోగం వెలగబెడుతున్నదట...ఉద్యోగం, ఊళ్లు మీదబడి, మగరాయుడిలా! ఆడది ఉద్యోగం చేసిన అప్రతిష్ఠ మన వంశం చరిత్రలో ఏనాడైనా ఉంది......తగుదునంటూ నేటి కాల దౌర్భాగ్యుడివి బయలుదేరావన్న మాట......నీకేమన్నా మతి పోయిందా ఏవిట్రా...

రఘు : ఇక్కడెవర్లకీ మతులూ పోలేదు...మర్యాదలు పోనవసరం లేదు...రూపం, గుణం, వంశం...అన్నిటినీ మించి నా అభిమతానికనువుగా ఉన్నది గాబట్టే జానకిని వివాహమాడేందుకు నిర్ణయించుకున్నాను...ఎన్నడైనా ఉన్నాయా? ఇప్పుడెందుకూ? అని ప్రతిదానికిదో పాడైపోయింది......ఒక్కటడుగుతాగాని, మీ తాత ముత్తాతలనాడు, ఆకాశయానాలు, ఆటంబాంబులు ఉన్నాయా! భోజనం పెట్టి డబ్బులిచ్చుకునేవాళ్ళేనా...జీతాలు గట్టంది చదువులు చెప్పక తగిలేశేవాళ్లా గురుకులాల్లో...ఇన్నీ మారలా...అలానే అన్నీ మారుతాయి...ఇందులో వింతేముందండీ......పెళ్లికోసం చదువుతున్నారు...ఆ మూడుముళ్లు పడ్డంతోటే, ఆడవాళ్లయితేమాత్రం, అస్త్రసన్యాసం చేయకుండా, ఆ సంపాదించుకున్న విజ్ఞానాన్ని సార్థకపరుచుకోవడంలో తప్పేవిటని...అదేమంటే ఉన్నాయిగా, ఊసుపోకకు...ఆర్యోక్తులు...అవది తిరిగిచెడుతుందని? బంగారాన్ని పట్టని తుప్పు, ఇనుముకే ఎందుకు పట్టాలిఅని...అయినా నా నిర్ణయాలవల్ల వచ్చే కష్టనష్టాలు భరించుకోవలసింది నేను...

వెంక : ఆ...నేను!...ఎలాగైతేం నేటికి బయలుదేరావు......ఆమాత్రం నీ మేలు గోరకుండానే, నేనంతా బావుకుపోదామనేనా ఈ తాపత్రయం...పెంచి పెద్దజేసినందుకు ఆమాత్రం తల్లిదండ్రుల అభిప్రాయాల్ని మన్నించలేనివాడికి...

రఘు : అదుగో...అక్కడే ఉంది చిక్కంతా...ఆఖరికి నాకు, నా జీవితానికి నూటికి నూరుపాళ్లు సంబంధించిన విషయాల్లోగూడ మీ నిర్ణయాలు నా నెత్తిన రుద్దాలనే పట్టుదల మాత్రం మీ కెందుకు? ముప్ఫైఏళ్లు నిండవస్తున్నాయి...ఇంకా నా విషయాల్లో నాకు స్వాతంత్ర్యం లేకపోతే...అదేమంటే...పెద్దలమాటలు ధిక్కరిస్తున్నాడు... తిరుగుబాటు చేస్తున్నాడు...అంటారు...ఇదేం కొత్తగాదు నాన్నా...పదిమంది పాడే పాతపాటలో కొత్తస్వరం ఇచ్చినవాడు ఎదురుతిరిగినట్టే...పది మంది గ్రుడ్డిగా గానుగెద్దుల్లా పరిభ్రమిస్తున్న బాటలోంచి ఒక్కడుగు ముందుకు వేశాడంటే తిరుగుబాటుదారుడు...జాలువపడి, చల్లగా సాగిపోయే ప్రవాహంలో లేని సొగసు, గుట్టమిట్టల్లో గలగలా పారేటి సెలయేటిలో ఎందుకున్నదో ఎవరూ అర్థం చేసుకోరు...ఆనందాలు, అనుభూతులు, అవస్థలు మిళితమైయున్న అనంత జీవనస్రవంతిలో, ఒకరికి, మరొకరికి పొత్తేవిటి...పోలికెక్కడ? ఏమో ఎవరి అనుభూతులెలా ఉంటాయో?

వెంక : ఓహ్హో...ఎలాగైతేనేం ఇంతలేసి ఉపన్యాసాలిచ్చేందుకుపయోగిస్తున్నావన్నమాట సంపాదించిన తెలివితేటలన్నీ ... మంచిది ... నీ అభిప్రాయం నువ్వు మార్చుకో లేవు... నా ఉద్దేశ్యాలు నన్నొదలవు ... ఊ ... కానివ్వు నీ యిష్టం వచ్చినట్లు ... (గద్గద కంఠంతో) లేక లేక కలిగిన సంతానమని, కళ్లల్లో ఒత్తులెట్టుకొని కాపాడుకున్నందుకు చివరకు నాకు చేయవలసిన మర్యాదలు చేస్తున్నావన్న మాట...అలానే కానియ్యి..నాయినా...అలాగే...నీలాంటి ఉద్ధారకులను గన్న తల్లిదండ్రులకు కొదువేమిటి?...ఒక్క సంగతి మాత్రం మరిచిపోకు...ఈ ముసలి బొందిలో ప్రాణం ఉన్నంతవరకు, ఆ అప్రాచ్యురాలి కీపంచలో ఆశ్రయం లభించడం కల్ల అని మాత్రం గుర్తుంచుకో! (చెమ్మగిల్లిన కళ్లను పై పంచెతో తుడుచు

కుంటాడు)...ఇదంతా నా ఖర్మ...ఇలా రాసి ఉంటే (గోడనున్న భార్య ఫోటో వైపు చూస్తున్నట్లుగా) అదృష్టవంతు రాలివి ... అనుభవించ నక్కర్లేకుండానే దాటుకు పోయావు...

రఘు : (మెల్లిగా, స్వగతంలో) అవును మరి...ఎవరి ఖర్మ కెవరు బాధ్యులు? అర్థం లేని ఆర్భాటాలు, ఆక్రోశాలు...అనుభవం ఎవరి వంతు!

వెంక : (కుర్చీలోనుంచి లేస్తూ) ఇశ్శ్ ... రామ చంద్రా!... ఇంకా ఏం అనుభవించాలని చిన్న చూపు చూస్తున్నావోయ్!

జానకి : (ప్రవేశం—సన్నగా, ఎర్రగా, తెల్లటి, జార్జెట్ చీర, గులాబీ రంగు జాకెట్ ఒత్తుగా మోచేతుల దాకా ధరించి ఉంటుంది) హల్లో...గుడ్ మార్నింగ్...మిస్టర్ రఘు. (వెంకటేశం గార్ని చూచి) చప్పున ఒకడుగు వెనక్కు వేసి, పమిటె చెరగు రెండో భుజం మీదికి పూర్తిగా కప్పుకుని తలవంచు కుంటుంది, సిగ్గు నభినయిస్తూ)

రఘు : ఫరవాలేదు, రా జానకీ! మా నాన్నగారే లే...

జానకి : (వినయంగా) నమస్కారమండీ! ...(వంగి సమస్కరిస్తుంది)

రఘు : అలా నా రూమ్‌లో కూర్చుందామా... (అంటూ జానకితో ఒక వైపుకు వెళ్లి తుంటాడు)

వెంక : (వెడుతూన్న, జానకిని తదేక దీక్షగా పరిశీ లిస్తూ. స్వగతం) నా కళ్లు నన్నే మోసం చేస్తున్నాయా! ఏం వినయం! ఏం రూపం! సాక్షాత్తు లక్ష్మీకళ...(అంటుంటాడు.)

[తెర జారుతుంది]

[నేపథ్యంలో, ఒకపాట]

వెనుకముందు లేలరా!
విజయశంఖ మూదరా!
నాకు—నీకు—వాదమేల
వాడబాపు హృదయమే!
సాగిపోవ ప్రగతిరా!
సాధించుట బ్రతుకురా!

*  *  *

[కొన్ని క్షణాల తర్వాత తెరతొలుగుతుంది. ఆఫీసుగది... మైన పొదుపుగా సర్దబడిన టేబిలు మీద నాలుగయిదు ఫైల్లు, ఇంక్ స్టాండ్, పిన్ హోల్డరు, రెండుమూడు పేపరువెయిట్లు, కాలింగ్ బెల్ ఉంటాయి. టేబిలుకెదురుగా కొద్దిదూరంలో ఓ పొడుగాటి విజిటర్సు బెంచి ఉంటుంది. సుమారు 45 సం. వయస్సుగలవ్యక్తి కళ్లజోడు మాటిమాటికి సవరించుకుంటూ వ్రాస్తుంటాడు. టేబిలుకు ఎడమవైపున ఎత్తుగా ఉన్న ఓస్టాండ్‌మీద టేబిలుఫాన్ తిరుగుతుంటుంది. కుడివైపున నున్న రివాల్వింగ్ షెల్ఫుమీద గడియారం 3 గంటలు చూపుతుంటుంది......]

రఘుపతి : జానకి: (ఒకవైపునుంచి ప్రవేశిస్తూ) నమ స్కారం సార్!

వ్యక్తి : (కళ్లజోడు కొంచెం క్రిందికిలాగి—అభి వందనాన్ని స్వీకరించినట్లుగా తలూపి, కూర్చోండని బెంచీవైపు చూపిస్తాడు.)

రఘు : (సవినయంగా) ఇవ్వాళ కాస్త మంచి రోజన్నారు...మేం వివాహం చేసుకోవా లని...తమరు...శ్రమఅనుకోకుండా, ఇవ్వా ళనే అది కాస్తా పూర్తిచేయాలని మా మనవి...

వ్యక్తి : (వ్రాయడంఆపి, ఫైలునోపక్కకు నెడుతూ) ఆ...మీరు వివాహం చేసుకోవా లనుకుంటే ...మధ్య నాకు శ్రమ ఎందుకయ్యా... (జానకివైపు...ఏవమ్మా! అన్నట్లు చూస్తూ) ఈ రిజిస్ట్రారు ఉద్యోగం అందుకేగదా... అయితే...తక్షణం కావాలంటారు...శుభం ...తిథి వార నక్షత్రాలు గుణించుకునే బయలుదేరారన్నమాట...గుడ్...ఒదిలించు కుందామనుకున్నా వదలవండీ, తరతరాల నమ్మకాలు...మరేం అనుకోకండి...సర్వ సాధారణంగా రిజిస్ట్రేషన్ కొచ్చేవాళ్ళం దరూ అలానే అంటుంటారు...అందు కన్నాను...అంతేగాని ... (కాలింగ్ బెల్లు నొక్కడంతోటే జవాను ప్రవేశిస్తాడు) ... ఆ కరెంటు రిజిష్టరిలాతే ... (పుస్తకం తీసుకుని పుటలు తీస్తూ) కావా ల్సిన వివరా లడుగుతాను ... మెల్లిగా

చెప్పండి, ... మీ పేరు, వయస్సు, తండ్రి పేరు, వృత్తి...

రఘు : నా పేరు ఎస్. రఘుపతి, వయస్సు 27, సన్ ఆఫ్ వెంకటేశం, ఫస్టు అసిస్టెంట్, బోర్డు హైస్కూలు...

రిజ : (రఘుపతి నెగాదిగా చూసి) వెంకటేశంగారబ్బాయివిటయ్యా ... మరి మీ నాన్నగారెక్కడ, క్షేమంగా ఉన్నారా ... చూచి ఎన్నాళ్ళయిందో ... ఎక్కడా తటస్థపడటమే లేదు...

రఘు : (చిరునవ్వుతో) ఆయనగారు మాతోటుంటే, మేం ఇక్కడికి రావలసిన అవసరమెందుకండీ...

రిజ : (కళ్ళజోడు సవరించుకుంటూ) ఏమిటి .. మీ వ్యవహారం ఆయన కంగీకారం కాదన్నమాట... భేష్... తండ్రిని మించావన్నమాట ... ఊ ... అంతేలే ... టైం మంచిదంటున్నారుగదూ ...తర్వాత మాట్లాడుకుందాం గాని ... అమ్మాయి పేరు, వృత్తి మొదలయినవి...

రఘు : కుమారి జానకి ..

రిజ : (విసుగ్గా) ఇశ్ ... నీవుండవయ్యా... అమ్మాయీ...మీరు.

జాన : (సిగ్గుపడుతున్నట్లుగా) కుమారి వి. జానకి, వయస్సు 22, అసిస్టెంటు, అదే హైస్కూలు, తండ్రి శర్మారావు...

రిజ : అమ్మాయీ ... రఘుపతిగార్ని వివాహమాడటం నీకిష్టమేగదూ ... అనుమానాలు లేకుండా చెప్పమ్మా...

జాన : (మెల్లిగా) ఇ...ష్ట...మే...నం...డీ...

రిజ : రఘుపతిగారు,...ఇలా రండి...ఈ ప్రమాణపత్రంలో (జానకినుద్దేశించి) ఊ...మీరు గూడ...సంతకాలు చేయండి...

రఘు, జానకి : (టేబిలు దగ్గరసా వచ్చి సంతకాలు చేస్తారు).

రిజ : ఎవరినైనా సాక్షులను తీసుకొచ్చారా...

రఘు : (లేదన్నట్లు తల అడ్డంగా ఊపుతాడు).

రిజ : లేకపోతే ఎలాగండీ...అశాస్త్రతా నాదే... అలా వెళ్ళి ఎవరినన్నా...

రఘు : (తటపటాయిస్తూ) క్షమించాలి ... తొందరలో...ఇప్పుడిక్కడెవరు దొరుకుతారు ...పోనీ లేకుండానే...

రిజ : అదెలా వీలయ్యా ... చట్టం, రూల్సు ... ఉన్నాయిగదటయ్యా (ప్రేక్షకులవైపు చూపిస్తూ) ఇంతిమందిలో ఎవరూ దొరకరటయ్యా నీకు (ప్రేక్షకుల వైపునుంచి గలగలా నవ్వులు).

రఘు : (నీళ్లు నములుతూ) అసేదో ... దయవుంచి... తమరే...

రిజ : ఇంకా బాగుంది... ఈ పౌరోహిత్యంకూడా నా... ఊ...నా టైం వేస్టవుతోంది. తప్పదుగదా మరి (ముందుకువచ్చి ప్రేక్షకులలో ముందువరుసన ప్రముఖంగా కూర్చున్న ప్రిన్సిపాలుగారి నుద్దేశించి) క్షమించాలి...పెద్దల్ని శ్రమ పెట్టవలసి వచ్చింది...ఒక్క మారిలా దయచేయండి (ప్రేక్షకులలోంచి కరతాళధ్వనులు — ప్రిన్సిపాలుగారు, స్టేజివైపుకు వెళతారు) ఇలా రండి ... కూర్చోండి ... ఈ మూడు కాగితాలచివర సాక్షి సంతకాలు చేయండి ... ఏదో పసివాళ్లు... రూల్సు తెలుసుకోరు ... తొందరలో సాక్ష్యం తెచ్చుకోలేదంటున్నారు (అంటూ జాగ్రత్తగా ఒక్కో కాగితంమీద సంతకం పూర్తవటంతోటే, బ్లాటింగ్‌తో అద్దుతూ, మరో దానిమీద సంతకం చేయిస్తుంటాడు. (ప్రిన్సిపాల్ గారిచేత)

[తెర జారుతుంది]

ఒక కంఠధ్వని : (నేపథ్యంలో ...) మహాశయులారా! నాటకం అయిపోయింది ... ఒక్క అయిదునిముషాలు ఓపిక పట్టండి ... అధ్యక్షులవారి అంత్యోపన్యాసం అయిన తర్వాత, వందన సమర్పణతో మన వార్షికోత్సవాలు సమాప్తమవుతాయి ... (తెర తొలగుతుంది) (ఒక విద్యార్థి అధ్యక్షపీఠంలో కూర్చున్న ప్రిన్సిపాల్ గారికి,

(ప్రక్క నేఉన్న రిజిస్ట్రారు గారికి మెళ్లో పూలమాలలు వేస్తుండగా కరతాళ ధ్వనులు)

రిజి : (లేచి) మిత్రులారా! అధ్యక్షుల అనుమతితో, ఒక్క అయిదునిముషాలు మీకు కొన్ని విషయాలు మనవిచేయదల్చుకున్నాను...అందులో స్వవిషయం కొంత, స్వయంకృతం కొంత ... మన కాలేజీలో బి. ఏ. పెట్టిన సంవత్సరం నాటి హాజరు పట్టికలలో కె. నరసింహారావు పేరుంటుంది...బహుశా మీకు చూచే అవకాశం ఉండదు ... ఇప్పుడు మీ ఎదుట నిలబడి మాట్లాడే భాగ్యం కల్గినవ్యక్తే నన్నమాట... ఒక పాతవిద్యార్థిగా మళ్లీ ఈ నాడు మీ మధ్యని, మీ సంతోషంలో పాలు పంచుకొనే భాగ్యం లభించినందుకెంతో గర్వపడుతున్నాను. (కరతాళధ్వనులు)...ఉదర పోషణార్థం ఉద్యోగరీత్యా నానా ప్రదేశాలు తిరిగి ఓ నెలరోజులక్రిందటే బ్రతుకుభిక్షపెట్టిన ఈ పట్టణం చేరుకున్నాను ... ఉద్యోగరీత్యా అర్హత లేకున్నా, పాత విద్యార్థిగా మీ వార్షికోత్సవాల్లో పాల్గొనే అవకాశం లభించింది. ఈ 'అపోహ' నింత చక్కగా తీర్చిన నా మిత్రుడు శ్రీరామమూర్తి ఆహ్వానంవల్ల — ఆహ్వానా న్నందజేస్తూ అనేకవిషయాలు వివరించాడు ... నా సాయం — అది ఏపాటిదైనా — అర్థించాడు మిత్రశ్రీ...తీవ్రంగా ఆలోచించుకున్నాను ... తిరస్కరించలేకపోయాను... బహుశా నాలోని నాటకాలపిచ్చి నన్నిలా ముందుకు తోసింది...అభయం ఇచ్చాను... నా ఉద్యోగధర్మమే అలాంటిది ... ఏవిటంటారేమో ...... సమాజాన్ని, సనాతనత్వాన్ని ఎదిరించిన జీవితాల్నికూడా, చేరదీసి, చిగురింపజేయాల్సిన బాధ్యతలున్నాయి నాకు...

జీవితం కళాత్మకం,రసమయం...ఎప్పుడో ఒకప్పుడు నవరసాలు తొంగిచూస్తుంటాయి...వాటి అనుభూతి ఎవరికైనా తప్పనిసరిగా కల్గుతూవుంటుంది. .ఆనందాలు, ఆక్రోశాలు, అపోహలు, అన్యాయాలు, సంతోషాలు, దుఃఖాలు ... ఇన్ని ప్రవాహాలను గర్భంలో దాచుకున్న మహాసాగరం లాంటిది జీవితం...ఒక్క సంయమనం ఉన్నవాడు, సర్వము చక్కబడుతుంది... నాలో ఒక అభిప్రాయం కలిగిఉండటానికి నాకెంత హక్కుందో, అలానే ఎదుటివారికి హక్కుంటుందని గ్రహించగల్గిన నాడు, జీవితమార్గం సుగమమవౌతుంది ... అనంతమైన నిత్య నూతన స్రవంతిలాంటి జీవితానుభవంలో, పాత కొత్తల మేలుకలయిక లున్నపుడే రాణిస్తుంది ... అయితే కొంత మెలకువతో వ్యవహరించాల్సి ఉంటుంది...కాదనను ... ఒక కవికుమారుడన్నట్లుగా "గతమే జీవిత మనుకుని, వర్తమానమే వలదని, వెనక్కు నడిచేవారిని, వెక్కిరించు కోర్కలేదు..." అలానే...

"గతమంతా బూడిదకుప్ప, కావాలి మనోజ్ఞ భావి, తిరుగబడండని అరిచే, బిరుసువారి నిందింపను..." ఒక్కొక్కరి అనుభూతి ఒక్కొక రీతిలో ఉంటుంది ... అందులోనే వాళ్ల ఆనందం ఇమిడిఉంటుంది......ఆ ఆనందరసాస్వాదనకవరోధంగా అడ్డుగోడలు నిర్మించినా ఎన్నాళ్ళు నిలుస్తాయి...... అలా వాటిని సాగిపోనివ్వడంలోనే జాతికి ప్రగతి, నీతికి సుగతి ఉంటాయన్న నమ్మిక ఉంది......

నేటి ప్రదర్శనం, పరిణామం చెందుతున్న సమాజంలోని ఒక సమస్య నాధారంగా చిత్రించబడింది......ఉబుసు పోకకు గాని, ఉదర పోషణకు గాని ఉద్యోగం చేస్తున్న యువతులంటే ఒకవిధమైన న్యూనభావం ప్రబలి ఉండటం అనుభవంలో చూస్తున్నాం...నిత్య నూతనమైన నేటి నాగరిక ప్రపంచంలో నల్గురిలో తిరుగడానికి, నైతిక పతనానికి సంబంధం ఉందన్న అపోహ అచటచటా కన్పిస్తుంది ...... విచారకరం...... పురుషుని రెండు చేతుల సంపాదనకు, మరో రెండు చేతుల సంపాదన జోడించవలసిన ఆర్థికావసరం అందరికీ కలుగక పోవచ్చు...అయినా ఆర్జించిన విజ్ఞానాన్ని, ఏదో రూపాన, సమాజసేవలో సద్వినియోగం చెయ్యడంలో సిగ్గిలవలసిన అవసరం ఏముంది?...అందులో స్త్రీ పురుష భేదాలు, కలిమిలేముల కొలబద్దల ప్రసక్తి లేదు సరిగదా, అభ్యుదయకాము లనవరతం గుర్తుంచుకోవలసిన కనీసధర్మం అది... విద్యార్థి సోదరులలో వున్న కళాభిరుచిని, ఈ కళాత్మక వార్షికోత్సవాల మూలంగా కాంచగలిగి ధన్యుణ్ణయ్యాను... కళామతల్లి కల్పతరుచ్ఛాయల్లో జానకీ, రఘుపతులుగా కాల్పనిక కళ్యాణం జరుపుకున్న నాటక దంపతులకు తగు బహుమతు లివ్వడమేగాక, పిన్నలు, పెద్దలిందరు కూడిన ప్రేక్షకులఎదుట ప్రమాణ పూర్వకంగా ప్రత్యక్ష దంపతులైన, కుమారి శశికళ, చిరంజీవి రాజారావులనుకూడ, అధ్యక్షులవారానందంతో ఆశీర్వదిస్తారని ఆశిస్తూ విరమిస్తాను (మళ్ళీ కరతాళధ్వనులు.)

రిజ : (కూర్చుని, వివాహ ప్రమాణ పత్రాలను అధ్యక్షులవారి చేతికిస్తూ) ఒకటి నాటకంలోని వివాహానికి సంబంధించినది, ఇవి రెండూ అసలు వివాహానివి...దంపతుల కివ్వండి...దయచేసి...

అధ్య : (మాముకుని చకితుడౌతాడు—తిరిగి మెల్లిగా తెప్పరిల్లుకుని) అరె...నీ...ఇల్లు బంగారంగాను...ఎంత నాటక మాడారండీ, నరసింహారావుగారు!

రిజ : క్షమించాలి...నాటకంలో నాకూ ఒకపాత్ర ఉందన్న విషయం మరువకండి!

అధ్య : (లేచి) మిత్రులారా!...పాత, కొత్త విద్యార్థులు కూడి అద్భుతమైన నాటకమాడారు... చూచాం... ఆనందించాం...మన పాత విద్యార్థి పలుకులు తీవ్రంగా విమర్శించుకుంటూ పరధ్యానంగా ఉన్న నా చేతికి రిజిస్ట్రారుగారు, నా కుమార్తె వివాహ ప్రమాణ పత్రాలందించేసరికి, మనస్సులోని మారుమూలల్లో, కొన్ని అంతరంగిక కారణాల వల్ల, నిజంగానే, ఆక్రోశం చెలరేగింది... ఎన్ని లోపాలున్నా మానవమాత్రుణ్ణి... మమతదే పైచేయి అయింది...ఆ ఆక్రోశం కాస్తా ఆనందమైంది...అర్థమైంది...ఈ కార్యక్రమాలు జయప్రదం చేసిన పెద్దల్ని అభినందిస్తున్నాను... పిన్నల్ని ఆశీర్వదిస్తున్నాను... విద్యార్థి సాంస్కృతిక సంఘానికో వెయ్యిన్నూటపదార్లు కళాభివృద్ధి నాశిస్తూ ఇస్తున్నాను...చిరంజీవి నూత్న దంపతులకు చెరో వెయ్యిన్నూట పదార్లు, చిరాయురారోగ్యాభివృద్ధి నాకాంక్షిస్తూ...కట్నంగా కాదు లెండి...బహూకరిస్తున్నాను.

[తెర]

# కాళిదాసకవిత : శీలచిత్రణము

## పురూరవుడు

### శ్రీ అరవిందులు

సునిశిత పరిశీలనముతో కాళిదాసు, వివిధ రాజన్యుల స్వభావ స్వరూపములను దన కావ్యములలోఁ జిత్రించెను. అట్టి పరిశీలనమునందు పురూరవుని శీల చిత్రణము ద్వితీయము.

పురూరవుఁ డగ్నిమిత్రునికన్న నన్నివిధముల విభిన్నుఁడు. అగ్నిమిత్రుఁడు యువరాజు; యోధుఁడు; సౌందర్యోపాసకుఁడు; కామోద్రేకరహితుఁడు; రాజలాంఛనోపేతుఁడు; సాధుపురుషుఁడు. అమాయికతతోఁ గూడిన ముఖద్యుతి; యువరాజోచిత ఠీవి; ఝటితిస్ఫూర్తి గల యాలోచన; దయా సద్వర్తనము గలవాఁ డీతఁడు. సమయానుకూలమగు సామర్థ్యము గలవాఁడు. అపరిమిత భోగానుభవలాలసుఁడు. మాళవికా నాట్యప్రయోగముపట్ల నీతఁడు ప్రదర్శించిన బుద్ధికుశలతను బురస్కరించుకొని, ధారిణి, "ఆర్యా! రాజకీయములందును నిట్టి చాకచక్యము, నేర్పరితనము ప్రదర్శించిన మేలు వాటిల్లునుగదా!" యని తొలుత నే హెచ్చరించును. ఇట్టివర్తనమే వక్ష్యమాణకథయందును గాంచనగును. తన ప్రేమకలాపమం దతఁడు ప్రదర్శించిన యమాయికత, నేర్పరితనము, సంతోషజనకమైనది. కుటుంబవిషయములం దీత డెంతయో మక్కువ చూపెను. భోగాసక్తియుక్తము రసిక ప్రవృత్తిగల్గియు, వీరత్వముతో విలసిల్లు యుగమున కీతఁడు ప్రతినిధి.

కాని పురూరవుఁ డిటివాఁడు కాఁడు. ఈతఁడును వీరుఁడైన చక్రవర్తియే. ఉత్తమవంశ సంజాతుఁడు; ఉత్తమగుణ రత్నాకరుఁడు. అయ్యును నీతని స్వభావము పార్థక్యముకలది. ముఖ్యముగా నీతఁడు కవీశ్వరుఁడు; ప్రేమికుఁడు. ఇట్టి శీలములను 'షేక్స్పియర్' కూడ కొన్ని చిత్రించెను. "రెండవ రిచ్చర్డు" ఇట్టివాఁడే! "రినన్" కవీశ్వరుఁడు తన "యాంటిక్రైస్టు"నందును నిట్టి కల్పనము కావించెను. వీనితో తులనాత్మకముగ విమర్శఁ గావించిన, యూరోపియన్ కావ్యమర్యాద లీవిషయముపట్ల నెట్లు ప్రవర్తిల్లెనో గ్రహింపనగును.

కవియే రాజగుట యూరోపియనునకు కిట్టదు. అట్టి యేర్పాటు వాని బుద్ధి కస్తవ్యస్తముగ నుండును. కవికి కావలసిన గుణములు, రాజ్యపరిపాలకున కవసరమైన గుణములు, తేజస్తిమిర న్యాయమున నుండునని యాతని భావన. ఆంతరంగిక భావన కవితాస్వభావమునకుఁ జీవగఱ్ఱ. ఆత్మభావనారతుఁడగు కవి, రాజ్యపాలకుఁడైనచో, ఆతని హస్తంగతమైన ప్రజా జీవనావసరములు సక్రమముగా నిర్వహింపఁబడవు. ఆతనిమానసము భావాంబరవీధిలో విహరించును. ఆతని చింతన మాలంకారిక ప్రపంచమున సంచరించును. ఆతని యూహలు నేలను, నింగిని తాళములుగాఁ జేసి వాయించునవి. అట్టి యాతఁడు వాస్తవిక ప్రపంచధోరణికి దిగజారనేరఁడు. అందుచే నాతఁడు కార్యశూరుఁడు కానేరఁడు. అట్టి కవిచేతికి రాజ్యాధికార మిచ్చిన, తన మనోధర్మము ననుసరించి ప్రవర్తించునే కాని, లోకధర్మ మర్మముల నవగాహన మొనర్చుకొన నేరఁడు. కార్యకారణ సంబంధ సంజనితములగు సంఘటనముల నాతఁ డూహింపఁజాలఁడు. ఆతఁడు భీరువు కాకున్నను, ధైర్యసాహసోపేతుఁడేయైనను, దుర్బలుఁడుగను, నసమర్థుఁ

అనువాదం : శ్రీ బొడ్డుపల్లి పురుషోత్తము

డుగను పరిగణింపఁబడును. అంతేకాదు. అట్టివానిని నిరంకుశుఁడందురు. ఏలయన వాఁడు తన్ననుసరించి ప్రవర్తించువారి నాదరించును, తన్ను వ్యతిరేకించు వారిని దండించును. అందుచే రాజకవి పరిపాలన దుఃఖాంతమే యనుచున్నది. అతని యంతఃపురము, హత్యలకు, కల్లోలములకు నాలవాలమగును. రాజకవులనుగూర్చిన యిట్టి యుదాహరణము లనేకములు చరిత్రనుండి యుద్ధరింపనగును. బ్రిటిషు రాజ్యపాలకులలో మన కిట్టివారు విశేషముగ లభింతురు. 'స్టువార్టు' వంశీయు లందఱు పుట్టుకచేతనే కవీశ్వరులు. వారు తమ దురదృష్టము కొలఁది సింహాసనారూఢులు కావలసివచ్చినది. ఇందులకు "రెండవ ఛార్లెస్" మాత్ర మపవాదము. 'ఆఱవ జేమ్సు' పండితుఁడే యని పంకించింపఁబనిలేదు. ఈతనిని కవితుల్యునిగాఁ బరిగణింపనగును. తక్కినవారందఱు కళాభినివేశము, భావుకత కలవారలు. ఆచరణయోగ్యముగాని యాదర్శములు కలవారు. ఇందు కొందఱకు, తమ కళాభినివేశ తత్పరతలను బయలుపై పునుపునట్టి సామర్థ్యముకూడ కలదు. పైన పేర్కొనినట్లు రెండవ చార్లెసునకు మాత్రము వాస్తవికదృక్పథము కలదు. ఈతఁడు వాస్తవిక స్థితిగతుల నవలోడించి, యతిప్రశాంత చిత్తముతో నాచరణమార్గమునం దడుగు వేయకలఁడు. "మొదటి జేమ్సు"నకు గూడ నిట్టి దక్షత కొంతవఱకు గలదు. కాని రాజకీయ దురాలోచనలచేతను, సమయోచిత వివేకహీనతచేతను; ప్రతిపక్షులపట్ల ప్రదర్శించిన కాఠిన్యముచేతను; దక్కినవారివలె నీతఁడును బలితుఁడుకాకతప్పలేదు. ఇట్టివారు భారతీయ చరిత్రయందును లేకపోలేదు. కాశ్మీర దేశాధిపతియగు శ్రీహర్షుఁడు, కల్హణుని నిట్టి రాజకవులని మనకుఁ దెలియుచున్నది. అందుచే నిట్టికోవకుఁజెందిన పురూరవ పాత్రను కాళిదాసుఁ డేరీతిని తీర్చిదిద్దెనో పరిశీలించుట యాహ్లాదకరము.

భారతీయ కవీశ్వరుఁడు, రాజకవి పాత్ర చిత్రణమునం దసమర్థతను, పరాజయమును, విషాదమును బ్రదర్శింపకుండుట మనకాశ్చర్యము గొల్పును. పురూరవుఁడు మహాచక్రవర్తి. ప్రజానురంజకుఁడు. అప్రతిహత పరాక్రమోపేతుఁడు. గౌరవభాజనుఁడయిన దేవమిత్రుఁడు. యుద్ధరంగమునందు, పరిపాలనా విషయమునందు, ప్రేమకళాకలాపమునందు నీతఁ డఖండ విజయశ్రీ విలసితుఁడు. ఇట్లు చిత్రించుటచే కాళిదాసునకుఁ బ్రాపంచిక పరిజ్ఞానము లేదని కాని, మానవస్వభావము — తెలియఁగలదని కాని యనవచ్చునా? ఇతర కావ్యములయందు వ్యాస్యతో దర్శనీయమును కూలంకషకళాప్రతిభ ప్రదర్శించిన కాళిదాసుపై నిట్టి నిందవేయఁగల సాహసమెవరికుండును? కవితోపాసకులు, క్రియానిపుణులు, పరిపాలనా దక్షులును నగుట, మానవస్వభావ విరుద్ధమని యొక్కడును శాసనములేదు. 'మొదటి చార్లెస్' 'నీరో' యను వారలు కళాత్మకశీలురు. కాని వారు రాజరికముచే శాపోపహతులైరి. గ్రీకుసార్వభౌముఁడు "అలెగ్జాండరు"; ఫ్రెంచి సార్వభౌముఁడు "నెపోలియన్ బోనాపార్టు" సమ్రాట్కవీశ్వరులే. వారెక్కడను నసామర్థ్యమును, దుర్బలత్వమును బ్రకటించినట్లు మనకు చరిత్ర పేర్కొనుటలేదు అంతేకాదు; కవితాస్వభావ విలసితులకు కాల పరిస్థితుల నవగాహన గావించుకొనుటలో నొక్కొక్కప్పుడు విశేషమగు బుద్ధికుశలతయుండును. కొందరు తమ సృజనాశక్తిని కాగితములపైకాక, విశాల విశ్వమునగల సజీవపత్రములపై నుపయోగింపగల వరప్రసాదు లుందురు. ఇట్టి వీరిని భవిష్యత్కాలము వారు ప్రశంసించిన ప్రశంసింపవచ్చును. నిందించిన నిందింపవచ్చును. కాని వీరి తత్త్వము సమగ్రముగ గుర్తింపరానిది. 'షౌనాఫ్ ఆర్కు' 'మేజిని' 'గారిబాల్డి' ల వంటివారివలె వీరు పతనోన్ముఖమైన దేశమును సముద్ధరింతురు. లేదా! 'నెపోలియన్' 'అలెగ్జాండరు' లవలె ప్రపంచాధిపత్యము వహింతురు. జాతీయ సమగ్రావగాహనముతో గూడిన వీరోచితస్వభావము; జీవిత కళోపాసనాతత్పరత; ఆదర్శ గంభీరదృక్పథము; సంతత వీరారాధనము, మున్నగు ననేకశక్తుల సరససమ్మేళనముచే నిట్టి వారభ్యుదయమందుదురు. భోగానుభవేచ్ఛ ప్రబలకపూర్వము; బౌద్ధమత ప్రభావముకూడ ప్రబలకపూర్వము భారతీయులు వీరోత్సాహపూరితమైన జాతిగా విఖ్యాతిగాంచిరి. గద్యమును దృణీకరించి, పద్యముపట్లనే భారతీయులు విశేషాదరమును జూపిరి. భావాంబరవీధిలో విహరించుచున్నను, వీరోచితముగనే జీవితయాత్ర గావించిరి. ఇట్టి ప్రాచీన భారతీయస్వభావము కాళిదాసు కాలమునందును గొంత నిల్చినది. అందుచే నీ జాతీయ నాటక కవిచక్రవర్తి, కురువంశ మూలపురుషునగు

నీ పురూరవచక్రవర్తికవి, శీలమును జిత్రించుపట్ల దుర్బలత్వమునుగాక, సారధిరత్వమునే పరిపోషించు టత్యంత సహజముగనున్నది.

వాస్తవిక శక్తిసామర్థ్యములున్నను, కళాస్వభావ మెంతటి ప్రబలహృదయముసైన నొకింత దుర్బల పఱుపక మానదు. అలెగ్జాండరు, నెపోలియనులు స్వార్థ దురహంకార పరాయణులు. విపరీత భావుకులు. అసాధారణాదర్శములు కలవారు. కావలయునని వీరు ధృష్టత్వము ప్రదర్శింపకున్నను, అప్పుడప్పుడు నైతిక నియమోల్లంఘనముచే, యమానుషకృత్యములఁ గావించిరి. అలెగ్జాండరు తన జీవితము నొక పాశ్చాత్యేతిహాసము గావింపవలయునని యాశించెను. నెపోలియన్ తన జీవితము నమానుషేతిహాసము గావించెను. నాటకకర్త లౌచిత్యపోషణమునకు సమయోచితముగా ప్రాచీనకథావిషయములందు మార్పులు చేకూర్చురీతిగా వీరును తమ జీవితరూపకములందు స్వేచ్ఛగా మార్పులు గావించిరి. 'జోన్ ఆఫ్ ఆర్క్' కలలుగని యేమేమియో భావించినది. 'మజిని' 'గారిబాల్డీలు' కూడ విపరీతాదర్శవాదులు. అలెగ్జాండరు వీరికన్న నదృష్టవంతుఁడు. అల్పవయస్సుననే యాతఁడు పరలోకగతుఁడౌటయే యాతని యీ యదృష్టము. మఱియొక యదృష్టము—అతని పరిజనులు మిక్కిలి వివేకులు. వారతనిని గంగానదిని దాటనీయలేదు. ఇట్లే నెపోలియనునకుఁగూడ తన పరిమితిని గుర్తింపజేసెడి పరివారమున్నచో, వాని యంతిమదశ, అంత విషాదభరితమయ్యెడిది కాదు. వాని జననమువలె, మరణముకూడ కీర్తనీయమయ్యెడిది.

విక్రమోర్వశీయ రూపకమునందు పురూరవుఁడు కూడ నదృష్టశాలియే. దేవతాసాహాయ్య మాతని వెన్నంటియే యుండెను. దేవత లీతనిని దురదృష్టము నుండి కాపాడుదురు. అలెగ్జాండరున కకాలమరణము అదృష్టావాప్తికి తోడ్పడినట్లే యీ రూపకమునందలి పరిమితియే పురూరవుని, భాగ్యశాలిగా గావించును.

ఆత్మవినాశ కారకుఁడగు నసత్య కవితా స్వభావుఁడుగాక, పురూరవుఁడు, సత్యపరాక్రముఁడుగను; లలిత కవితా కళాప్రియుఁడుగను; నిరూపితుఁడాయెను. ధీరోదాత్తుఁడైన రాజునందు కవి ధీర లలితత్వమునుగూడ లలితముగ సమ్మేళిత మొనర్చుటచే పురూరవుని శీలమేర్పడినది. "కళ-కళకొఱకే" యను సిద్ధాంత ప్రతిపాదకుఁ ప్రాతిపదికయైన తరువాతి కవిత్వచ్ఛాయ లీశీలమునందు పొందుపఱుపఁబడినవి. మానవజీవిత సౌందర్యసమీక్షయందు, చరాచర చేతన ప్రకృతిసంపత్పరిశీలనమునందు, నిర్హేతుకానందమును జూరగొనుటే యిట్టి యద్భుత శీలచిత్రణములోని పరమరహస్యము.

పురూరవుఁడు నృపాల శిరోమణియు; వీరాగ్రేసరుఁడుగను; సమయోచిత ధైర్యసాహసక్రియాదక్షుఁడుగను; తొలుదొల్తనే మనకు సాక్షాత్కరించును. అంతేకాని కాళిదాసీతని నిత్యనైమిత్తికశీల ప్రదర్శనముతో నంతగా ప్రమేయము కల్పించుకొనలేదు. అందాతని కాసక్తి తక్కువ. ఒకవేళ నిత్యనైమిత్తికములే ప్రదర్శింపవలసివచ్చినచో, కాళిదాసు లక్షించునది యాంతరంగిక సత్యసమున్మీలనమే. లలితకళోద్రిక్తమానసుఁడైన పురూరవుని, అనర్థకరములగు దుర్బలత్వమునకు, నవర్హతకు గురికానీకుండ కాళిదాసు కాపాడును. పచేళిమ కళాప్రతిభతోడనే యీ కవిసార్వభౌము డీ శీలము నిట్లు చిత్రించెను. ప్రారంభమునందే పురూరవుఁడు అసాధారణ సంచలనత్వముతోడను, క్షణకాల జనితమనోనిశ్చయముతోడను, అధోగతాహార సంపాదనా లంపటమగు గృధ్రరాజము నందలి మేఘతిరస్కృతోద్వేగమువంటి యుద్వేగముతోడను మనకు ప్రత్యక్షమగును. వెంటనే సుకుమార భావనావిలసితుఁడగు ప్రేమికుఁడుగా నీతఁడు గోచరించి, మన కాశ్చర్యము కల్గించును. నాటకాంతమున పురూరవుఁ డింద్ర సాహాయ్యమునకై యాహ్వానింపఁబడును. ఆద్యంతములయం దిట్లు వీరోచితముగా తీర్చిదిద్దబడిన పురూరవుని కూర్వశితోడి సంబంధమొక యితిహాసము మధ్య ప్రాసంగికముగావచ్చిన ప్రేమకథవలె మనోజ్ఞముగా నొప్పును. ఇంతేకాదు; భావకవితోదాహరణము లనఁదగిన వర్ణనలు; పరిపాలనాదక్షత్వ సూచనలు; వీరరసస్ఫోరకములగు సైన్యములు; ప్రత్యంకమునను, నప్రయత్నముగ సిద్ధింపఁజేసిన కాళిదాసు కళావైదగ్ధ్యము ప్రశంసాతీతమైనది. ఇందును నాతఁ డతివృష్టి యనావృష్టి దోషములకు గురికాలేదు. ఆతని కవితాశిల్ప స్వభావమే యట్టిది. మానవ సహజమగు సరసమనోజ్ఞస్వభావము మూర్తీభవించిన

పురూరవునిలో, నృపత్వము తన ప్రాభవమును తెలుపఁ జాలకపోయినది.

కావ్యారంభమునందే పురూరవునిలోఁగల ఈ స్వభావ వైరుధ్యము సూచింపఁబడినది. స్త్రీసాహాయ్య ప్రకటనమునందే యాతని రాజనీతి, ప్రత్యుపకారప్రదానము, నాకౌకసులతోడి సంబంధము, ఏకకాలమున మనోవీధిని మెఱయును. ఇది యితిహాసోచిత గాంభీర్య చిహ్నము. ఇంతటి రాజనీతియందును ప్రస్ఫుటముగ నా వినయ సౌశీల్య మాభిజాత్య సంప్రాపితము. అతని శీలసంపద కీవినయము మకుటాయమాన మైనది. చిత్రరథుఁ డన్నట్లు, "వినయము విక్రమాలంకారముకదా!" సాంప్రదాయికముగ రాజనీతి వైదొలఁగగనే పురూరవుఁడు తన సహజ మృదులస్వభావములోఁ గానుపించును. దశదిశాపరివ్యాప్తమగు కీర్తిచంద్రికలచే నుప్పొంగు మానసముతో, "చంద్రపౌత్రుఁడు, సూర్యదౌహిత్రుఁడు, మహారథుఁడు నగు పురూరవు తెలుఁగుటంత దుర్ఘటము కాద"ని యాతఁడు సగర్వముగ నుద్ఘాటించును. మఱియొక సందర్భమున, తాను, "నానావనీ రాజమూడా కల్పోజ్జ్వల రత్నభాసిపదపీఠాప్తాధిరాజ్యాధినేత"నని నిస్సంకోచముగ పల్కెను. ఈతఁడు మితభాషి. ఉజ్జ్వల సంభాషణాచతురుఁడు. ఇతని సంభాషణలలో సుకుమారభావన తామరతూఁడునందు బిసతంతువు వలె నిమిడియుండును. నెపోలియను చక్రవర్తియు నిట్లే, శీవి తలుకొత్తునట్లు భావపూరితముగ రాజకీయ ప్రకటనలు చేసెడివాఁడని మనము విందుము. అలెగ్జాండరు, "బాటిస్" అనువానిని తన రథ చక్రములకు బంధించి, గ్రీకు వీరుఁడగు "అచిలిస్"వలె ప్రవర్తించినాఁడు. ఇట్టి వీరిని యసత్యభాషకులని, యాత్మశ్లాఘాప్రియులని, వాచాలురని విమర్శనవిషమును వెలిగ్రక్కిన ప్రయోజనము శూన్యము. వీరిస్థాయి యందఱు నందుకొనఁజాలనిది. అది యట్లుంచుదము.

జాల్మ్ఁడగు వసురుని దర్పము నడగించుటకై ఈశానదిశకు గుఱ్ఱములను నడిపొల్పించిన యీ సూర్యదౌహిత్రుని హృదయ మాక్షణముననే తద్దృశ్య రామణీయకమున కాకృష్ట మైనది. అతని కవితాత్మ యావిష్కృతమైనది. రథచక్రసంచాలిత వాయుతరంగములు వినీలపయోధర పంక్తులను విచ్ఛేద మొనర్చుచుండుట — భూసంచారముగు రథము, గాలి దుమారముల చెలరేపుచున్నట్లున్నదఁట. అపుడు రథచక్రములలో నేమియా క్రొత్తయాకులు చేరినట్లున్నదఁట. హాయ మాలిచామరములు వినిశ్చలములై చిత్రములందువలె నిడివిగానున్నవఁట. ధ్వజాంతమునందలి పతాకము గాలితీవ్రతకు చక్కగా విచ్చినట్లున్నదఁట. ఏమి యీ సంభాషణాచాతుర్యము? చరిత్రలో నే రాజేంద్రునకుఁగూడ నింతటి సరస సంభాషణమున్నట్లు తోఁచదు. రెండవ రిపర్ణునకుఁగూడ నీచంద్రుని పౌత్రునకుఁగల భావవిశిష్టత మృగ్యము. ఈ నాటకమునగల సర్వోత్కృష్ట విశిష్టతలలో నిది యొకటి. ఇట్టి సరసప్రమాట్టు సాహచర్యప్రభావమున — విదూషకుఁడగు మాణవకుఁడు, వేటగాఁడగు వేదకుఁడు, కంచుకియగు లాతవ్యుఁడు, సందర్భోచితముగ రమ్య కవితోత్సాహపరులై భాషింతురు. కాని వారి భావములు సామాన్యములు. అందలి కవితాశైలియు సర్వసాధారణము. రాజేంద్రుని శైలీగాంభీర్యము వీరియందుండుటయు ననౌచిత్యమే యగును గదా!! సంగమనీయమును చూడారత్నము నెరచి భ్రమచేత గ్రద్ద తన్నుకొనిపోవునపుడు, కిరాతి, "ఇదుగో! ఇదుగో! నోటకొనను తగుల్కొనియున్న బంగారపు దారములోని మణితో ఆకాశాన్ని చిత్రిస్తూఉన్నదనేలాగ సుడుస్తున్నది" యని భావనను ప్రేరేపుచు మాటలాడును. అప్పుడే పురూరవుని కవితాత్మ యుప్పొంగినది.

"నాదును గనఁబడుచున్నది."

తే॥ నోర మణిప్రేలు జాలువాదార మొప్ప,
మింట వడి మండలముల భ్రమించు కతనఁ
గొఱవి గిఱగిఱఁ దిరిగెడి తెఱఁగుదోఁప
రాగరేఖావలయము లేర్పచుఁ బులుగు.

ఈ పులుఁగె దక్షిణపుదిదమీదుగా పోవుట గాంచిన రాజహృదయము మఱియొక రమణీయ భంగిమలో భావించినది :

తే॥ నిగ్గు లివురులఁబోలు మానికముచేత
వంజాలపు విరుగు త్రిచేబలె ఖగంబు
దిగ్వధూవక్త్రమునకు పాధించెఁజూసెఁ
జారుతరము వతంస ప్రసాధనంబు.

* ఇందలి పద్యములు మహామహోపాధ్యాయ వేదం వేంకటరాయశాస్త్రి గారి యనువాదము నుండి గ్రహింపఁబడినవి.

మణితోఁగూడిన పక్షి యదృశ్యమగునంతవఱకు తన సరసపాహిత్య సౌహిత్యము నీతఁడు ప్రదర్శించును. ఈతని భావన రాగరంజితమైనది. ఆ భావనయు స్వతస్సిద్ధము. అతని యాలోచనా సంభాషలు దార్శనికత్వము ప్రేమప్రపుల్లములు. మధురభావ చిత్రితమగు నాతని మనఃఫలకమును, మనోజ్ఞపదవిన్యాసమునం దాలంకారికముగాఁ బ్రదర్శింపఁగల కవిత్వ పటుత్వ మాతనికి సమృద్ధము. ప్రకృతిసిద్ధమగు నొక రమ్యవస్తు సందర్శనము, ఒక సామాన్య భావోద్రేకము నాతని కవితాత్మ నుప్పొంగింపఁజేయఁగలవు. అతని గంభీర భావముద్రణావిలసితమైన ప్రతి సామాన్యవిషయము, నుదాత్త కవిత్వముగా రూపొందును. కవి కత్యంతావసరమగు నిశితభావోద్రిక్తత, పరిశీలనాదక్షతయు; దార్శనికశక్తియు నీతనికి వరప్రసాదితములు. అరుణోదయకాంతుల యరుణిమలు, మృణాళికా సూత్రధారియై, వినీలాకాశ వాహిని నెగురీడు నపరంజి రాగరంజిత శ్వేతగరుద్గమనము; దరీవిభాగవిచ్ఛేద సామర్థ్యమగు ప్రవాహవేగము; నిశీథినీసమయమున హటాత్తుగా నుదయించిన నిశాకరుని యాశాజనక సందర్శనము; సంకుల ధూమవినిర్భిన్న ప్రచండ దావానల కాంతిరేఖలు—ఇవియు నవియు ననవేల? ఇట్టి వనేకములు పురూరవచక్రవర్తి కవితా మానసాంబుజమును ప్రపుల్లమొనర్పఁగల పునీత కవితాంశములే. ఈతని కవితాప్రతిభ నిసర్గమనోహరము. అందుచేతనే తన పట్టమహిషిని ప్రశంసించునపుడుగూడ నీ రసజ్ఞరాజశేఖరుఁ డుద్రిక్తానుభూతియుక్తమగు మంజులాలాపములే గావించును. ఆ యాలాపము లెట్టి నీరసస్థితినైన నొక్క క్షణములో రసభరితము గావింపఁ గలవి.

ఇట్టి గంభీర హృదయసంపన్నుఁడు, కవితాకళాప్రపూర్ణుఁడు; రమణీయ భావుకశిరోమణి; ధీరోదాత్తుఁడునగు పురూరవచక్రవర్తికొక యమూల్య పరుసవేది లభించును. అట్టి దివ్యమణి నాశించి సంపాదింపగల యర్హత యీతనికిదక్క నన్యులకు లేదు. ఆదివ్యమణియే యూర్వశి. సౌందర్యరసాధిదేవత. 'నరసఖమునీంద్రు నూరువున జన్మించినది. 'తపోవిశేష పరిశంకితుఁడైన మహేంద్రుని కోమలాయుధము!' 'రూపగర్వితయైన లక్ష్మీదేవికి గుండెతల్లడము!' 'స్వర్గాలంకారము' ఇట్టి నాక రమణిని విశ్వభావనా సౌందర్య పరాకాష్ఠ స్వరూపగను; మాఃవాత్మ యనంతముగా పరితపించి, పరితపించి యందుకొనజాలని యాదర్శనారీరత్నముగను; అన్నిదేశములను, అన్నికాలములను సౌందర్యాదర్శ పరితప్తులగువారి పాలిటి యిష్టదేవతామూర్తినిగను, నత్యంతమనోహరముగా సందర్శించి, యతురరమ్యముగా వంగ కవికుమారుఁడు. రవీంద్రుఁడు గానమొనర్చెను. కావున వ్యక్తిమాత్రున కీమె వశముకానేరదు. ఏవ్యక్తి ధీరోదాత్తగుణసంపత్తి కల్గియు, కవితాకళాప్రపుల్లహృదయుఁడో; ఏవ్యక్తి సర్వదేవతాకోటి గౌరవార్హతలను సంపాదించెనో; ఏవ్యక్తి జీవితజ్యోతి యొక మహేతిహాససదృశమైనదో; ఏవ్యక్తి చంద్రాంశునిభాస్పంద యశస్సుందిల దిక్కుందరుఁడో! యట్టి కమనీయ మహనీయమూర్తినే యీ త్రిభువనాతీత సౌందర్యతిలక వరింపఁగలదు. అట్టి మహావ్యక్తి పురూరవుఁడు. ఈతఁడు మనుపుత్రికయగు ఇళాదేవి పుత్రుఁడు. వేదవేదాంగ శాస్త్రార్థ విశద వాసనార్తి ధిషణాధురంధరుఁడైన బుధుఁడీతని జనకుఁడు. సూర్యదౌహిత్రుఁడు. ఊర్వశీ సౌందర్య పాశబద్ధుఁడై, యీతఁడు తన ధర్మపత్నిని, ప్రాపంచిక కీర్తిప్రతిష్ఠలను ననాదరించెను. కాని తన సహధర్మచారిణిపట్ల నాతని కార్ద్రభావముకలదు. అది కేవలము ధార్మికము; నిస్సంగము నైనది. అతని యాత్మీయతా సర్వస్వము దేవతా సంబంధమైనది. ఎంత హృదయపూర్వకముగ నాకాంక్షించినను నీతనికి నూర్వశీ దివ్య సౌందర్యానుభవ మవిచ్ఛిన్నముగ లభింపలేదు. ఊర్వశీ పురూరవులు గంధమాదనవనవిహారమున కేగుదురు. ఆ మిన్నేటి యిసుకతిన్నెలయందా రాజర్షి హృదయము ఉదయవతీ విద్యాధర కన్యయం దొకింత చలించును. స్త్రీసహజమగు మాత్సర్య మూర్వశి యందును బొడగట్టును. కలత బాఱిన యెడందతో నీమె పురుషప్రవేశమును సహింపని కుమారస్వామి తపోద్యానమున నడుగు వెట్టును. అంతే. ప్రేమ మహార్ణవ విలీనులైన దంపతులకు వియోగము ప్రాప్తించినది. ఆత్మీయ సౌందర్యాధిష్ఠాన దేవతా వియోగ దోదూయమాన మానసుఁడగు నా చక్రవర్తి విశాల ప్రకృతిలో పాదపాదమున, తరులతాగుల్మాదులలో ప్రియాసౌందర్య చ్ఛాయలు పొడగాంచుచు; వీతరాగులను గూడ నుత్కంఠితులను గావించుచుండెను. దేవతాత్మ యగు హిమవంతుని దుహిత; సకల ప్రకృతిస్వరూపిణియు నగు గౌరీచరణ సంజాతమగు మణిప్రభావముచే నీ వియోగులకు పునస్సమాగమము సమకూడినది. ప్రేమఫలించినది. ఆయువను పుత్రుడు

కూడ నుదయించెను. మానవదేవతా సమాగమోత్కృష్ట జనితుఁ డీ యాయువు కుమారుఁడు. భారతీయ పురాణ గాథలలో నిదియొక విచిత్రమైన సన్నివేశము. కాళిదాసు తన యనన్యసాధారణ కవితా సంపత్తిచే దీనినొక సహజ మనోహర మానవ ప్రేమగాథగా బరిణమింపజేసెను.

ఒక విధముగా బరిశీలించిన, పురూరవుని పూర్వజన్మ మంతయు నూర్వశీ ప్రేమ సమాగమ ప్రయత్నమే యనిపించును. మహేతిహాసమువలె వైభవోపేతమగు తన జీవితకాంతి ప్రసారముచే నీతఁడు తన భావనావీథిని రసమయ మొనర్చి, భూమ్యాకాశముల వ్యాపింపఁజేసెను. అతఁడు నిజముగా సార్థక నామధేయుఁడు. పురూరవుఁ డనఁగా దిగ్దిగంతముల మాఱుమ్రోగినవాఁడు. కాని యంతమాత్రమున నాతని కాత్మవికాసము కల్గలేదు. సందర్శనమాత్రముననే యాతని ప్రేమవాహిని యూర్వశీసౌందర్యార్ణవ మగ్నమైనది. స్వభావగత కవితా సౌభాగ్యము, మనోగత చిత్ర విచిత్ర ప్రేమ భావనాచిత్రములు; స్వకీయ కీర్తిగతాత్మాభిమానము, వీరత్వము, ఘనత; సమస్తము నేకోన్ముఖమై జీవిత చరమ భావోద్రేక ద్వారమున వెల్లుబికి, జ్యోత్స్నామయ దివ్యలోకమున స్థిరసౌదామినిగా వెలుఁగొందినది. ఆతని ప్రతిభావము; ప్రతిభావోద్రేకము నూర్వశీ ప్రణయమహిమోపేతమై, సంస్కారపూతమగు మధుర భాషణములుగా వెలువడును. ఆయువు తనపుత్రుఁ డని వినినంతనే పురూరవజనకునిలో వాత్సల్యరస ముప్పొంగినది. ఆయువును గన్నంతనే యాతని నేత్రద్వయమున నానందాశ్రువు లుఱికినవి. స్వాంతము ప్రేమమయమైనది. మానసము ప్రసాదభరితమైనది. గాఢాలింగనము గావింపవలయునను వాంఛ ప్రగాఢమైనది. జీవిత మర్యాదలను బురస్కరించుకొని, నాటకౌచితి ననుసరించి, పురూరవ హృదయనిహితమైన పుత్రవాత్సల్యము బహిర్గతము కానీయక కవీశ్వరుఁడు చాలకాల మణచియుంచెను. అసలీ సంబంధమగు భావమునే యుద్బుద్ధము కానీకుండుటకై కవీశ్వరుఁడు, ఊర్వశీ పురూరవులకు వియోగమును జేకూర్చెను. ఏతద్విధానము చేతనే మూలకథ నాటకీయ నిర్వహణమున కనుకూలమైనది. పురూరవుఁ డున్మాదమునందినంత స్వేచ్ఛాకవి యైనాఁడు. ఈ రూపకమందలి చతుర్థాంకము కేవలము లాక్షణిక విధేయమైనది కాదు. నాటక నిర్వహణమున కిది యనివార్యమైనది. నాయకుని శీల చిత్రణమున కిది సమగ్రతను సమకూర్చుచున్నది.

పురూరవుఁ డున్మాదుఁడని యంటిని. గాఢముగా నాలోకించిన యాపద మతనిపట్ల సముచితము కాదని యనిపించును. ఈతఁడు 'లియర్' వలె గాని; 'ఒఫెలియో' వలెగాని యున్మాదుఁడు గాఁడు. ఈతఁడు తాత్కాలికముగ మాత్రమే తన సహజస్థితిని కోల్పోయినాఁడు. ఇది మనోవైపరీత్యము కాదు ఈతనిలో వెల్లువయై ప్రవహించిన యసాధారణ భావనా చైతన్యము. అది మహాకవుల యందు గాంచనగు మహోద్రేకము. చేతనాచేతన ప్రకృతి సౌందర్యమునం దాతనికి సానుభూతి హృదాత్మగా ప్రసారితమైనది. మహాటవిలోని దావానలము, ప్రతి స్వల్పవిషయమును సుస్పష్టముగ గోచరింపఁజేసి, రూపాంతరిత మొనర్చుచు, స్ఫురతతో నుఱుకులు పెట్టు రీతిగా నీపురూరవార్ద్రాగ్ని భూరి ప్రజ్వరిల్లినది. సుమధుర శబ్దజాలము; అనిదం పూర్వమగు నాలోచనలు; సుదీర్ఘపుటూహలు; క్షణక్షణ సంచలిత భావోద్రేకములు; సుడులు చుట్టుకొని, ప్రకృతి సౌందర్య ప్రదీప్తములై, రాజర్షి విరహవేదనా మానసమును ప్రతిబింబింపఁ జేసినవి. ఈ దృశ్యము నతిక్రమించిన కవితా వైభవముగాని, కళాసౌకుమార్యము గాని గోచరింపదు. ఇందొక సూక్ష్మ సౌందర్యాంశము కలదు. అది యల్పముగనే బాహ్యదృష్టికి గోచరింపవచ్చును. కాని యందనల్ప కళావైచిత్రి కలదు. పురూరవుని భావోద్వేగమందు క్రమోన్మీలనము కలదు. ఒక వినీల పయోధర మాతని దృష్టికి క్రూర రాక్షసునివలె కాన్పించును. అతఁడు తన ప్రియురాలి నపహరించుచున్నతఁడు భ్రాంతిఁజెందును. అప్పుడీతఁ డాయుధవిహీనుఁడు. అంతటి మహాచక్రవర్తి కాస్థితిలో నొక శిలాఖండమే యాయుధమైనది. దానినే విసరుట కుద్యమించినాఁడు. ఇది నిజమున కున్మాదస్థితియే. కాని యీ యవస్థ యెంతో కాలము నిలువలేదు. మఱుక్షణముననే యాతఁడు తన విభ్రాంతి గుర్తించెను. భావోద్వేగ మొకింత చల్లారినది. కాని మానస మల్లోలకల్లోలితముగనే యున్నది. ఆ వనమందలి ప్రతి స్వల్పవస్తువు నాతని కూర్వశీరూపముగనే మిఱుమిట్లు గొల్పును. ఆతని యంతరంగమును గలవరపఱుచును. మఱుక్షణముననే యథార్థ పరిజ్ఞానము కల్గును. ఇట్లొక్కొక్క వికలభావ ప్రతి

క్రియా, యాతనికి కొంత కొంత మానసిక విశ్రాంతిని సమకూర్చును. కొంత తడవున కాతని మానస మచేతనమునుండి చేతనములకుఁ బగావు లెత్తును. మకరంద పానమత్తమగు మధుకరి, ప్రఫుల్ల కలాకలాపియగు కేకి సార్వభౌముడు; మధురగాయిని యగు కోకిలకోమలి! బాష్పజలార్ద్రవికలలోచనుఁడగు కరిపతి; మానసోత్సుకమగు కలహంసరాజము; గోరోచనా కుంకుమ వర్ణాంచితయగు చక్రవరాణి; కమలాధ్యాసియైన వభుకరము, నాతనికి గనుపించును. వానిని తన ప్రియా వృత్తాంతమును యాచించి పురూరవుఁడు విఫలుఁడౌను. పిమ్మట కరిణీసమేతుఁడైన కరిరాజును, 'దూర విజిత కమలారికాంతిని' యను తన 'వేలుపుటెంతిని' వీక్షించితే? యని పురూరవుడు పృచ్ఛించును. దానికిని తనకునుగల సాదృశ్యమును బురస్కరించి, దాని యందత్యంతానురాగమును బ్రకటించును. దానికి తనకువలె 'ప్రియావిరహ దుఃఖము ప్రాప్తింపకుండ వలయు' ననియే చక్రవర్తి పవిత్రాశయము. అనంతర మచ్చరలకుఁ బ్రియమై విశేషరామణీయక శోభతో నొప్పు 'సురభికందర' మను భూధరస్వామిని తన ప్రియా వృత్తాంతమును బ్రశ్నించును. గుహాముఖమున వెలువడిన ప్రతిధ్వనియే దాని సమాధానమని రాజేంద్రుడు భ్రమించును. తొలుత నాతఁడు మృగపక్ష్యాదులకు సంభాషణా సామర్థ్యము నాపాదించును. కాని యా పర్యాయ మాతఁ డాలించినది తనమాటల ప్రతిధ్వనియే. ఈ విషయము నాతఁడు గుర్తించెను. క్రమ క్రమముగా నాతని తీవ్ర మానసోద్రిక్తత సన్నగిలినది. అతని భావన సత్యమునకు సన్నిహిత మయినది. ఏదో యొక యగోచరమగు దివ్య శక్తి యూర్వశి నొక సుందరమగు ప్రకృతిలోని వస్తువుగా మార్చియుంచునని నృపాలుఁడు తలంచెను. అయిన నేమిగా నామె మార్పుచెందును! 'క్షుభితా కరుణ శకుంతిక'యు, 'కలమధుకర ఝంకారిత'యు నగు నదీమతల్లి యాతని నయనద్వయము నాకర్షించినది. తన ప్రియురాలికిని, దీనికిని సన్నిహిత సామ్యములు సుస్పష్టము లయినవి.

ఉ॥ వీచులు గాఁగ భ్రూకుటులు, విక్షుబ్ధ దండజ
పంక్తి కాంచిగా
వేదన జాఱు పైఁటవలె, ఫేనచయం బిటునట్టు
నీడ్చుచున్
ఏచిన మేటి సంస్ఖలిత మెంచుచు,
క్షిప్రపదప్రపూత యై
నా చెలి యోర్పులేక పరిణామము నొందె నదీ
స్వరూపతన్॥

ఇన్ని సామ్యములు పొడగట్టినను నొకింత తీవ్రముగా యోజించిన పిమ్మట చక్రవర్తికే యీ భావనలోని యనౌచిత్యము పొడగట్టినది. "ఊర్వశి పురూరవుని వదలి సముద్రుని అభిసరింపగు గదా!" ఈయాలోచన మెంత సముచితము! ఇంతే కాదు. నిర్విణ్ణతచే శ్రేయస్సులు కలుగవను నిర్ణయము కూడ నాతని మనసులో నేర్పడినది. తన పరిభ్రమణము నిష్ప్రయోజనమని నిశ్చయించుకొనినాఁడు. "ఎచట నువదన నాకంటి కగపడకదిచ్చు మొగమయినదో యచ్చోటికే యేగెదన"ని పరిక్రమించినాఁడు. ఇంతలో నొక కృష్ణసార మాతని దృష్టి నాకర్షించును.

'కాననేందిర తాఁ దమకమునఁ జూడఁ జూచినట్టి నిడుద కటాక్షము' వలె నొప్పు మృగశాబకమును బలుకరింపక యుండలేకపోయినాఁడు. ప్రియా వృత్తాంతమును దెలుపుమని కైమోడ్చినాఁడు. కాని దానికి సంభాషణా చాతుర్యమును గల్పించలేదు. లతాలతాంతములయం దాతనికి ప్రియావయవ పుచ్ఛాయలు స్ఫురించును. కాని పూర్వము కల్గినంత విభ్రాంతి ఇంతకు పూర్వము పురూరవుని శక్తి సామర్థ్యములు; మహీపాలున కీమాఱు కలుగలేదు. అతని భావములు సత్యసామీప్యము నందుకొనుచున్నవి. ఇంతలో భగవానుఁడైన మృగచారి ముని సందర్శనభాగ్యము లభించినది. మునీశ్వరుఁడు పలుకరించి 'నగప్రభుపుత్రీ పదరాగజనిత' 'సంగమనీ' యాఖ్య మగు మాణిక్యము ననుగ్రహించెను. ఏతదనుగ్రహముచేఁ బురూరవునకుఁ బూర్వపుఁ బుద్ధిసంపద లభించినది. పుష్పవిహీనయగు లతాతన్వియందే యాతనికి రతిభావము కలిగినది. ప్రియురాలిగా కాక, "ప్రియానుకారిణి"నిగా దానిని కౌగిలించుకొన వలయునను బుద్ధిపుట్టినది. తదనంతర దృశ్యమునం దంతటను సహజ మనోహర భావుకుఁడగు రాజర్షి యథార్థస్వభావము మన కవగతమౌను. అంకాంతమున నీభావుకచక్రవర్తి యాకాంక్షించి తన కులదేవతను ప్రార్థించిన దివ్యవాహన మెంత మనోజ్ఞమైనదో చూతుఁడు:

క. స్ఫురియించు మించు సిసిమగ
సురచాపము నూత్నచిత్రశోభగఁ గ్రొమ్మ
బ్బురవహించు విమానముఁ జే
సి రయంబున నన్ను వసతిఁ జేర్పుము తరణీ॥

ఇట్టి స్వేచ్ఛాప్రాప్త విమానము నాకాంక్షింపఁగల యస్పృతి యుదాత్త రసిక రాజపుంగవునకే కలుగు. ఇట్టి నిశిత భావనా వైలక్షణ్యముతోఁ గూడిన కళాగోపన విధానమును గూర్చియే నేను విశేషించి వివరింపఁ దలంచునది. ఇటి కళావిన్యాసమును గుర్తించినపుడు

గాని కాళిదాసీయ కవితాకళాప్రతిభాప్రభలనో మన మానసాంబరము శోభిల్లదు. అప్పుడుగాని మన మా కవికుల సార్వభౌముని సర్వతోముఖ కవితా వైభవము ననుభవించినవారము కాఁజాలము.

భావోద్రిక్తతా నిమగ్నుఁడైనపుడే పురూరవుని సుస్వరూపము మనకు విశేషముగా నభివ్యక్తమౌను. అతని కవితా స్వభావ వైశిష్ట్యము; జీవిత లక్ష్యమందలి యాతని యనురక్తి; దుర్బలముగాని యాతని యాదర్శవాదము; మనోవాంఛాసాఫల్యమునందు స్వేచ్ఛాసంవిచారిణి యగు విధినిగూడ వశీకృతపఱుచు నాతని యదృష్టము; మనకీ దృశ్యమున సుస్పష్టముగ కనులకుఁగట్టును. భావనావిశిష్టత; వివరింపఁబడినది. ఎంతటి దక్షులైనను వారి కళాకౌశలము, సక్రమ క్రియా నిర్వహణము నెట్లు నిరోధించునో కూడ కొంత సూచింపఁబడెను. పురూరవునియందును నీ దుర్బల చిహ్నములు పొడకట్టక తప్పలేదు. ఔశీనరి యెదుటఁబడినపుడీ చక్రవర్తి యసహాయునివలె ప్రవర్తించును. అగ్నిమిత్రుఁడిట్టి సందర్భములం దింతికంటె సామరస్య పూర్వక సుభాషితములతో నిరాకరిని తృప్తిపఱుచును. సంగమనీయమణిని కోల్పోయినపుడు కూడ పురూరవుని ప్రవృత్తి విలక్షణముగనే యుండును. పరివ్రాజక, విశదా నగరమునకుఁ బయనించు సమయమున, మార్గమధ్యమున నడవిలో చోరులు బాధింతురు. ఆ కథ విన్నపు డగ్నిమిత్రుఁడు వారిని తన నిశిత నారాచములకు గురిచేయునంతటి యుత్సాహమును జూపును. పురూరవుఁ డిట్లుకాదు. ఆపత్సమయములందును నీతఁడు రమ్యోపమలతోనే భాషించును. మణితో మింటియందు భ్రమించు గద్ద "కాలవి గిలిగిలి దిరిగొను తెలుఁగుదోఁప, రంగ రేఖావలయము లేర్పఱచున"ని వర్ణించును. "ఇప్పుడేమి చేయవలయును"ని యాతఁడు విదూషకుని నిస్సహాయునివలె ప్రశ్నించును. నిరంతర భావనానిమగ్న కవితాత్మగల వ్యక్తి, నాత్మ సన్నివేశముల నెదుర్కొనవలసి వచ్చినపుడెల్ల నిట్టే వాటిల్లును. ఇట్టి నిర్వీర్యత పురూరవునిలో బహుకాల శృంగారరస నిమగ్నతచే నేర్పడినది. ఇట్లశక్తతను ప్రదర్శించిన చక్రవర్తియే సమయము వచ్చిన "సురాసుర సంగ్రామ" ముఖమున నిలువఁబడ గల్గిన మహారథుఁడని మనము గుర్తింపగలము. పురూరవుని శీలమిట్లు సమయోచితముగ సవదరించుట కనుకూలమైన మార్దవము కలది. ఇది యిట్లుండ, నీతనిలోఁ గొన్ని నైతిక దోషములు కూడ స్ఫురించును. పురూరవుఁ డాదర్శ చక్రవర్తిగను; నాదర్శ గృహస్థుఁడుగను; నొకవంక దేవతలకు, మరియొకవంక మతమునకు హితముచేకూర్పవలయునని యాశించెను. కాని యూర్వశి పురూరవుల పునస్సమాగమానంతరము "ప్రతిష్ఠానమునుండి నీవు వచ్చి చిరకాలమైనది. ప్రకృతులు నాపై అసూయ వహింతురు. కావున మరలుదాము"ని యూర్వశియే జ్ఞప్తిసేయునుగాని పురూరవున కీవిషయమే స్మరణయందున్నట్లు తోఁచదు. 'ఔశీనరి'పట్ల నీతఁడు గౌరవప్రేమలను ప్రకటించును. అది తన విధ్యుక్త ధర్మమని యాతఁడు భావించును. ఆమెతో నెంత మార్దవముగ మాటాడినను, నెంతి మృదులముగ ప్రవర్తించినను; నవి యాతని కాపట్యమునే ప్రకటించును. అగ్నిమిత్రుఁడు ధారణీరాణులపట్ల ప్రదర్శించిన దగూ దాక్షిణ్య సద్భావ సమృద్ధి, యీతనిలో మృగ్యమనిపించును. చరమాంకమున నాతఁడు మతసంబంధమగు మానసిక విశ్రాంతి ననుభవింపవలయునని యారాటపడును. ఇది 'ఠంపర్ సన్' కథలోని రాజలాంఛనమును బోలినది. కాని పురూరవునకు మత నియమాచరణ మనివార్యమనిపించును. ఈతఁడు దేవతా సదృశుఁడగు చక్రవర్తి. అందుచే మానవకురదృష్టము లాతని మనసున కెక్కవు. వానియందాతనికి సత్త్వములేదు. నెపోలియన్ కూడ తాను మానవుఁడుగా నవతరించిన దేవేంద్రుఁడనని యహంకరించెను. విశాలోజ్జ్వల మేధాసని పద్విశిష్టుఁడు; నిరంతర తీవ్ర కార్యోన్ముఖ వీరుఁడునైన నెపోలియన్ చక్రవర్తి యవ్యవస్థిత ప్రవర్తనఁగల్గి, వివేకముతోఁ బ్రశాంతముగాఁ బ్రవర్తింపఁజాలనట్లే, ఇంద్రియలోలుఁడు, భావుకుఁడునైన పురూరవుఁడు గూడ నిష్ఠను మత నియమాచరణమునందు నిష్ఠాసక్తులను ప్రతిష్ఠింపఁ జాలకపోయెను. ఇట్టి యీ కవితాయోద్ధ ముఖమునుండి, కాళిదాసు, సనాతన కఠినమత నియమానుష్ఠానాదర్శమును, ఇంద్రియలోలుఁడైన సామాన్యమానవునకెట్లందని మ్రానిపండో! విమర్శించి ప్రతిఘటించు నద్భుత పద్యరాజము నొకదానిని వినిర్గతమొనర్చెను.

"వేదజడుండు ప్రాఁతపసి, పేతసమస్త
కుతూహలుండెటుల్
శ్రీ దొలఁకన్ మనోహరముఁజేయఁగ నేర్చెడి
నిట్టి రూపమున్"

ఇట్టి యీ నాయక పాత్రమందు, తక్కిన సామాన్య పురుషపాత్రలు విలువలఁబోవుచున్నను, ప్రధానపాత్రశీలమునకివి యుపపోషకములు, రథచోదకుఁడు; వేటకాఁడగు వేఁటకుఁడు; కంచుకి యగు లాతవ్యుఁడు; విదూషకుఁడగు మాణవకుఁడు; నిట్టివారలే. సూతుఁడును, వేఁటకుఁడును, నాయకుని యాత్మీయత నుద్దీపింపఁజేయుచు మంజులాలాపములఁ గావింతురు, కథాగాంభీర్యమునకు వీరు యథాశక్తిని తోడ్పడుదురు.

# కలగూరగంప



## శిలార వంశరాజుల పాలనము

శ్రీ కొత్త భావయ్యచౌదరి

బీజపూరుజిల్లాలో 11, 12 శతాబ్దములందు తర్దవాడియను వెయ్యి గ్రామముల ఖండ మొకటి శిలార వంశ రాజుల పాలనలోనుండి ప్రసిద్ధి కెక్కెను. ఆ మారుమూల ప్రదేశములో గూడ హిందూమతమును జైనమతమును పోషింపబడుచుండెను. మన మొటిగి నంతలో హనుమంత దేవాలయ మచటనే క్రమముగా స్థాపింపబడినట్లు కనబడుచున్నది. కాకతీయరాజుల దేవళములందువలెనె స్వయంభూ సోమనాథ, స్వయంభూ రామేశ్వర దేవాలయములు గూడ ఆ ప్రాంతములందు కనబడుచున్నవి. దేవగిరి, తిడవిల్లి, రూగి మున్నగు ప్రదేశములలో వీరి దానశాసనములు కనబడుచున్నవి. ఎలమేలవాడు గూడ వీరి పాలనలో నుండెను. కదిరెవాడలోని స్వయంభూ దేవళము దక్షిణకాశిగా నపుడు పేరొందెను. శకవర్షములు 941 సం॥లో రూగిలో శిలారవంశజుడగు మహాసామంత ధనసంగ్రహరస యను నతడు హనుమద్దేవళము వద్దగల నగరేశ్వరునకు దానమిచ్చి శాసనము వ్రాయించెను. తిడవిల్లి గ్రామములో గూడ నతని దానశాసన మొకటి కలదు. ఇతడు కైలాసనృపుడనువాని కుమారుడు.

తర్దవాడి 1000 గ్రామములను పాలించుచు దర్వాత చాండరసయను రాజు సర్వేశ్వరమునికి గొంత భూమి నిచ్చెను. సోవియరసయను రాజు నగరేశ్వర స్వామి కొక దానమిచ్చి శాసనము వ్రాయించెను.

చాండరస కుమారుడు బండరసయను రాజు అమరేశ్వరమునికి నూరు గ్రామములను దానమిచ్చెను. ఆ ముని యచటి దేవాలయము లన్నిటికిని ఆచార్యుడుగా నుండెను. అందుచే వాని పోషణకై యాతని పేరిట నా గ్రామముల నిచ్చి పేరొందెను.

చా. వి. 2, 7 సం॥లందు (1077, 82 సం॥లో) యీ శిలారవంశములోని ఉదయాదిత్యరస, సెంగరస యనువారు మహాసామంతులుగా నుండి యచటి చాండీశ్వర దేవునకు గొన్ని దానముల నొసంగిరి. ఈ చాండీశ్వర దేవళము వారి పూర్వులలోని చాండరస పేర గట్టించి యుందురు.

క్రీ. శ. 1109 సం॥ (చా. వి. 34) మహామండలేశ్వర గావనరస యను శిలారవంశరాజు అగర్తెదిలోని భైరప్ప గుడికి దానములిచ్చి శాసనము వ్రాయించినాడు. బీజపూరునందు చా. వి. 49 సం॥లో యీ శిలారవంశములోని సింగరస సామంతుడు ఒకడు ఒక దానశాసనము లిఖించెను. అందుచే నచ్చట సింగరస పాలన యున్నట్లు స్పష్టపడుచున్నది. వీరు పశ్చిమ చాళుక్య త్రిభువనమల్ల (II) సామంతులుగా కనబడుచున్నారు.

క్రీ. శ. 1168 లో రాయమురారి సోవిదేవుని సామంతుడుగా మహామండలేశ్వర సింగదేవరస యను శిలారవంశజుడుండి అచటి స్వయంభూ దేవళ ఆచార్యుడగు సోమరాశిదేవ పండితునకు దానమొసంగి శాసనము లిఖించెను. మహాప్రధానియగు కుమార బొమ్మిదేవరస గూడ నొక దానమిచ్చెను. ఇది రాయమురారి సోవిదేవుని 8 వ పాలన సం॥లో నీబడినది. ఆ సం॥రమే (శక 1090) జైనదొర జైనాలయమునకు, స్వయంభూ దేవరకు శిలారవంశమండలేశ్వరుడు దానము లిచ్చెను. అప్పటికింకను రాజులు జైనమత దేవళములను పోషించుచున్నట్లు దీనివల్ల స్పష్టపడుచున్నది. ఈ కాలము జగదేకమల్ల III కాలముగా గనబడుచున్నది. భూలోకమల్ల శివ రాజ్యపాలన సం॥ (బహుశః 1076 సం॥) లో సింగరస కొడుకు సోవి

రస యనువాడు స్వయంభూదేవరకు కొంత బంగారును దానమొనర్చెను. జగదేకమల్లుని పాలనసం॥లు, 2,9 సం॥లందు మహామండలేశ్వరుడును శిలారవంశజుడును నగు సోవిదేరసన పాలనలో అప్పరదయనువాడు ఎరంగులు నందు చెర్వుకు భూదానమిచ్చి పేరొందెను. సోవిదేవుడు కూడ కొంత దానమిచ్చెను. చా. వి. 49 సం॥లో నవగా క్రీ. శ. 1124 సం॥లో మహామండలేశ్వర పెరియగావనరస, దాకరసయనువారు భోగేశ్వరదేవునకు కొన్ని దానములిచ్చి శాసనము లిఖించిరి. వీరు జీమూతవాహన వంశమువారమని చెప్పుకొనిరి. పైన నుడివిన గావనరసయూ, వీరును ఒకే వంశము వారుగా గనబడుచున్నందున వీరు కూడ శిలారవంశజులే యనవచ్చును. వీరు త్రిభువనమల్ల II సామంతులు. శక 1108 (క్రీ. శ. 1185 సం॥)లో గోవగేయ నేల వీడునందు త్రిభువనమల్ల పాలించుచుండగా శిలార వంశజుడగు అన్నమరసపాలన కనబడుచున్నది. రొలమిల ప్రాంతమున కితడు పాలకుడుగా నుండి, మహామండలేశ్వర బిరుదమును వహించి, యచటిదేవుని కొరకు ఆచార్య సోమరాశి పండితునకు భూదానమిచ్చి పేరొందెను.

శక 1048 సం॥ ప్రాంతమున కరద్ శాఖ శిలార వంశరాజులు పాలించిన నిదర్శనములు చిక్కుచున్నవి. వల్లవాడగ్రామము వీరికి రాజధానిగా నుండెను. వీరి తామ్రశాసనము లిటీశల యూకు దొరికినవి. గండరాదిత్యుడనువాడా కాలమున రాజ్యపాలన మొనర్చెను. ఈ వంశములో మొదటి పాలకులు జతిగ I, తర్వాత గూవల, భోజదేవ, బల్లాల మున్నగువారుండిరి. గూవల, భోజదేవులు గండరాదిత్యునికి అగ్రసోదరులై యుండిరి. ఖేదాదిత్య దేవాలయమునకు, అచట బ్రాహ్మణ భోజనములకు గండరాదిత్యుడు భూదానమొనరించి ప్రసిద్ధి జెందెను.

ఈ శిలారవంశ రాజు లిట్లెం కన్ని చోట్ల సామంత రాజులుగా నుండిరో తెలియుటలేదు.

శక 1115 (క్రీ. శ. 1193 సం॥) సం॥ నాటికే ప్రాంతము యాదవరాజుల పాలనలోకి వచ్చినను, శిలారవంశజుల సామంతిత్వమునకట్టె యాటంకము రాలేదు. ఆ సం॥రమే శిలారవంశ మహామండలేశ్వర గావనరసయనువాని శాసనములు భూదానములు కనబడుచున్నవి. యాదవరాజగు సింగన కాలములో దేవగిరి యందు మహామండలేశ్వర బొమ్మిదేవరసయను శిలారవంశజుడు హేమేశ్వర దేవాలయమును కట్టించి దానికి కొంత భూదానమిచ్చి శాసనము లిఖించెను. ఇది ఎరంగల్లులో కట్టింపబడెను. దేవగిరికి చేరువలో ఎరంగల్లను పేరుండుట గమనింపదగినది. లేదా యచటి కొంత ప్రాంతమునకా పేరు పెట్టియుందురు. ఇది ఒరంగల్లునకు నకలు కావచ్చును. శిలారవంశజులు శైవ భక్తులైనను, జైన, శైవమతములు రెంటిని పోషించి, రెండు శతాబ్దులు చక్కగా పాలించిరి. వీరిపాలన ప్రదేశమంతయు కన్నడ ప్రాంతముగా నున్నది. కన్నడదేశ (కర్నాటక) చరిత్రలో వీరికి సముచిత స్థానము కలిగింపదగియున్నది. వేంగిదేశమున రాజరాజ నరేంద్రుని కాలమున మేఘగిరివాద బిరుదుగల నాగవంశ భీమరాజు విజయాదిత్యునికి బాసటగా నుండెను. అతడీ కులజుడే కావచ్చునేమో!

మ. రా. ఈ వ్యాసమునకు మద్రాసు 'ఎపిగ్రాఫికల్ రికార్డులు' ఆధారము.

# గ్రంథ విమర్శనము

## రామాయణ విశేషములు

పరిశోధక వ్యాససంపుటి. రచయిత: కీ. శే. సురవరం ప్రతాపరెడ్డిగారు. ప్రచురణ: ఆంధ్రరచయితల సంఘం, హైదరాబాదు వెల: సాదాప్రతి రు. 3-0-0. గ్రంథాలయ ప్రతి: రు 3-8-0.

ఈ వ్యాసములను స్వర్గీయ శ్రీ ప్రతాపరెడ్డి గారు 1941 ప్రాంతంలో రచించి, మొదట 'విభూతి' పత్రికలో వరుసగా ప్రకటించారు. పిదప కొంతకాలానికి వాటికి గ్రంథరూపం కల్పించారు. వాటిపై వచ్చిన ఖండనమండనవాదులను, అనంతరం తాము చేసిన పరిశోధనల సారమును సమన్వయించి శ్రీ రెడ్డిగారు ఆ గ్రంథములో ఎప్పటికప్పుడు కూర్పులు మార్పులు చేసి పునర్ముద్రణ కుపక్రమించారు. ఈ ఉద్యమం కొంత సాగి ఆగిపోయింది. పిమ్మట రెడ్డిగారు కాలంచేశారు. వారి శిష్యులు, ఆంధ్ర రచయితల సంఘ కార్యదర్శి అయిన శ్రీ బి. రామరాజుగారు, రెడ్డిగారి యందు గౌరవ ప్రతిపత్తులు గల కొందరు మిత్రుల సహాయంతో ఈ గ్రంథపునర్ముద్రణకు పూనుకొన్నారు. కాని, రెడ్డిగారు రెండవపర్యాయము ముద్రింపించిన దానిలో కొంత భాగము, మిగిలిన వ్రాతప్రతి మాత్రమే వారికి లభించినవి. అందువలన నష్టమయిన భాగములను ప్రథమ ముద్రణ ప్రతిలో ఉన్నప్రకారం పూరించారు.

ఈ గ్రంథంలో రెడ్డిగారు ముందుగా ప్రాచ్య పాశ్చాత్య పురాణములలో రామాయణ ప్రాశస్త్యమును వివరించారు. రామాయణ కాలమును గురించి ప్రాచ్య ప్రాగ్య విమర్శకుల నేకుల అభిప్రాయాలను క్రోడీకరించి, /చివరికి వాల్మీకి రామాయణ రచన మొదట క్రీ. పూ. 2500 ప్రాంతములో జరిగి ఉండాలని సోపపత్తికంగా సిద్ధాంతీకరించారు. రామాయణ కాలములోని వారగు "సుగ్రీవ, హనుమంత, పరసురామ విభీషణాదుల చిరంజీవిత్వమును, భారత కాలములో గూడ వీరు ఉండిరను కథలు" విశ్వసనీయములు కావని, "రామునికిని, కృష్ణునికిని మధ్య ఇంచుమించు 800 సంవత్సరములు గతించి యుండును" అనినిర్ణయించారు.

రామాయణమున అయోధ్యకాండ మొదలు కొని, యుద్ధకాండ అంతమువరకు మాత్రమే వాల్మీకి రచన అయి ఉండవచ్చుననీ, అటుపిమ్మట యెవరో బాల, ఉత్తర కాండలను చేర్చి రామునికి విష్ణ్వవతారత్వమును గట్టిపెట్టిరనీ జాకోబీగారు చేసిన నిర్ణయమును రెడ్డిగారు ఆమోదించారు.

రాముని విష్ణ్వంశావతారముగా అభివర్ణించే భాగాలన్నీ ప్రక్షిప్తాలనడానికి రెడ్డిగారు రీతి చూపిన వాదములు సమంజసములుగ కనిపించవము లేదు "క్రీ.శ. 300 ప్రాంతములో నుండిన ట్లూహింపబడుచున్న" అమరసింహుడు అమరకోశములో విష్ణువు పర్యాయ పదాలలో 'దేవకీ నందనుడు', 'బలిధ్వంసి' అనే కృష్ణుని పేర్లను కూడా పేర్కొని రాముని పేరును వదిలి వేశాడనీ, అందువలన అమరసింహుని నాటికి దశావతార తత్త్వమే ఏర్పడలేదనీ ఆయన తరువాత కాలములో ఎవరో రాముని అవతారమూర్తిగా కల్పింపదలచి, ఆయా భాగాలను రామాయణములో చేర్చారనీ వారు పేర్కొన్న ప్రధానమైనవాదం. అమరసింహుడు బౌద్ధుడు గదా! దేవవర్గములో అతడు ముందుగా బుద్ధుని పేర్లు చెప్పిన మీదట గాని బ్రహ్మవిష్ణు మహేశ్వరుల ప్రసక్తి ఎత్తుకొనలేదు గదా! పైగా, కృష్ణ, వాసుదేవ, కంసారాతి, బలిధ్వంసి — ఇత్యాది అన్యావతార నామములను విష్ణు పర్యాయపదములుగా పేర్కొనిన అమర సింహుడు రాముని పేరును వాటిలో చేర్చక పోయినంత మాత్రాన ఆ నాటికి దశావతార భావనయే రూపొంద లేదని సిద్ధాంతీకరించడం సబబుకాదు. కృష్ణ, వామనావతారములను అమర కోశము విష్ణు పర్యాయ పదములుగ నుదహరించినప్పుడు దశావతార తత్త్వమప్పటికి లేదనుట పొసగదు.

ఇదే విధమున, అమరసింహుడు 'ధీవర్గమందు గాని, వాగ్వర్గమందుగాని వాల్మీకిని పేర్కొనలేదు.' గనుక అతని కాలమువరకును రామాయణమునకు మహాకావ్య ప్రశస్తిగాని, వాల్మీకికి ఆదికవి బిరుదముగాని లేవనికూడా చెప్పవలసి వస్తుంది. ఇదేసిద్ధాంతమయితే అటు పిమ్మట ఎప్పుడో, ఎవరో ఆనాటికి 2800 సంవత్సరములకు పూర్వము రచింపబడిన ఈపాత పురాణమును దుమ్ముదులిపి బయటకుదీసి, రాముని విష్ణ్వవతారముగాను, వాల్మీకిని ఆదికవిగాను, రామాయణమును ఆది మహాకావ్యముగాను చేసినట్లు నిరూపించవలసివస్తుంది. అట్టి ప్రయత్నమును రెడ్డిగారుగాని వారి ఈ వాదమునకు ప్రోత్సాహకులయిన ఇతర విమర్శకులుగాని చేసినట్లు కనబడదు.

రామాయణమునందలి వివిధ పాత్రలను పోషించిన తీరును గురించి, వాల్మీకి భావములను వ్యాస కాళిదాస ప్రభృతి కవులెల్లనుకరించినది రెడ్డిగారు సోదాహరణముగా వివరించారు. రామాయణకాలము నాటి సాంఘికాచార వ్యవహారాదులను, భూగోళమును అభివర్ణించి చాలాచోట్ల పరస్పరభిన్నంగా ఉన్న వర్ణనలనుగురించి లోగడ ఇతర విమర్శకులుచేసిన చర్చలను ఉటంకించి వాటిపైన తమ అభిప్రాయాలను సూచించారు. మన పురాణంలోని సప్తద్వీపములు, సప్త సముద్రములు నేడు ప్రపంచంలో ఎక్కడెక్కడ ఏయే పేరులతో వ్యవహరింపబడుచున్నదీ వీరు (నందాలాల్ గ్రంథం లోనుంచి) ఉదహరించారు. క్షీరసముద్రము నేటి కాస్పియన్ సముద్రమనీ, సరైన్, దహి అను పేరతో నేడు వ్యవహరింపబడుచున్న నదులే నాటి సుర, దధి సముద్రాలనీ వారు ముడిపెట్టిన తీరు మనోరంజకంగా ఉంది.

కిష్కింధ మన హంపీ ప్రాంతంలోని పంపా పరిసర ప్రదేశమే అని వీరు నిర్ణయించారు. నర్మదానది జన్మస్థాన ప్రాంతములో కిష్కింధ ఉన్నదని, అక్కడె మరొక పంపా సరస్సు కూడా ఉన్నదనీ యం. వి. కిబేగారు చేసిన ప్రతిపాదనను నిరాకరించుటకు చాలా హేతువులున్నను రెడ్డిగారెందువలననో వాటిని వివరించలేదు.



లంక యెచ్చట? — అను శీర్షిక క్రింద ఇతర విమర్శకుల అభిప్రాయములను కొన్నింటిని తెలిపి, స్వయముగా వీరొక విలక్షణమైన నూతన ప్రతిపాదన చేశారు. ఇది రామాయణ విమర్శకులందరు అవశ్యము విచారింపదగినది. "లంక అను పదము గీర్వాణపదము కాదు. అది తెలుగుదేశపు ఆదిమ నివాసుల పదమే యై ఉండును. గోదావరి డెల్టాభూములను లంకలు అని నేటికిని అందురు. అట్టి లంకయే, ఏదోయొక గోదావరి లంకయే రావణుని లంకయై యుండును. గోదావరి నదినిదాటి రాముడు లంకను ముట్టడించి యుండును. ముండాలు అను జాతివారు చాలా ప్రాచీనులు...అటి ముండాజాతిలోని ఒక శాఖకు ఉరోవన్ అను పేరు కలదు. నేటికిని తమిళభాషలో రేఫకుముందు ఇకారము నుచ్చరింతురు. వ్రాయుదురు. ఉరోవన్ అనునది రోవన్ అగును. అనగా రావణ అను శబ్దమునకు సమీపమన్నమాట. ఉరోవన్ జాతివారు నేటికిని ఆటవిక స్థితిలోనున్నారు. విశేషమేమనగా తాము రావణ సంతతివారమని వీరు చెప్పుకొనుచున్నారు. అనగా రావణ శబ్దము జాతి బిరుదమే కాని, ఒక వ్యక్తి నామము కాదు. రావణుడు ఉరోవన్ జాతిలోని వాడనియు, వారి రాజనియు ఊహించిన రావణుని లంకయు ముండాజాతివారుండు ప్రదేశమందే ఉండి యుండును. రావణుని సేనానులగు ఖరాదులు జనస్థానములోని పరిపాలకులు, "జనస్థానము" అను పదము శబరల 'జైతాన్' పదమే యై ఉండును. కావున, ముండాలు, శబరలు ఉండు ప్రదేశములోనే లంకను వెదుకవలె"నని రెడ్డిగారి సూచన.

ఈ విధంగా శ్రీ రెడ్డిగారు రామాయణమును గురించి చేసిన పరిశ్రమ అనల్పమైనది. ఇంత చేసిన ఆయన అహంకారలేశమైనా లేకుండా, "నేను చేసిన చర్చలలో, ఇచ్చిన అభిప్రాయములలో విశేషభాగము తప్పులుండవచ్చును. తప్పులు చేయని వారెవరు? వాటిని పండితులు విమర్శకులు, పరిశోధకులు సయుక్తికముగా ఖండింపవచ్చును. తప్పులుండిన సవరించుకొందును. క్రొత్తసంగతులు తెలిపిన నేర్చుకొందును" అని సవినయముగ చెప్పుకొనడం వారి ఉదాత్త తత్త్వాన్వేషణ దీక్షకు నిదర్శనం.

శ్రీ రెడ్డిగారి ముద్రితా ముద్రిత గ్రంథాలన్నింటిని ప్రకటించి, వాటిపైన వచ్చే రాబడి నొక నిధిగా ఏర్పరిచి, దాని వడ్డీతో హైద్రాబాదులో వాఙ్మయ పరిశోధన చేసేవారికొక ఉపకారవేతనం నెలకొల్పడానికి సాగుతూన్న ఉద్యమం సఫలమయితే, అది స్వర్గీయ శ్రీ ప్రతాపరెడ్డిగారికి సముచిత సత్కారం అవుతుంది.

సిం.సు.

# గ్రంథ విమర్శనము

## సిపాయి పితూరీ

ఖండ కావ్యం. రచయిత: శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు, ప్రచురణ: ఆదర్శ సాహిత్య మాల, డబీర్ పురం వెలుపల, హైదరాబాదు-2. వెల: 62 న. పై.

నూరేండ్ల క్రిందట భారతజాతికి దాస్యశృంఖలపు టుచ్చులను బిగించుచుండిన ఆంగ్లేయ సామ్రాజ్య వాదుల ఆట కట్టింపదలచి దేశమందంతట ఒక్కుమ్మడిగా ప్రజ్వరిల్లిన ప్రథమ భారత స్వాతంత్ర్య సమరాన్ని సంస్మరిస్తూ శతవార్షికోత్సవాలు జరుపుకుంటూన్న ఈ సమయంలో ఆ చరిత్రాత్మక గాథను కవితామృతాకృతి సంతరింప బూనిన ఈ కావ్య ప్రచురణ కర్తల ఆశయ మభినందింప దగినది.

సుమారు 150 పద్యాలతో కూడిన ఈ ఖండ కావ్యవస్తువు సంగ్రహంగా ఇది. ఒక రోజున "మీరటునందు శీతల సమేధితమౌ ఒక చెట్టు నీడలో" "విప్లవ ప్రజ్వలితచిత్తు" లయిన సిపాయిలు కత్తులు నూరుతూ కూచుని, భారతీయ సైనికులపట్ల ఆంగ్లాధికారుల సవతి తల్లి ప్రేమనుగురించి వారి అత్యాచారాలను గురించి చర్చించుకుంటారు.

"నేల బరచిన జిగి తివాసీల పోలు
పచ్చ బయళులందు తయస్సు పసిమిగ్రమ్మ
నిలిచి బసవేశ్వరగుంపు ఖణిల్లు మనుచు
అంకె వేయుటలేదు నిశ్శంక రీతి"

అంటూ ఆంగ్లేయుల పాలనలో దేశ దౌర్భాగ్య స్థితిని దలచుకొని ఉత్తేజితు లవుతారు.

"హైందవు లందురా! మనకు నన్నలు
దమ్ములు స్వర్గసౌఖ్య ని
ష్యందినియైన భారత మహాస్థలి
యుర్వర గన్నతల్లి!"

అంటూ ముసల్మాను సైనికులు కూడా హిందువులతో చేతులు గలుపుతారు. ఈ సౌదర్యానికి ప్రతిఫలంగా

"దొరల కత్తుల నీడ నాదగువు లేక
నిలచియున్నాడు వేదవా విభృతమూర్తి
పాదుషా! దచ్చిరాన దీక్షచ్చి రత్న
రత్న జటల కిరీటంబు గ్రాలుగాత!"

అని హిందూ సైనికులే ప్రతిపాదిస్తారు. దానితో—

"ప్రతి వీరుని మనసు సము
త్థిత మధురోత్సాహకళిక దరలుగ బారెన్
ప్రతి ఖడ్గము దాహాకే
శిత నొరలోనుండి వెలికిజ్ఞరుక"—లేచింది.

"మెరికలు వేసివేసి ఉసుమీసుము విక్షురశాకవానికి సైలియకాసే కరంబు."

మరవాగు తెల్లవారుతూనే సిపాయి లంతా ఆంగ్లేయ సైన్యం పైబడి నుగ్గునూచం చేశారు. ఇచటి యుద్ధవర్ణన కవిబ్రహ్మ తిక్కన దివ్యశిల్పాన్ని స్మరణకు తెస్తూంది.

"ఒక సైనికుని కత్తి జెకఛక చిరుమంట
లార్పు బంటను ద్రిప్పవట్టి కోరివి,
ఒక బల్లె మూగిన దుయ్యాలవలె గ్రక్కు
కొని రక్త గరళంబు కోడె నాగు,
ఒక తుపాకీ శత్రు మురిమి దూచినది ద
ప్పరము దాకాము గ్రమ్మ భద్రకాళి."

"కడుపులనుండి ప్రేవుల నికాయము బాముల
వోలె వ్రేల సె
క్కుడు రథసంబునన్ దురిమికొంచునులోనికి,
ముంగు దూకి వ
చ్చెడు శౌక రాతుగాంచి యరచెన్ దొరఘోటిలి."

దొర గుంపులు నేల గూలినవి. సిపాయి దండను "పడిన పరంగి మొండెములపైనసె దూకుచు" పోయి పాదుషా బహదూరుషాకు విజయ వార్త తెలిపింది. "ఆత్మవంశమువలెనే మణుల్చిటిలి సందులు దేలిన గద్దెనెక్కి కొల్వమరి" చిన "సులతాను తల వెలిగ గుచ్చుల తలపాగ హిరణ్యరత్న శోభితమయి."

కాని దైవవిధి! "వచ్చిన దంతలోనె ననివారణ సైన్యము."

"తనవలెనె గత్తిబూని యుద్ధమున నిలిచి
కొన్న తమ్ముని కంఠ మాకొన్న యన్న
నరకె నప్పుడు శోక బంధురిత ప్రకృతి
హృదయమున కోటి ఖడ్గము లగదలి పోదల."

"ప్రబల తరమైన జన్మ ప్రవాసదీక్ష
బడెరు సులతాను తలపైని బిడుగువలెనె
భారత చరిత్రయను చిత్ర వనమునందు
దగులబడిపోయె నపుడు స్వాతంత్ర్య శివము."

ఈ రచయిత ఆంధ్ర రసిక లోకానికి చిర పరిచితులు. ఈయన ఇటీవలి రచనల రుచి మరిగినవారికి ఇది కొంత లేతపాకముగా గనిపించవచ్చు. ఈ కావ్యము ఇరువది యేండ్ల క్రిందట రచింపబడినదని ప్రచురణ కర్తలు ఈ గ్రంథావతారికలో చేసిన సూచన ఈ విషయాన్ని వ్యంగ్యం చేస్తూంది.

కాని, పూవు పాలుపు పూవుది. మొగ్గ మురువు మొగ్గది. రచయితలో కాలక్రమేణ మూసు పూవు లారు కాయలై వెలసిన కవితా కోశలానికి బీజాలు ఈ ఖండ కావ్యం అంతటా పుష్కలంగా దొరుకుతున్నవి.

సిం.గు.

## శబరి

పద్యకావ్యం: రచన: శ్రీమతి భోగరాజు చిట్టెమ్మ. ప్రాప్తిస్థానం: పూళ్ళ పల్లభరాయుడు, పూళ్ళ (పోస్టు), పశ్చిమ గోదావరిజిల్లా: వెల రు 1.

వాల్మీకి రామాయణంలో శబరిచరిత్ర మధురాతి మధురమైనఘట్టం. ఇది అనేకమంది భక్తులనూ రసికులనూ కూడా ఆకర్షించింది. అధునాతనులలో అనేకమంది శబరిచరిత్రను కథావస్తువుగా సేకరించి, ఎవరికి తోచిన నూతన కల్పనలతో వారు, కావ్యాలుగానూ, నాటికలుగానూ, కథలుగానూ నానావిధాలుగా సంఘటించి కృతకృత్యులైనారు.

శ్రీ చిట్టెమ్మగారు అలాగే అనేక నూతన కల్పనలతో, ఆయిదు ఆశ్వాసముల ప్రబంధంగా ఈ చరిత్రను సంఘటించారు. శబరీ బాల్యవృత్తాంతాన్ని ఒకదాన్ని కల్పనచేశారు. కావ్యకళకు సంబంధించిన తళుకులు మెఱుపులు విశేషం లేకపోయినా, ధారాశుద్ధిగల పద్యరచనలో కథను భక్తిరస ప్రధానంగా ముచ్చటగా ఆసాంతం నిర్వహించారు. ముముక్షు జనులకు పఠనయోగ్యంగా వుంది.

## నా సత్యాన్వేషణము

[స్వీయచరిత్ర]

డాక్టర్ రాధాకృష్ణన్ స్వీయచరిత్రగా రచించిన 'My Search for Truth' అనే గ్రంథానికిది అనువాదం. అనువాదకులు శ్రీ బులుసు వేంకటేశ్వరులు: ప్రకాశకులు: బి. వి. అండ్ సన్సు, రామారావుపేట, కాకినాడ. మూల్యం రు 2/-

సత్యమనగా నిర్గుణబ్రహ్మ స్వరూపమనీ. సత్య సాక్షాత్కారమనగా నీశ్వర సాక్షాత్కారమనీ అనువాదకులు వ్యాఖ్యానించినారు. ఈ వ్యాఖ్యానానికీ గ్రంథస్థ విషయానికి ఎంతవరకు సంబంధం వున్నదంటే చెప్పలేముగాని తీవ్రమైన ఆవేశంతో తాత్త్వికరంగంలో ప్రవేశించి నిరంతరాన్వేషణలో విజయపరంపరను సాధించటానికి, డాక్టరుగారిని ప్రోత్సహించిన వాతావరణం ఎట్టిదో ఈ గ్రంథం సువ్యక్తం చేస్తున్నది.

పదియవ అంతర్జాతీయ మత మహాసభల ప్రారంభమునకుగా, డాక్టర్ రాధాకృష్ణన్ టోకియోలో చేసిన మహోపన్యాసాన్ని కూడా, అనుబంధంగా గ్రంథాంతమందు ప్రకటించారు. కే. సూ.

## స్వీకారము

శకుంతల: మహాకవి కాళిదాసు రూపకమునకు నవలారూపమున ఆంధ్రానువాదము: అనువాదకులు "న్యూస్ఫూర్తి" [టి. భాస్కరరావు, బి. ఏ. (ఆనర్సు)] ప్రాప్తిస్థానం: రచయిత, ఆంధ్రక్రైస్తవ కళాశాల, గుంటూరు, మూల్యము రు 1-25

హిందీ మనకు ఎందుకు అనవసరం రచన: 'హితవాది'; ప్రకాశకులు: ఆంధ్ర బుక్ హౌస్, సుల్తాను బజారు, హైద్రాబాదు 1; మూల్యం రు 0-50

క్రీనీడలు: నాటిక; రచన: శ్రీ కె. యల్. నరసింహారావు: ప్రచురణ: ఆంధ్ర బుక్ హౌస్, సుల్తాన్ బజార్, హైదరాబాదు—1. వెల రు 1/

భాగవతకథ (భాగవత దర్శనము): (చతుర్థ ఖండము) శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారిగారి హిందీ రచనకు అనువాదం; అనువాదకులు శ్రీ కుంకుర్తి వేంకట నరసయ్య. సాధన గ్రంథమండలి, తెనాలి; వెల రు. 2

శ్రీరాముని చరిత్రము: (శ్రీ పోతనార్య ప్రణీతము). భాగవతములోని శ్రీ రామచరిత్రకు శ్రీ కొలకుల నారాయణరావు విపులమైన టీకాతాత్పర్యముల సంఘటించారు; ప్రాప్తిస్థానము: శ్రీ కొలకుల నారాయణరావు నెల్లూరు. వెల రు 1/

అంజలి: ఖండకావ్య సంపుటి; గోదా గ్రంథమాల: శ్రీమన్నారాయణపురం, ఉల్లిపాలెం పోస్టు, కృష్ణాజిల్లా, వెల రు 1-50

సోమేశ్వర శతకము: రచన: శ్రీ రామవరపు నరసింగరావు; ప్రాప్తిస్థానం: రచయిత, ఛత్రపూర్, గంజాంజిల్లా, ఒరిస్సా. వెల రు 0-50.

ఆంధ్ర ముకుందమాల: శ్రీ కులశేఖర మహారాజు గీర్వాణభాషలో రచించిన 'ముకుందమాల' శ్లోకములకు ఆంధ్ర పద్యానువాదం; అనువాదకులు: శ్రీయుతులు మూలా పేరన్నశాస్త్రి, అనిపిండి వరాహ నరసింహమూర్తి; ప్రాప్తిస్థానం: ఎ. వి. నరసింహమూర్తి, పి. డబ్లియు. డి. ఆఫీసు, బిలాస్‌పూర్, మధ్య ప్రదేశ్, వెల రు 0-75.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.



# అమృతాంజనము

ఎంత భయంకరమైన
కాలి నొప్పి నైనా క్షణంలో ఉపశమింప
జేస్తుంది

లక్షలాది ప్రజలు 1893 నుండి
నిరంతరంగా అమృతాంజనాన్ని వాడు
తున్నారు. అమృతాంజనము బెణుకులు,
వాపులు, తలనొప్పి, పక్కపోటు, జలుబులు,
దగ్గులు మొదలైన వాటిని ఉపశమింపజేస్తుంది.
అమృతాంజనము
అన్ని నొప్పులకు
దివ్యామృతము.






అమృతాంజన్
లిమిటెడ్.
మద్రాసు-1, బొంబాయి-1, కలకత్తా-7.